PRSVM02A119

సాహిత్య
ప్రస్థానం
జనవరి - మార్చి 2006

సంపుటి : 4 సంచిక : 14

# విశాల లక్ష్యాల దిశగా...

సాహితీ స్రవంతి నూతన కర్తవ్యాల సాధనకు సన్నద్ధమవుతున్నది. ఖమ్మంలో జరిగిన కార్యశాల ఈ దిశలో అనేక కీలకమైన నిర్ణయాలు తీసుకుంది. భవిష్యత్ పథానికి రూపకల్పన జరిగింది. అందులో వినూత్నమైన అంశాలు చాలా వున్నాయి. వాటి తాలూకూ వివరాలు లోపల చూడొచ్చు.

సాహితీ స్రవంతి పక్షాన కార్యశాలలోనూ, జిల్లాలలోనూ కూడా అనేక నూతన సంకలనాలు, కొత్త పుస్తకాలు విడుదలయ్యాయి. విస్తృత కార్యక్రమాలు జరిగాయి. ఇంకా పలుచోట్ల సన్నాహాలు సాగుతున్నాయి. ఈ కృషి నిర్దిష్ట రూపం తీసుకోవడానికి, నిర్మాణాత్మకంగా నడవడానికి అందరి సహకారం అవసరం. ఇందుకు సంబంధించిన ఎలాంటి సూచనలకైనా స్వాగతం.

★★★

ప్రస్థానం పత్రిక మూడేళ్లు నిర్విఘ్నంగా పూర్తి చేసుకుంది. గతం నుంచి చెబుతున్నట్టుగా ఈ సంచిక నుంచి చందాలు స్వీకరించాలని నిర్ణయించినట్టు తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. ఇంతకాలం ఈ ఏర్పాటు కోసం కోరుతూ వచ్చిన సాహితీ మిత్రులు ఈ విశాల వేదికను అందరికీ చేరువ చేసేందుకు సహకరిస్తారని ఆశిస్తున్నాం. మీ ఆదరణే ప్రస్థానంకు ప్రాణం. మీకు తెలిసిన ప్రతివారినీ చందాదారులుగా చేర్చడం ద్వారా పత్రిక మరింత స్థిరపడటానికి తోడ్పడాలని కోరుతున్నాం.

★★★

దానితో పాటుగానే ప్రస్థానం నిర్వహణకు ఒక సంపాదకవర్గాన్ని, ఒక సలహా మండలిని ఏర్పాటు చేయాలని కార్యశాల నిర్ణయం తీసుకుంది. వచ్చే సంచికలో ఆ వివరాలు ప్రకటించగలము.

★★★

ప్రగతిశీల సాహిత్యకారుడు మల్లిక్, రచయిత రంధి సోమరాజు ఈ కాలంలో మరణించారు. సాహితీ స్రవంతి వారి మృతికి సంతాపం ప్రకటిస్తోంది.

★★★

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లిరవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేకనగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోను : 27660013, 27635136

1

# కొత్త తరాలకు సాహిత్య స్ఫూర్తినిద్దాం...

**సాహితీ స్రవంతి కార్యశాల విశేషాలు**

కొత్తతరాలకు సాహిత్య స్ఫూర్తినిచ్చే విధంగా రానున్నకాలంలో విభిన్న కార్యక్రమాలను నిర్వహించాలని ఇటీవల జరిగిన 'సాహితీ స్రవంతి' కార్యశాల నిర్ణయించింది. ఖమ్మం సీక్వెల్ రిసార్ట్స్‌లో రెండురోజుల పాటు జరిగిన ఈ కార్యశాలకు పద్నాలుగు జిల్లాలకు చెందిన సాహితీ స్రవంతి కార్యకర్తలు హాజరయ్యారు. ఈ సందర్భంగా ఏర్పాటుచేసిన ప్రముఖ కవులూ రచయితల ఫొటో ఎగ్జిబిషన్‌ను సాహితీ పెద్దలు రావెళ్ల వెంకటరామారావు ప్రారంభించారు.

ప్రారంభ సభకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో అమోఘమైన సృజన జరుగుతోందని, కొత్త కోణాలు ఆవిష్కృతమవుతున్నాయని అన్నారు. అకారణ సంవాదాలు, అవాంఛనీయ వివాదాలను నివారిస్తూ ఆరోగ్యకరమైన విజ్ఞానదాయకమైన పద్ధతులలో సాహితీ స్రవంతి ముందుకు సాగుతోందని, ఐక్యతా వాతావరణాన్ని పెంపొందిస్తోందని, సాహితీజీవులకు కొత్త ఉత్సాహాన్నిస్తోందని పేర్కొన్నారు. సుప్రసిద్ధ నవలాకారులు అంపశయ్య నవీన్ ప్రసంగిస్తూ తెలుగు సాహిత్యం శాఖోపశాఖలుగా విస్తరించి అనేక విధాలుగా అభివృద్ధి చెందుతోందన్నారు. వామపక్ష ఉద్యమ ప్రభావం వల్లనే తెలుగు సాహిత్యంలోకి ప్రగతిశీల భావాలు ధారాళంగా వచ్చాయని, కాలక్షేప సాహిత్యం తగ్గిపోయి సమాజాన్ని కలవరపెడుతున్న సమస్యలు సాహిత్యంలో ఎక్కువగా చోటు చేసుకుంటున్నాయని పేర్కొన్నారు. సుప్రసిద్ధ భాషావేత్త, విమర్శకులు చేకూరి రామారావు ప్రసంగిస్తూ, మన పాఠ్యాంశాల్లో అవసరమున్న దాని కంటే ఎక్కువగా వ్యాకరణాంశాలు, ఇతర భాషా విషయాలు వుండటం వల్ల విద్యార్థులకు ఆసక్తి తగ్గుతోందని అభిప్రాయపడ్డారు. అవసరమైన అదనపు విజ్ఞాన విషయాలు తెలుగులో అందుబాటులో ఉండటం లేదన్నారు. తెలుగు ప్రాచీనమైనదేనని, తెలుగు మాట్లాడే వారి సంఖ్య తగ్గుతున్న మాట వాస్తవమే అయినప్పటికీ పదిహేనుకోట్ల మంది మాట్లాడుతున్న భాష అంతరించి పోదని పేర్కొన్నారు. కొత్తగా వచ్చే జ్ఞానం తెలుగులోకి తెచ్చుకోవాలని సూచించారు.

పార్లమెంట్ మాజీ సభ్యులు, సాహిత్య అధ్యయనశీలి డాక్టర్ వై.రాధాకృష్ణమూర్తి ప్రసంగిస్తూ కవులూ రచయితలూ తమ రచనల ద్వారా ప్రజలను చైతన్యవంతం చేయాలన్నారు. "ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను కథావస్తువులుగా తీసుకోవాలి. వారి బాధల్నీ - గాథల్నీ రచనల్లో ప్రతిబింబించాలి. వెనుజులా నేత ఛావెజ్ అంత చైతన్యాన్ని రచయితలు పుణికి పుచ్చుకోవాలి. అట్లాంటి చైతన్యం, ఆలోచన, ధైర్యం పొందేందుకు ఈ వేదిక తోడ్పడాలని కోరుకుంటున్నాను" అన్నారు రాధాకృష్ణమూర్తి. ఖమ్మం జిల్లా కవుల సంచిక 'గుమ్మం'ను ముఖ్య అతిథి అద్దేపల్లి రామ్మోహనరావు ఆవిష్కరించారు. సంకలనాన్ని అంకితం పొందిన చేకూరి రామారావుకు సంచికను అందజేశారు. అద్దేపల్లి ప్రసంగిస్తూ ప్రపంచీకరణపై పోరాటం జరపనంత కాలం



ఫొటో ఎగ్జిబిషన్ ప్రారంభిస్తున్న రావెళ్ళ



వేదికపై గేయాలు ఆలపిస్తున్న కళాకారులు



అంపశయ్య నవీన్ ప్రారంభోపన్యాసం




జనకవనం సందేశమిస్తున్న భద్రాచలం ఎంపి బాబూరావు, మున్సిపల్ ఛైర్‌పర్సన్ సమీనా అఫ్రోజ్, జీవన్



'జీవన్మరణం' సంకలనాన్ని ఆవిష్కరించి, చేరాకు అందిస్తున్న అద్దేపల్లి, వేదికపై (కుడినుండి) అంపశయ్య నవీన్, తెలకపల్లి రవి, తమ్మినేని వీరభద్రం, డాక్టర్ వై. రాధాకృష్ణమూర్తి

మన భాషాసంస్కృతులను కాపాడు కోలేమన్నారు. ఆహ్వానసంఘం అధ్యక్షులు డాక్టర్ హరీష్ ప్రసంగిస్తూ రచయితలు రాజకీయ - ఆర్థిక - సాంస్కృతిక పరిణామాలను ప్రజలకు తెలియజేస్తూ, వారిని కర్తవ్యం వైపు నడిపించాలన్నారు.

పోలవరం ముంపు ప్రాంతాల్లో పర్యటించి వచ్చిన అనంతరం ఖమ్మం జిల్లా సాహితీస్రవంతి కవులూ రచయితలూ 'జీవన్మరణం' పేరిట కవితలు - కథల సంకలనాన్ని వెలువరించారు. ఈ పుస్తకాన్ని స్థానిక శాసనసభ్యులు తమ్మినేని వీరభద్రం ఆవిష్కరించారు. ఈ సందర్భంగా తమ్మినేని మాట్లాడుతూ పోలవరం గిరిజనుల ఘోషను ప్రజలకు వినిపించేందుకు పుస్తకాన్ని వెలువరించడం అభినందనీయమన్నారు. కార్యశాల నిర్వహణలో భాగస్వామి అయిన రవిమారుత్ మాట్లాడుతూ భాషా సంస్కృతులు సామ్రాజ్యవాద దోపిడికి గురవుతున్న తరుణంలో దీనికి వ్యతిరేకంగా పని చేయడానికి వలసిన ఉత్సాహాన్ని ఈ కార్యశాల అందివ్వ గలదన్న ఆకాంక్షను వెలిబుచ్చారు. జెడ్పీ ఛైర్మన్ చందాలింగయ్య ప్రసంగిస్తూ జిల్లాలో సాహితీ చైతన్యం కోసం కృషి చేస్తున్న సాహితీస్రవంతికి అభినందనలు తెలిపారు. డిసిసిబి ఛైర్మన్ టిఎస్ ప్రసాద్ మాట్లాడుతూ ప్రజలకు ఉపయోగపడే సాహితీ స్రవంతి కార్యకలాపాలు అభినందనీయమన్నారు. కార్యశాల నిర్వహణకు ఆర్థిక - హార్థిక సహకారాన్ని అందించిన సాహితీ ప్రియులందరికీ కృతజ్ఞతాభినందనలు తెలిపారు సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి కె. ఆనందాచారి.

### చర్చలు

ప్రారంభ సభ ముగిసిన అనంతరం ప్రజాశక్తి అసిస్టెంట్ ఎడిటర్ ఎస్. వెంకట్రావ్ అధ్యక్షతన ఆహ్వానితుల సమావేశం జరిగింది. ప్రతినిధులు జిల్లాల వారిగా, కమీషన్ల వారిగా చర్చలు జరిపారు. సాహిత్య ప్రచురణలు, కార్యక్రమాలు, సభలు, మహిళలు, పాట, ప్రస్థానం పత్రిక మొదలైన అంశాలపై చర్చించారు. తెలకపల్లి రవి సమన్వయకర్తగా వ్యవహరించారు.

### 'జనకవనం'

రెండవరోజు జరిగిన 'జనకవనం' ప్రపంచీకరణ తాలుకూ ప్రతి పార్శ్వాన్ని ప్రతిబింబించింది. సామ్రాజ్యవాదం, మతోన్మాదంపై నిప్పులు చెరిగింది. ప్రజా జీవితకోణాలను స్పర్శించింది. ఈ కార్యక్రమాన్ని ఖమ్మం మున్సిపల్ ఛైర్‌పర్సన్ సమీనా అఫ్రోజ్



'జీవన్మరణం' ఆవిష్కరించిన తమ్మినేని వీరభద్రం, జీవన్, ఆనందాచారి

ప్రారంభించారు. తెలుగు సాహిత్య రంగాన చైతన్యకారకమైన రచనలు పెద్ద సంఖ్యలో వెలువడటం హర్షణీయమన్నారు. పోలవరం ప్రాజెక్ట నిర్మాణాన్ని చేపట్టడం వల్ల ముంపునకు గురయ్యే ప్రాంతాల్లో గిరిజనులు హృదయఘోషకు అక్షరరూపం ఇచ్చిన కవులకు భద్రాచలం ఎంపి మిడియం బాబురావు అభినందనలు తెలిపారు. జనకవనంలో ఆయన ఆత్మీయ సందేశమిస్తూ.. కవులూ కళాకారులూ సమా మార్పునకు కృషి చేయాలన్నారు. ప్రముఖకవి జీవన్ అధ్యక్షోపన్యాస చేస్తూ, మన అస్థిత్వాలను దెబ్బతీస్తున్న ప్రపంచీకరణకు వ్యతిరేకం ప్రగతిశీల సాహిత్యాన్ని ముందుకు తీసుకుపోవాలని కోరారు. విశా - లౌకిక భావాలు కలిగిన కవులు ఈ దిశలో తగినంత కృ చేయాలన్నారు. ప్రముఖ కవయిత్రి శిలాలోలిత ఆత్మీయ సందేశమిస్తు సమాజంలో ఎన్నో మార్పులు వస్తున్నా స్త్రీల పట్ల చులకనభావం పోవడ లేదన్నారు. అన్ని విషయాల్లో పురుషులతో పాటు సమానంగా ముందు వెళ్తున్న స్త్రీలను ఇంకా రెండో తరగతిగానే ఎందుకు చూస్తున్నార ప్రశ్నించారు. ఈ జనకవనం కార్యక్రమంలో ప్రముఖ ప్రజాకవి దేవేం పి.విద్యాసాగర్, అద్దేపల్లి రామ్మోహనరావు, మల్లెంపాటి వీరభద్ర యాకూబ్ తదితరులు సందేశాలిచ్చారు. రాష్ట్రం నలుమూలల నుం వచ్చిన 40 మందికి పైగా కవులూ కవయిత్రులూ తమ కవిత వినిపించారు. అమ్మిన శ్రీనివాసరాజు రచించిన 'పూతరేకులు' క సంకలనాన్ని ఈ సందర్భంగా తెలకపల్లి రవి ఆవిష్కరించి, పరిచయ చేశారు. శిరంశెట్టి కాంతారావు వందన సమర్పణ చేశారు.

---

# సింధువు

**డి.ఆర్. గజవెల్లి**

(1) ఈ విశ్వం ప్రసవించెను
అభ్యుదయపు శిశువునూ
ఆ శిశువు నినదించెను
ఇన్‌క్విలాబ్ పథమునా
పదపదవోయ్ ఓ మనిషీ
విశ్వప్రసవ శిశువు వైపు
పయనం సాగించవోయ్
నీ ఆశయ పథం వైపు ॥ఈ॥

(2) సాంస్కృతిక రంగము
బూతుబొమ్మగా మలచి
దృశ్య శ్రవణ తెరలపైన
నృత్యం చేయిస్తూ
అదిగో వస్తున్నారూ
సామ్రాజ్యవాదులేకమై
విశ్వమాత ఒడిలోపల
విప్లవాన్ని అణిచేయగ ॥ఈ॥

(3) సింధూరపు క్రాంతి
సింధువులై పొంగుచూ
నినదించు నీ గళాన్ని
కదిలించు ఈ జనాన్ని
భగ్నంగావించవోయి
సామ్రాజ్యవాద కుట్రలనీ ॥ఈ

(4) అధైర్యపడకు భాయ్
అలసత్వం వీడోయ్
అటు చూడు ఆ చైనా
ఆ పైన వియత్నాం మరి ఎన్నో
మేమున్నాం అంటు
మనకు వెన్నుదట్టి
నిలిచాయోయ్ పిడికిలెత్తి
గర్జిస్తూ వస్తూ ॥ఈ

# మరింత విశాలంగా...

# వినూత్నంగా....



- తెలకపల్లి రవి,

కన్వీనర్, సాహితీ స్రవంతి

మన ఆహ్వానాన్ని మన్నించి ఈ కార్యశాలను ప్రారంభించేందుకు వచ్చిన ప్రముఖ రచయిత, ప్రజాస్వామిక లౌకిక వాద నిబద్ధుడు అంపశయ్య నవీన్ గారు,

నిత్య సాహిత్య సంచారి, నిఖిల జన మిత్రుడు అద్దేపల్లి రామమోహనరావు గారు,

భాషానువర్తననూ, భావ క్రమాన్ని కూడా పరిణతితో పటిష్టంగా రిశీలించే పండిత విమర్శకుడు ఖమ్మం జిల్లా వాసుల మన చేరా- కూరి రామారావు గారు,

ప్రథమ పౌరురాలు మాత్రమే కాక సాహిత్య రిశోధకురాలు కూడా సమీనా ఆఫ్రోజ్ గారు, అధ్యయన శీలి, నుభవశాలి డా.రాధాకృష్ణమూర్తిగారు, అనారోగ్యాన్ని కూడా క్కచేయకుండా అక్షరాభిమానంతో అరుదెంచిన ఆహ్వాన సంఘాధ్యక్షుడు .హరీష్ గారు, ఈ మొత్తం కార్యక్రమానికి వెన్నంటి నిలిచిన రవి రుత్‌గారు,

చిత్ర ప్రదర్శన ప్రారంభించిన సీనియర్ కవి, సాహిత్యవేత్త వెల్ల వెంకటరామారావుగారు.

ఇంకా వేదిక మీద వున్న పలువురు పెద్దలు- ప్రగతిశీల సాహిత్య పంచంలో ప్రసిద్ధులు, ప్రముఖులు.

సాహితీ స్రవంతి కార్యశాల ప్రారంభ కార్యక్రమానికి విచ్చేసిన ద్దలు, మిత్రులు ప్రతి ఒక్కరికీ నమస్కారం, స్వాగతం.

విశాల ప్రగతి శీల సాహితీ వేదికగా పురోగమిస్తున్న సాహితీ వంతి ప్రథమ కార్యశాల ఖమ్మం పట్టణంలో జయప్రదంగా గేందుకు చక్కని సన్నాహాలు చేసిన ఆహ్వాన సంఘానికి నందనలు. ఇందుకు సహకరించిన సాహిత్యాభిమానులకు, మోభిలాషులకు కృతజ్ఞతలు.

రాష్ట్రంలోని వివిధ జిల్లాల నుంచి వ్యయ ప్రయాసలకోర్చి న కార్యకర్తలకూ, కావ్య కర్తలకూ ప్రత్యేకాభినందనలు.

## కార్యశాల నేపథ్యం

కార్యశాల అన్న మాట కొత్తదిగా ధ్వనించినా అందరూ దాని ం ఇట్టే తెలుసుకున్నారు. ఇక్కడ కార్యక్రమాల గురించి చర్చ గుతుందని అంతా అడుగుతుంటే సంతోషం వేసింది. అదే ృభాష గొప్పదనం. ఇంతకు ముందు సాహిత్యశాల అన్నాం. దాని ం వేరు. దీని లక్ష్యం వేరు.

తెలుగు సాహిత్యంలో స్తబ్దత చోటు చేసుకుందని, పవాదాలేతప్ప సృజన సన్నగిల్లిందని, మారిన పరిస్థితుల్లో సాహిత్యాన్ని పట్టించుకునే వారు లేరని రకరకాల వ్యాఖ్యలు వినిపిస్తున్న తరుణంలో ఇక్కడున్న సాహితీ మిత్ర బృందాలు కృషి ప్రారంభించాయి. ఖమ్మం జిల్లాలో 1999 జనవరి26 రిపబ్లిక్ డే రోజున సాహితీ స్రవంతి ప్రారంభమైంది. మిగిలిన మరికొన్ని జిల్లాలలోనూ, రాష్ట్ర రాజధానిలోనూ ఇతర పేర్లతో కృషి జరిగినా ప్రపంచీకరణకు మతోన్మాదానికి వ్యతిరేకంగా విశాల వేదిక అన్న అవగాహనతోనే నడిచాయి. ఈ కృషిలో 2002లో హైదరాబాదులో జరిగిన జన కవనం ఒక మైలురాయిగా నిలిచింది. వందలాది మంది కవులు ఒక్కచోట చేరి కలాలు సంధించడం, గళాలు వినిపించడం కొత్త స్ఫూర్తినిచ్చింది. సాహితీ స్రవంతి కృషికి అది నాందీ వాచకం.

## మారిన సాహిత్య దృశ్యం

విభిన్న తరాలకు, నేపథ్యాలకూ, ప్రాంతాలకూ చెందిన కవులు రచయితలు, సాహిత్య కారులు ఇక్కడ వున్నారు. గత సాహిత్యోద్యమాల అనుభవాలను స్వీకరించి, వర్తమానంలో చైతన్యం నింపడానికి, భవిష్యత్ సమాజాన్ని మరింత వాస యోగ్యంగా హాస యోగ్యంగా చేయడానికి వారు కలాలతో కంకణధారులుగా వున్నారు. ఇక్కడ జరుగుతున్న ఈ కార్యశాల తెలుగు సాహిత్యంలో పెంపొందుతున్న వినూత్న చైతన్యానికి విశాల అవగాహనకు నిదర్శనంగా భావిస్తున్నాను. తెలుగులో ఇవాళ ప్రగతిశీల సాహిత్యం ప్రపంచీకరణ వ్యతిరేక ప్రతిధ్వని. సామ్రాజ్య వాదంపై సమరవాణి. మతోన్మాదంపై మార్కెట్ మాయాజాలాలపై మార్మోగే మరఫిరంగి. సాంస్కృతిక కాలుష్యాలైన, సంకుచిత కథనాలపైనా సంధించిన అక్షరాస్త్రం. విభిన్న సామాజిక తరగతుల, విభిన్న భౌగోళిక ప్రదేశాల అన్ని నేపథ్యాల జన బాహుళ్యం ఆవేదనలకు ప్రతిస్పందించే మానవతా నాదం. సాహితీ స్రవంతి ఆశించిందీ ప్రోత్సహించిందీ ఇలాటి సాహిత్యాన్నే. సమాజ దర్శనంలో భిన్న దృక్కోణాలు వున్నా విశాల లౌకిక ప్రగతిశీల దృష్టి గలవారంతా కలసి నడవడం నేటి అవసరం. ఆ దిశలో సాహితీ స్రవంతి జరిపిన కృషికి ఇక్కడున్న మీరు, ఇంకా ఎందరో సహృదయులు పెద్దలు అందించిన ప్రోత్సాహం మరువలేనిది.

## పెరిగిన కదలిక

తెలుగు సాహిత్యంలో స్తబ్దత, శూన్యం ఆవరించాయంటూ గత దశాబ్ది మధ్యలో వినిపించిన మాటలు ఇప్పుడు గత చరిత్రలో భాగమై పోయాయి. భావజాలాలు, నిబద్ధతలు అంటేనే అపహాస్యం చేసిన కాలక్షేప రచయితలు చాలామంది సృజనాత్మక రచనలకే స్వస్తి

చెప్పగా సామాజిక స్పృహ గల రచయితలే సర్వ దిశలా కనిపిస్తున్న పరిస్థితి. సాధించాల్సింది, మెరుగుపడాల్సింది ఇంకా చాలా వున్నప్పటికి నిస్సందేహంగా తెలుగు సాహిత్యంలో అమోఘమైన సృజన జరుగుతున్నది. కొత్త కోణాలు ఆవిష్కృతమవుతున్నాయి. నూతన సహస్రాబ్ది 2000 ఆగష్టులో జరిగిన విద్యుదుద్యమం ఒక కొండ గుర్తు అనుకుంటే అప్పటినుంచి ప్రపంచీకరణకు ప్రతిఘటన సాహిత్యంలో ప్రధాన లక్షణమైంది. అదృశ్యమవుతున్న పల్లెదనం, తల్లిదనం సాహిత్యంలో సాక్షాత్కరించింది. ప్రపంచీకరణ తాలూకూ ప్రతి పార్శ్వాన్ని ప్రతిబింబించే కథలూ, కవితలూ, విమర్శలూ వెలువడుతున్నాయి. ఒక సాహిత్య సాంస్కృతిక పునర్వికాసం లాటిది ప్రత్యక్షమైంది. ఇప్పుడెవరు చదువుతున్నారన్న మాటలు పోయి రాసే వారే వందల సంఖ్యలో ముందుకొస్తున్నారు. ప్రతి పట్టణంలోనూ పుస్తకావిష్కరణలు జరుగుతున్నాయి. పుస్తకం పునర్జన్మ ఎత్తుతున్నది. సాహిత్యం సరికొత్త జవ సత్వాలు పుంజుకుంటున్నది. భాషా సాహిత్యాలలో ప్రజాస్వామీకరణ జరగాలని గురజాడ ఇచ్చిన పిలుపు అక్షరాలా వాస్తవమవుతున్నది. సాహిత్యం కొంతమందికే పరిమితమైన ప్రక్రియ అన్న భ్రమలు పోవడం ఆహ్వానించదగిన పరిణామం. ఇదే కవిత్వమైతే నేనూ రాస్తానని అన్న కుర్రాడితో నేను కోరుకునేది అదే అన్న శ్రీశ్రీ మాటలు మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. మార్గదర్శకులను, పెద్దలనూ గౌరవిస్తూ నూతన సాహితీ శక్తులను ఆహ్వానించడంపై సాహితీ స్రవంతి కేంద్రీకరించడానికి కారణమదే.

## విశాల వేదికగా విస్తృత కృషి

నాటి నవ్య సాహిత్య పరిషత్తుతో మొదలు పెట్టి తెలుగులో అనేకానేక సాహిత్య ఉద్యమాలు, సంఘాలు నడిచాయి. తమ తమ పరిధిలో అనేక మంచి ఫలితాలు సాధించాయి. మార్పులు తెచ్చాయి. పురోగమన శీలమైన ఈ వారసత్వాన్నంతటినీ సాహితీ స్రవంతి ఎంతగానో గౌరవిస్తుంది. మహనీయులైన అక్షర యోధులను సంస్మరించుకోవడానికి వారి వర్ధంతి సభలూ, జయంతి సభలూ జరపడం ద్వారా సాహితీ స్రవంతి సాహిత్య జీవులకు కొత్త స్ఫూర్తినిచ్చింది. అదే సమయంలో వాటి నుంచి నేర్చుకునే పాఠాలూ, అనుభవాలూ కూడా విశ్లేషించుకుని నేటి పరిస్థితులను తగిన విశాల వేదికగా పని చేస్తోంది. వివిధ సందర్భాలలో చొరవతో అందరి సహకారం తీసుకుని సమీకరణ చేసింది. పెద్ద నగరాలు, పట్టణాలకే పరిమితమైన సాహిత్య కార్యక్రమాలను అన్ని చోట్లా జరిపించడంలో స్రవంతి పాత్ర చాలా వుంది. అలాగే ఎందరో నూతన సాహిత్యోపన్యాసకుల భావాలు వినే అవకాశం కలిగించింది. సరైన భావం కోసం సంఘర్షణ సాగిస్తూనే అకారణ సంవాదాలు, అవాంఛనీయ వివాదాలను నివారిస్తూ ఆరోగ్యకరమైన, విజ్ఞాన దాయకమైన పద్ధతులలో సాహిత్య చర్చను పెంపొందించేందుకు కృషి చేసింది. సాహిత్య కారుల భాగస్వామ్యం పెరగడానికి వీలైన నూతన మార్గాలను అన్వేషించింది. సాహిత్యశాల, జన కవనం, వంటి మాటలు ఇప్పుడు తెలుగు సాహిత్య కారులకు సుపరిచితాలైనాయంటే అందుకు కారణం సాహితీ స్రవంతి. వివిధ చోట్ల జరిగిన మొత్తం రెండు వందలకు పైబడిన సాహితీ కార్యక్రమాలలో ఒకటి, అరా తప్ప ఎక్కడా ఎలాటి వివాదాలు రాలేదంటే అది దాని సమతుల్యతకు నిదర్శనం. కొన్ని సందర్భాల్లో ముందుకు తెచ్చిన అకారణ సమస్యలలో కూడా సంయమనం పాటించడం ద్వారా స్రవంతి ఐక్యతా వాతావరణాన్ని కాపాడేందుకు కృషిచేసింది. అదే సమయంలో సాహిత్యకారులపైన, సంస్థల పైన ఎలాటి అకారణ ఆంక్షలు నిర్బంధాలు వచ్చినా ఖండించడంలో ముందుంది. గుజరాత్ గాయం వంటి కార్యక్రమాలు నిర్వహించినప్పుడు సందర్భాలలో పూర్తిగా పాలుపంచుకుంది. ఆసియా సామాజిక వేదికలో ఇతర సంఘాలతో కలసి ప్రతిధ్వని నిర్వహించింది. సుందరయ్య విజ్ఞాన కేంద్రం శోధనతో కలసి ప్రయోజనకరమైన కార్యక్రమాలు రూపొందిస్తున్నది. గురజాడ జన్మస్థలం విజయనగరంలోనూ, విశాఖలోనూ ఆయన జయంతి రోజున జన సాహిత్య సమ్మేళనం నిర్వహించింది. సాహిత్య కేంద్రమైన విజయవాడలోనూ, రాజధాని హైదరాబాదులోనూ, కర్నూలులోనూ సాహిత్యశాలలు జరిపి నూతనోత్సాహం నింపింది. ప్రశంసలూ, విమర్శలూ ఏవైనా కొన్ని నెలల పాటు తెలుగు సాహిత్యకారులలో ఇవే చర్చనీయాంశాలైనాయి. మహబూబ్‌నగర్‌లో స్రవంతి మిత్రుల ఆధ్వర్యంలోని ప్రజాసాహితీ వేదిక నవలా సమాలోచన నిర్వహించింది. ఇవి వందలాది కార్యక్రమాలకు కొన్ని ఉదాహరణలు మాత్రమే. ఇక్కడ ఈ ఖమ్మం జిల్లాలో గత ఆరేళ్ల నుంచి చేస్తున్న కార్యక్రమాలతో పాటు ఇటీవలే పోలవరం ముంపు ముప్పుపై అక్షరాస్త్రంగా జీవన్మరణం వెలువరించడం ఒక కొత్త వరవడి. భద్రాచలం, కొత్తగూడెం, పాల్వంచ వంటి కేంద్రాలలో కూడా మంచి కదలిక వుంది.

## ప్రచురణలు

సభలూ, కార్యక్రమాలకే పరిమితం కాకుండా సాహిత్య గ్రంధాల ప్రచురణలో కూడా స్రవంతి విస్తృతంగా కృషి చేసింది. హైదరాబాద్‌లో కార్యాలయం ఏర్పడింది. కేంద్రంలో పదకొండు పుస్తకాలను ప్రచురించింది. కథాప్రస్థానం, దీపధారులు, అక్షరాలూ-అనుభవాలు వంటి దాని ప్రచురణలు బహుధా అభినందనల పొందాయి. ఖమ్మం, విజయవాడ, భద్రాచలం, పాల్వంచ విశాఖపట్టణం, హైదరాబాదు వగైరా చోట్ల స్థానికంగా కథా కవిత సంకలనాలు వెలువడ్డాయి. మిగిలిన చోట్ల కూడా అలాంటి ప్రయత్నా జరుగుతున్నాయి. ఇవేకాక రచయితలు పుస్తకాలు ప్రచురించుకోవడాని కూడా సాహితీ స్రవంతి సాంకేతికంగానూ, సంస్థాగతంగానూ సహకార అందించింది. భవిష్యత్తులో దీన్ని మరింత క్రమబద్ధంగా చేయాల సంకల్పిస్తోంది. ముఖ్యంగా మార్గదర్శకులైన ప్రసిద్ధులనూ, వివి ప్రక్రియలనూ పరిచయం చేసే గ్రంధమాల వంటిది ప్రచురించాల భావిస్తోంది. అదే విధంగా స్థానిక స్థాయిలో సాహిత్య శిక్షణా తరగతు నిర్వహించాలని కూడా భావిస్తున్నాం.

## ప్రస్థానం

మూడు సంవత్సరాల నుంచి నిర్విఘ్నంగా వెలువడుతున్న సాహి ప్రస్థానం స్రవంతి కృషికి మకుటాయమానంగా వుంది. సాహి చరిత్రలోని ప్రామాణిక పత్రికలతో దీన్ని పోలుస్తూ ఆదరిస్తు సాహిత్యాభిమానులకు కృతజ్ఞతలు. విద్యార్థులనుంచి విశ్వవిద్యాలయ విభాగాధిపతుల వరకూ ఈ పత్రికను ఆదరిస్తున్నారు. రాష్ట్ర నలుమూలలకూ వెళ్తున్నది. ఈ ఏడాది నుంచి మరింత విస్తృత స్థాయి ప్రస్థానం చందాలు స్వీకరించాలని నిర్ణయించామని తెలియజేయడా సంతోషిస్తున్నాము. దీన్ని మరెన్నో రెట్లు పెంపొందించడానికి మీ అం సహకారం అభ్యర్థిస్తున్నాము.

## భవిష్యత్ కార్యక్రమాలు

సాహితీ స్రవంతికి దాదాపు పన్నెండు జిల్లాల్లో బలమైన విభాగాలున్నాయి. మరో ఆరు జిల్లాల్లో విస్తృతంగా కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఇంకో రెండు జిల్లాల్లో అడపాదడపాగా కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఈ కార్యశాలలో కార్యక్రమాలను సమీక్షించి భవిష్యత్ కర్తవ్యాలను రూపొందించుకోవడం జరుగుతుంది. జరిగిన కృషిలో ఏమైనా లోపాలు పొరబాట్లు వుంటే దిద్దుకోవడానికి సాహితీ స్రవంతి సదా సిద్ధమని తెలియజేస్తూ విమర్శలు, సూచనలు ఆహ్వానిస్తున్నాను. వాటిని రేఖామాత్రంగా వివరించి తెలియజేసి సెలవు తీసుకుంటాను:

★ మరింత క్రమబద్ధంగా విస్తృతంగా సాహిత్య కార్యక్రమాలు జరిపే ప్రణాళిక
★ విద్యార్థి, యువజన తరగతులలో సాహిత్య దృష్టి పెంచే కృషి. విద్యాసంస్థలపై ప్రత్యేక కేంద్రీకరణ
★ సాహిత్య విమర్శ, చర్చలపై ప్రత్యేక శ్రద్ధతో కృషి
★ జిల్లాల స్థాయిలో సాహిత్యశాలల్లో శిక్షణ
★ రచయితలపైన, సాహిత్య ప్రక్రియలపైన సుబోధకమైన, ప్రామాణిక గ్రంధావళి ప్రచురణ
★ పట్టణాలు, పల్లెలలో ప్రజల మధ్య సాహిత్య కార్యక్రమాలు
★ కవులు, రచయితల పుస్తకాల ప్రచురణకు నిరంతర తోడ్పాటు
★ కేంద్ర కార్యాలయంలో సాహిత్య పరిశోధనా గ్రంధాల సేకరణ
★ సాహిత్యోపన్యాసకులకు శిక్షణ
★ సాహిత్య విమర్శలో కొత్త రచనలకు కూడా స్థానం కల్పించడంపై ప్రత్యేక దృష్టి. వాటిని పరిచయం చేసే ప్రయత్నం.
★ రాష్ట్రస్థాయిలో మహా కవితా, కథా సంకలనాల ప్రచురణ, విస్తృత గ్రంధాల పునర్ముద్రణ
★ జిల్లాల్లో పుస్తకాలు, రచయితల వివరాలపై సర్వేలు

## ప్రాచీన ప్రతిపత్తి నుంచి ఆధునీకరణ వరకూ...

చివరగా – ఇప్పుడు ఎంతగానో చర్చించబడుతున్న తెలుగు భాషా సమస్య గురించి రెండు ముక్కలు. స్వాతంత్రం వచ్చి అరవై ఏళ్లు కావస్తున్నా దేశీయ భాషల అభివృద్ధికి కేంద్రం కృషి చేయకపోవడం అత్యంత శోచనీయం. అంతటితో ఆగక వివిధ భాషల మధ్య వివాదాలు పెంచే విధంగా వ్యవహరించడం ఇంకా అభ్యంతర కరం. తమిళానికి ప్రాచీన ప్రతిపత్తి కల్పించి సహాయం ప్రకటించి ఆ వెంటనే నిబంధనలు సవరించడం వివక్షాకర చర్య. సుదీర్ఘ చరిత్ర, సుసంపన్న వారసత్వం కలిగిన తెలుగుకు ప్రాచీన హోదానిచ్చి దాని అభివృద్ధికి సహాయం చేయాలని కేంద్రాన్ని కోరుతున్నాను. దేశీయ సంస్కృతులను కాలరాస్తూ భాషలను కబళిస్తున్న ప్రపంచీకరణకూ తెలుగు ప్రస్తుత దురవస్థకూ చాలా సంబంధం వుందని ఎవరూ మర్చిపోకూడదు. కేంద్రం సహాయం కోరడంతో పాటు రాష్ట్ర ప్రభుత్వం తెలుగు పట్ల నిర్లక్ష్యాన్ని విడనాడాలి. తెలుగు అక్షరాలు రాకుండానే విద్యాభ్యాసం చేసే అవకాశమిస్తున్న ప్రస్తుత పరిస్థితి పోవాలి. బోధనా భాషగా పాలనా భాషగా తెలుగును పెంపొందించం అన్నిటికన్నా కీలకం. కావ్యభాషలనే కొనియాడుతూ ప్రజా వాఙ్మయాన్ని విస్మరించిన నాటి సంప్రదాయవాదుల నుంచి సాహిత్య సామాజిక శాస్త్రాలు అనవసరమన్న హైటెక్ పాలకుల వరకూ అందరూ తెలుగుకు అన్యాయంచేశారు. ఆ పరిస్థితిని చక్కదిద్దుకోవాలంటే తెలుగును ఆధునిక అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్దుకోవాలి. సాహితీ స్రవంతి ఆ దిశలో తన వంతు పాత్ర నిర్వహిస్తుంది.

నేటి పరిస్థితుల్లో కొన్ని ముఖ్యాంశాలను సాహితీ స్రవంతి కృషి వివరాలను రేఖామాత్రంగా మీ ముందుంచాను. వీటన్నిటిపైనా మీ సూచనలూ, సలహాలూ ఆహ్వానిస్తున్నాను.మీ సహకారమే స్రవంతికి స్ఫూర్తి. అక్షరాశయ సాధనకు ఆలంబన.

మరోసారి ఈ కార్యక్రమం నిర్వహిస్తున్న జిల్లా స్రవంతి బాధ్యులను సహకరించిన శ్రేయోభిలాషులను అభినందిస్తూ సెలవు.

## గౌరవానికి కృతజ్ఞతలు...
## పురస్కారానికి తిరస్కారాలు...
### అరుంధతీ రాయ్

నా రచన ఆల్జీబ్రా ఆఫ్ ఇన్ఫినిట్ జస్టిస్ గ్రంథానికి ఈ ది పురస్కారం ప్రకటించినందుకు సాహిత్య అకాడమీ న్యాయ తలకు నా కృతజ్ఞతలు. భారతదేశపు అత్యంత ప్రతిష్టాత్మకమైన ాతీ బహుమతిని పొందదగినదిగా ఒక రాజకీయ వ్యాసాల కలనాన్ని న్యాయనిర్ణేతలు పరిగణించడం నాకు గర్వకారణం.

1998–2001 మధ్య కాలంలో రాసిన ఈ వ్యాసాలు భారత త్వం భారీ ఆనకట్టలు, అణ్వాయుధాలు, పెరుగుతున్న సైనికీకరణ, ా ఉదారవాద ఆర్థిక విధానాలు వంటి అంశాలపై అనుసరించిన నాల పట్ల తీవ్రమైన విమర్శనాత్మక దృష్టితో సాగాయి. అయితే త ప్రభుత్వం కూడా ఈ విధానాలను కొనసాగిస్తోంది. ఏది ఏమైనా ని నిర్దాక్షిణ్యంగా, హింసాపూరితంగా అమలు పరచడానికి స్యంగా వుంది.

గత కొద్ది నెలలుగా, రైతుల ఆత్మహత్యలు గిపోతున్నాయి) లక్షల సంఖ్యలో ప్రజలు తమ భూముల నుండి, ాల నుండి బలవంతంగా వెళ్ళగొట్టబడుతున్నాయి. గూర్గాంలో పారిశ్రామిక కార్మికులపై పోలీసుల పాశవికతను, ఆనకట్టకు వ్యతిరేకంగా నిరసన ప్రదర్శన చేస్తున్న డజన్ల కొద్దీ మణిపూర్ ప్రజలను కాల్చి చంపడాన్ని, ఒరిస్సాలో ఉక్కు కర్మాగార స్థాపన కారణంగా నిర్వాసితులవుతున్న ప్రజల్ని డజన్ల సంఖ్యలో చంపడాన్ని మనం కళ్లారా చూస్తున్నాం. మనల్ని మనం ఒక ప్రజాస్వామిక దేశంగా వర్ణించుకుంటున్న తరుణంలోనే కాశ్మీర్, మణిపూర్, నాగాలాండ్‌లు భారత సైనిక బలగాల అధీనంలో ఉన్నాయి. చనిపోతున్న, గల్లంతవుతున్న ప్రజల సంఖ్య పెరిగిపోతూనే వున్నది.

"ది ఆల్జీబ్రా ఆఫ్ ఇన్ఫినిట్ జస్టిస్" అమెరికా విదేశాంగ విధానాన్ని ప్రత్యేకించి సెప్టెంబర్ 11, 2001 తర్వాత దాని విధానాల నిశిత విమర్శతో సాగింది. ప్రస్తుత భారత ప్రభుత్వం కూడా ఆఫ్ఘనిస్తాన్‌పై అమెరికా దురాక్రమణను, చట్టవ్యతిరేకంగా ఇరాక్‌ను ఆక్రమించుకోనడాన్ని – ఈ చర్యలు న్యూ రెంబర్గ్ సూత్రం ప్రకారం దురాక్రమణపూరిత యుద్ధ నేరాలు అయినప్పటికీ – తప్పు పట్టలేదు.

సాహిత్య అకాడమీ పట్ల ఈ సంవత్సరపు న్యాయనిర్ణేతల పట్ల గతంలో ఈ అవార్డులను స్వీకరించిన వ్యక్తుల పట్ల నాకు అపారమైన గౌరవం వుంది. అయినప్పటికీ భారత ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ విధానాల పట్ల నా అనంగీకారాన్నీ – నిజానికి నా తీవ్రమైన అసహ్యాన్ని వక్కాణించే వుద్దేశంతో 2005 సాహిత్య అకాడమీ అవార్డును తిరస్కరిస్తున్నాను.

# తెలుగు సాహితీ మూలాలు తడిమిన ఢిల్లీ 'సమాలోచన'

న్యూఢిల్లీలోని తెలుగు సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలు సాగించేందుకు, రచయితలకు కవులకు ప్రోత్సాహం అందించేందుకు సాహితి అన్న సంస్థ 2006 జనవరిలో కృషి ప్రారంభించింది. సంక్రాంతి పర్వదిన సన్నాహాల తరుణంలో జనవరి 7న ఆంధ్రప్రదేశ్ భవన్‌లోని గురజాడ సభామందిరంలో సాహిత్య సమాలోచన కార్యక్రమం ఇందుకు నాంది పలికింది. రాష్ట్రం నుంచి సాహిత్య ప్రముఖులు విచ్చేసి విశ్లేషణాత్మకంగా ప్రసంగించడం సాహిత్యాభిమానులను ఎంతగానో అలరించింది. టీవీ9 న్యూఢిల్లీ ప్రతినిధి కంభాలపల్లి కృష్ణ కన్వీనర్‌గా ఏర్పడిన సాహితి తొలి ప్రయత్నమే ఇంత జయప్రదంగా నిర్వహించడాన్ని ప్రతివారూ అభినందించారు. ఈ కార్యక్రమంపై దీనిపై ఈనాడు న్యూఢిల్లీ వార్తాకథనం యధాతథంగా....

తెలుగు కథ, నవల... ప్రారంభ, వికాస పరిణామాన్ని వివరిస్తూ... కవిత్వాన్ని మాత్రమే సాహిత్య ప్రక్రియగా భావిస్తున్న దశ నుంచి జీవితాన్ని ఆవిష్కరించడానికి అవకాశం ఉన్న సాహిత్య ప్రక్రియగా కథ, నవల గుర్తింపు పొందాయని చెప్పారు. బండారు అచ్చమాంబ తెలుగులో తొలి కథ రాశారని పేర్కొంటూ 'సాహిత్యంలో స్త్రీ', 'స్త్రీవాద సాహిత్యం' పరిణామక్రమాన్ని సభికుల ముందుంచారు. కవితా ప్రస్థానం తీరుతెన్నులను, వివిధ వాదాలను స్పర్శిస్తూ అద్దేపల్లి రామ్మోహనరావు సాహిత్యావలోకనం చేశారు. ప్రవాసాంధ్రుల సాహితీ సేవ' గురించి మాట్లాడిన ఏల్చూరి మురళీధరరావు... క్రీస్తుపూర్వమే సొంతగడ్డను వదిలి సాహితీసేవ చేసిన వారి దగ్గర నుంచి ప్రస్తుతం ఢిల్లీలో ఉన్న రచయితల వరకు... పలువురి సేవలను వివరించారు. 'ఆవేదన లేని చోట అద్భుత అక్షర సృష్టి సాధ్యం కాదు' అంటూ పెరిగిపోతున్న వినియోగ సంస్కృతి, ప్రపంచీకరణ దాడి నేపథ్యంలో తెలుగు సాహిత్యం, సంస్కృతి ఆవశ్యకతను వివరిస్తూ... పల్లెను, తల్లినీ వెతుక్కుంటూ తెలుగు కథ మూలాల్లోకి వెళ్ళిందని తెలకపల్లి రవి సంతోషం వ్యక్తం చేశారు.

"సాహితీ సేవ చేసిన తొలి ప్రవాసాంధ్రుడు ఎవరు? తెలుగులో తొలి కథ రాసింది మహిళే. 'ఫ్లైఓవర్'కు తెలుగు పదం కనిపెట్టింది పామరుడే. పరభాషలు దాడి చేసినా తెలుగు అంతరించిపోదు... ఇది చరిత్ర చెప్పిన సత్యం" శనివారం ఎపి భవన్‌లోని గురజాడ సమావేశ మందిరంలో 'సాహితి' సంస్థ ఏర్పాటు చేసిన 'సాహితీ సమాలోచన'లో వక్తలు చేసిన ప్రసంగాల్లో ముఖ్యాంశాలు ఇవి.

### క్రీస్తుపూర్వం ప్రవాసాంధ్రులు

### ఏల్చూరి మురళీధరరావు

'అవస్థంభుడు' తెలంగాణ నుంచి మహారాష్ట్ర, సౌరాష్ట్ర మీదుగా ఉత్తర భారతదేశానికి వలస వచ్చిన తొలి ప్రవాసాంధ్రుడు. సంస్కృత కవిగా ప్రసిద్ధికెక్కిన శ్రీ కంఠ భవభూతి కూడా ప్రవాసాంధ్రుడే. మొఘల్ సామ్రాజ్యంలో కూడా ఆంధ్రులు పనిచేశారు. అక్బర్‌కు సూర్య సహస్ర నామావళి బోధించిన వ్యక్తి 'భానుచంద్రుడు' గోదావరి పరివాహక ప్రాంతం నుంచి ఢిల్లీ వచ్చాడు. షాజహాన్ దర్బారులో పనిచేసిన జగన్నాథ పండిత రాయలు సాహితీ సేవ కొనియాడదగింది. 'లహిరీ కావ్యాలు', సాహిత్య లతా గంగాధరం' ఆయన రాసిన గ్రంథాలు. సాహిత్యాభిమానులు ఇప్పటికీ గుర్తు పెట్టుకొంటారు. బాల వ్యాకరణం రాసిన పరవస్తు చిన్నయసూరి కూడా ప్రవాసాంధ్రుడే. తెలుగు వాసనలు లేకుండా అచ్చంగా తమిళదేశంలో పుట్టి పెరిగిన వాడు కావడం గమనార్హం. తెలుగుదేశంతో సంబంధం లేకపోవడం వల్లే ఆయన గ్రాంథికభాష ఉద్యమాన్ని ప్రారంభించాడనే వాదన కూడా బలంగా ఉంది. అయితే... వాడుక భాష ఉద్యమానికి ఊపిరులూదిన గిడుగు రామ్మూర్తి పంతులు కూడా ప్రవాసాంధ్రుడు కావడం గమనార్హం. ఇటీవల కాలంలో ఢిల్లీలో ఉన్న పలువురు ప్రవాసాంధ్రులు సాహితీ సేవ చేశారు. విశాలాంధ్రను స్థాపించిన శెట్టి ఈశ్వరరావు, మానేపల్లి తాతారావు తదితరులు ఢిల్లీలో తొలి తరం ప్రవాసాంధ్రులు. ఆకాశవాణిలో పనిచేసిన పలువురు తెలుగువాళ్లు హస్తినలో తెలుగు వాణిని వినిపించారు" అని శ్రీ వెంకటేశ్వర కళాశాల అధ్యాపకుడు ఏల్చూరి మురళీధరరావు 'ప్రవాసాంధ్రుల సాహితీ సేవ' అంశం మీద చేసిన సుదీర్ఘ ప్రసంగం సభికులను ఆకట్టుకుంది.

### జీవితాన్ని ఆవిష్కరించగల కథ

### అంపశయ్య నవీన్

కవిత్వమే సాహిత్య ప్రక్రియగా భావించే దశ నుంచి... కథ, నవల కూడా సాహిత్య ప్రక్రియలుగా విమర్శకులు భావించే దశ వరకు... వివిధ దశలను అంపశయ్య నవీన్ వివరించారు. ఒక్కో దశను విశదీకరిస్తూ తగిన ఉదాహరణలు ఇస్తూ ఆయన ప్రసంగం సాగింది. జీవితాన్ని పట్టి చూపించడానికి, కళాత్మకంగా మలచడానికీ కథా రచనలో అవకాశం ఉందని విమర్శకులు అంగీకరించారని పేర్కొన్నారు కథ... ప్రత్యేకించి ఒక వర్గం వార



ఢిల్లీ సభలో అద్దేపల్లి, ఓల్గా, మురళీధర్‌రావు, నవీన్, తెలకపల్లి రవి

మాత్రమే రాసిన దశ నుండి అన్ని వర్గాల వారు కథలు రాస్తున్న దశకు చేరుకుందన్నారు. అన్ని సామాజిక వర్గాలకు సంబంధించిన ఇతివృత్తాలను కథా వస్తువుగా ఎన్నుకొంటున్నారని చెప్పారు. అర్ధ శతాబ్ద కథా పరిణామాన్ని గమనిస్తే... తెలుగు కథ ఎంతో వైవిధ్యం సంతరించుకుందని తెలుస్తుం దన్నారు. తల్లిదండ్రులు, బిడ్డల మధ్య పెరిగిన దూరం పెంచిన అమెరికా వలసలు, ఫలితంగా ఎదురవుతోన్న సమస్యలు, వ్యవసాయ రంగంలో వేగంగా వస్తోన్న మార్పులు, రైతుల ఆత్మహత్యలు... ఒకటేమిటి మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా కథా వస్తువులుగా ఎప్పటికప్పుడు మారుతున్నాయని వివరించారు. గతంతో పోలిస్తే పాఠకుల సంఖ్య తగ్గిందని చెబుతున్నా...

ఎన్నో మంచి కథలు, నవలలు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తున్నా యన్నారు. వస్తు రీత్యా వైవిధ్యం కనిపిస్తున్నా... శిల్ప రీత్యా పెద్దగా మార్పులు రావడం లేదని అసంతృప్తి వ్యక్తం చేశారు. సర్వసాక్షి, ప్రథమ పురుష, దృక్కోణాల నుంచే కథను చెప్పడానికి ఎక్కువ మంది కథకులు ప్రయత్నిస్తున్నారని పేర్కొన్నారు. ప్రాంతీయ స్పృహ ఇటీవలి కాలంలో బాగా పెరిగిందని చెబుతూ వివిధ ప్రాంతాల మాండలికం, నుడికారం, యాస కథల్లో ఎక్కువగా కనిపిస్తోందన్నారు. అయితే రాష్ట్రం మొత్తం మాట్లాడే భాషలో రాయడం ద్వారా మరింత ఎక్కువ మందికి చేరుతుందని ఆయన సూచించారు.

నవల కూడా పలు మార్పులకు లోనవుతూ వచ్చిందని చెబుతూ... గోపీచంద్ రాసిన అసమర్థుని జీవయాత్ర, రావిశాస్త్రి అల్పజీవి, బుచ్చిబాబు రాసిన చివరకు మిగిలేది నవలల్లో పాత్రల అంతరంగ భావనలు, మానసిక విశ్లేషణలు పాఠకుడి హృదయంలో ఆవిష్కరించడానికి ప్రయత్నించారని వివరించారు. కొడవటిగంటి కుటుంబరావు మార్క్సిస్టు అవగాహనతో మానవ సంబంధాలను విశ్లేషిస్తే... రంగనాయకమ్మ మార్క్సిస్టు అవగాహనతో పాటు స్త్రీల సమస్యలను ప్రధానంగా తన రచనల్లో ప్రస్తావించారని పేర్కొన్నారు. క్షుద్ర సాహిత్యం విజృంభించిన రోజుల్లో హిమజ్వాల, అతడు ఆమెను జయించాడు, అంటరాని వసంతం, మట్టి, రేగడి విత్తులు, కాడి... తదితర నవలలు వచ్చాయంటూ నవల సాహితీ ప్రక్రియ గమనాన్ని రేఖామాత్రంగా స్పృశించారు.

## స్త్రీ పౌరసత్వం దిశగా పోరాటం

### ఓల్గా

సామాజిక న్యాయం కోసం అడిగే ప్రశ్నలన్నీ అతిగా, విడ్డూరంగానే కనిపిస్తాయని ప్రముఖ స్త్రీవాద రచయిత్రి ఓల్గా అన్నారు. వివిధ నేపథ్యాలను అర్థం చేసుకొంటేనే స్త్రీవాద సైద్ధాంతిక దృక్పథం అర్థమవుతుందన్నారు. 'తెలుగు సాహిత్యం – మహిళ' అంశం మీద ఆమె చేసిన ప్రసంగం స్త్రీవాదం దిశగా సాగింది. తెలుగులో తొలి కథ రాసింది... విశ్వనాథ సత్యనారాయణ, సాంఖ్యానశర్మ... అనే వాదన మీద మల్లగుల్లాలు పడుతుంటారని, తెలుగులో తొలి కథ రాసింది బండారు అచ్చమాంబ అని పేర్కొంటూ తేదీలతో సహా చెబుతూ కథ ప్రచురిస్తే ఆశించిన స్పందన రాలేదని ఆవేదన వ్యక్తం చేశారు. స్త్రీలకు సమాజంలోనే కాకుండా, సాహిత్య పాత్రల రూపకల్పనలో కూడా తగిన ప్రాధాన్యం, వ్యక్తిత్వ నిర్మాణం లేకుండా చేశారన్నారు. రచయిత్రులుగా కూడా స్త్రీలు వివక్షను ఎదుర్కొంటున్నారన్నారు. తొలి తరం రచనల్లో... స్త్రీని పురుషుడితో సమానంగా చూపించడం ద్వారా ఆదర్శ స్త్రీ పాత్రను సృష్టించారని చెబుతూ... తొలి తరంలో గుడిపాటి వెంకట చలం, తదనంతర కాలంలో కొడవటిగంటి, బుచ్చిబాబు, గోపీచంద్ రచనల్లో స్త్రీ పాత్రల తీరుతెన్నులను వివరించారు. తరువాత కాలంలో మాలతీ చందూర్, వాసిరెడ్డి సీతాదేవిలాంటి రచయిత్రులు రాసిన పలు రచనల్లో మహిళలు సొంత వ్యక్తిత్వాలున్న వారిగా చిత్రీకరించారని చెప్పారు. ఎమర్జెన్సీ కూడా స్త్రీవాదం విస్తరించ డానికి దోహదపడిందన్నారు. స్త్రీవాదం వివిధ దశలను దాటుకుంటూ 'స్త్రీ పౌరసత్వం' కోసం పోరాడే దశకు చేరుకొందని చెప్పారు. సాహిత్య రాజకీయాల్లోనూ స్త్రీకి సమాన ప్రాతినిధ్యం లేదని, సాహిత్య అకాడమీ సారధ్య బాధ్యతలు అర్ధ శతాబ్ద కాలంగా పురుషులకే పరిమితమయ్యాయని విమర్శించారు.

## కొత్త సమస్యల సమరం

### అద్దేపల్లి రామ్మోహనరావు

పాత సమస్యలు అంతరించిపోక ముందే కొత్త కొత్త సమస్యలు పుట్టుకొస్తు న్నాయని, వీటన్నింటినీ ప్రతిబింబిస్తూ కవిత్వం కూడా రూపురేఖలు మార్చుకుంటోందని 'మినీ కవిత' ప్రవక్త అద్దేపల్లి రామ్మోహనరావు అన్నారు. తెలుగు కవితా ప్రస్థానం సాగిన తీరును ఆయన సభికుల ముందుంచారు. కవితా ప్రస్థానంలోని వివిధ దశలను పేర్కొంటూ... వచన కవిత్వ దశను ప్రత్యేకంగా ప్రస్తావించారు. వచన కవిత్వానికి, సామాజిక అంశాలకు అవినాభావ సంబంధం ఉంటుందన్నారు. వచన కవిత్వాన్ని ప్రజా కవిత్వంగా రూపుదిద్దిన ఘనత కుందుర్తికి చెందుతుందన్నారు. భావచిత్రాలు, ప్రతీకలు, అనుభూతులతో తిలక్ కవిత్వం రాస్తే... సమాజాన్ని ముంచెత్తుతున్న వినియోగ సంస్కృతి, ప్రపంచీకరణకు వ్యతిరేకంగా ప్రస్తుతం కవిత్వం వస్తోందని సోదాహరణంగా వివరించారు. సమాజంలోని దుర్మార్గాన్ని చీల్చి చెండాడిన దిగంబర కవిత్వం మీద వచ్చిన విమర్శలనూ ప్రస్తావించారు. విప్లవ నేపథ్యంలో ప్రజల భాషలోకి మారిన కవిత్వాన్ని స్పృశిస్తూ స్త్రీవాదం, దళితవాద కవిత్వాన్ని పేర్కొన్నారు. మారుతున్న పరిస్థితుల మీద పోటెత్తడానికి కొత్త రచయితలు నూతన శిల్పంతో ముందుకు రావడం పట్ల ఆనందం వ్యక్తం చేశారు.

## ఆవేదనలో నుంచి అక్షరం

### తెలకపల్లి రవి

ఆవేదన లేనిదే అద్భుత సృష్టి సాధ్యం కాదని ప్రస్థానం సంపాదకుడు తెలకపల్లి రవి అన్నారు. సమాజానికి, కవి జీవితానికి, అక్షర సృష్టికి అవినాభావ సంబంధం ఉంటుందని చెబుతూ... విత్త, వినియోగాల సంస్కృతి పెరిగిపోతున్న నేపథ్యంలో మళ్లీ పల్లె వైపు, తల్లి వైపు సాహిత్య ప్రస్థానం సాగుతోందన్నారు. ప్రపంచంలో నిజమేదైనా ఉందంటే... అది అమ్మ... అమ్మ ప్రేమ అని పేర్కొంటూ నామిని 'పచ్చనాకు సాక్షి'గా, మిట్టూరోడి కతల్లో తల్లి ప్రేమ కొత్తగా ఆవిష్కరించిన తీరుకు మంచి ఆదరణ లభించిందన్నారు. వినియోగ సంస్కృతి తీవ్రంగా పెరిగిపోతున్న విషయాన్ని వివరిస్తూ... 'మదర్ ఇండియా' 'మిస్ ఇండియా'గా మారిపోతుందని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రపంచీకరణ నేపథ్యంలో... సమాజం సంక్షోభంలో పడిందని, మనిషిలో నెలకొంటోన్న అంతులేని అభద్రత, అర్థం కానితనం విస్తరిస్తోన్న పరిస్థితుల్లో సాహిత్యం, సంస్కృతి ఆవశ్యకత మరింత పెరుగుతోంద న్నారు. సామాజిక వ్యవస్థలో మార్పుకు దోహదం చేసే సత్తా ప్రగతిశీల సాహిత్యానికి ఉందన్నారు.

**(ఈనాడు న్యూఢిల్లీ జనవరి 7 సంచిక కథనం యధాతథంగా)**

# యుద్ధోన్మాదంపై కళాకారుల నిరసన

అమెరికా అధ్యక్షుడు జార్జి బుష్ రాకపై రాజకీయ నిరసనలకు సాహిత్యకారులు గళం కలిపారు. సామ్రాజ్య వాదాన్ని, యుద్ధోన్మాదాన్ని, అగ్రరాజ్య దురహంకారాన్ని ఖండిస్తూ సాహిత్యకారులు వివిధరూపాలలో సమీకృతులైనారు. ఫిబ్రవరి 22న 'సాహితీ స్రవంతి' కార్యాలయంలో తెలకపల్లి రవి, మోహన్, దివికుమార్, నిర్మలానంద, కె.లక్ష్మయ్య తదితరులతో సన్నాహక సమావేశం జరిగింది. సమావేశానికి రాలేక పోయినా తదితరులు ఆమోదం తెలిపారు.

జ్వాలాముఖి, అద్దేపల్లి రామమోహన రావు, నిఖిలేశ్వర్, శిఖామణి, షాజహానా, స్కైబాబా, జిలుకర శ్రీనివాస్ కొండేపూడి నిర్మల, సత్యభాస్కర్, పసునూరి రవీందర్, యాళ్ల అచ్యుత రామయ్య, వారప్రసాద్, దశరథ, జి. యాదగిరిరావు, కె.వి. అశోక్ కుమార్, గొరుసు జగదీశ్వరరెడ్డి, మోహన్, శేఖర్, జుగాష్‌విలి, అమ్మంగి వేణుగోపాల్, జాజులగౌరి, మోతుకూరి శ్రీనివాస్ కర్లపాలెం నిరంజన్, తాళ్ళూరి మురళీధర్‌గౌడ్, శిల్పా జగదీష్, తంగిరాల చక్రవర్తి తదితర సాహిత్యకారులు దాదాపు యాభై మంది పేర్లతో ఆహ్వానం విడుదలైంది.

ఆ మేరకు సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహణ సంఘం ఆధ్వర్యంలో 'ప్రతిఘటన' పేరిట ఫిబ్రవరి 28న కవుల సాహిత్య సమ్మేళనం జరిగింది. కె.శివారెడ్డి అధ్యక్షత వహించగా తెలకపల్లి రవి సమన్వయ కర్తగా వ్యవహరించారు. సామ్రాజ్యవాద దుస్తంత్రాలపై నిప్పులు చెరుగుతూ సాగిన కవితలు వింటూ సభికులు పలు మార్లు హర్షధ్వానాలు చేశారు. పర్సా సత్యనారాయణ ముగింపు వ్యాఖ్యలు ఉత్తేజపరచాయి.

ఈ సందర్భంగా రూపొందించిన ఎగ్జిబిషన్‌ను మార్చి ఒకటిన ప్రత్యేకంగా ఏర్పాటు చేసి మూడురోజులు కొనసాగించారు. మీడియాలో ఈ కార్టూనులు, చిత్రాలు విశేష ప్రచారం పొందాయి. మార్చి రెండవ తేదీన కళా సాహిత్యకారులు నిరసన శిబిరం నిర్వహించారు. ఓరోరి బుష్షోడా.. మాయదారి బూచోడా.. దునియకంత పెద్ద పీడ. సాగవు నీ ఫోజులీడ... అంటూ కలాలు, కుంచెలతో నిరసన ప్రకటించారు. సుందరయ్య పార్కు వద్ద ఏర్పాటైన శిబిరం కవితలు, పాటలతో మార్మోగింది. ప్రసిద్ధ చిత్రకారులు అక్కడికక్కడే గీసిన రేఖాస్త్రాలకు కరతాళధ్వనులు మార్మోగాయి.

తొడలు విరిగినా దుర్యోధనా... తోక తెగిన గుంటనక్కా.. ఎవడిచ్చాడురా నీకీ పోలీసు ఉద్యోగం? నీ మరణ శాసనానికి ముసాయిదా రాస్తూ గువేరా నీ గుండెల్లో వున్నాడు.. జ్వాలలు రగిలిస్తున్నావు కాని శలభానివయిపోతావులే.. నీ పిశాచ తాండవమే శ్మశానం వైపు నిన్నీడుస్తోందిరా.... అంటూ మహాకవి శ్రీశ్రీ దాదాపు నలభై అయిదేళ్ల కిందట రాసిన కవితను తెలకపల్లి రవి గుర్తుచేశారు. అంతర్జాతీయంగా పాబ్లో నెరూడా, చార్లీ చాప్లిన్, పికాసో వంటి ప్రసిద్ధ కళామూర్తులందరూ శాంతినాదం వినిపించిన వారేనని ఆయనన్నారు. ఇప్పుడు పాలకులు బుష్ ముందు సాగిలబడినా ప్రజాస్వామికప్రియులు, శాంతికాముకులు అందుకు సిద్ధంగా లేరని స్పష్టం చేశారు.

సీనియర్ కవి జ్వాలాముఖి అమెరికా దుష్ట పన్నాగాల పట్ల అప్రమత్తంగా వుండాలంటూ 'డాలరాసురుడు' అన్న కవిత చదివి వినిపించారు. మరో ప్రముఖకవి కె. శివారెడ్డి ఇలాటి సందర్భాలలో ప్రగతిశీల కవులు, కళాకారులు ఒక్కుమ్మడిగా నిరసన గళం వినిపించడం అభినందనీయమన్నారు.



'బూట్ ఔట్ బుష్' అంటూ బొమ్మ గీసి చిత్ర ప్రదర్శన ప్రారంభిస్తున్న ప్రముఖ చిత్రకారులు మోహన్

ప్రముఖ చిత్రకారులు మోహన్ 'బూట్ ఔట్ బుష్' అంటూ బొమ్మ గీసి చిత్ర ప్రదర్శన ప్రారంభించారు. చిత్ర, అన్వర్, శంకర్, మృత్యుంజయ, రవినాగ్, జె.వెంకటేష్, శిల్ప కూడా రేఖా చిత్రాల ద్వారా నిరసన తెలిపారు. చిన్నారి అమూల్య కూడా 'బుష్ గో బ్యాక్' అంటూ బుల్లి చిత్రం గీసి ఉత్సాహపరచింది. కార్యక్రమంలో ఇంక జుగాష్ వలీ, శిల్పా జగదీష్, పసునూరి రవీందర్, వరప్రసాద్, నరేష్, యాదగిరి రావు, లీలావతి, సత్యభాస్కర్, పర్సా సత్యనారాయణ, సైదులు తదితరులు కవితలు చదివారు. విమర్శకుడు బిసి 'ప్రస్థానం' మేనేజర్ కె.లక్ష్మయ్య ప్రభృతులు పాల్గొన్నారు. ప్రజానాట్య మండలి కళాకారులు గీతాలా పించారు. సాహిత్యకారులు ఈ విధం నిరసన కార్యక్రమం జరపడం అందరి ఆకట్టుకుంది. విదేశీ మీడియా ప్రతినిధు ప్రత్యేకాసక్తితో అడిగి తెలుసుకున్నారు.

# స్త్రీగా నా చైతన్యం, నా రచనలూ

అబ్బూరి ఛాయాదేవి రచించిన 'తనమార్గం' కథా సంపుటికి 2004వ సంవత్సరానికి గాను కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం లభించింది. ఓ సంప్రదాయ మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ఛాయాదేవి ఉన్నత విద్యనభ్యసించారు. కాలక్రమంలో తన ఆలోచనలకు పదును పెట్టుకున్నారు. స్త్రీలకోణంలోంచి రచనలు చేయడంలో పరిణతి సాధించారు. ఆమె రచించిన పలు కథలూ, వ్యాసాలూ, కాలమ్స్ .. మొదలైనవన్నీ వర్తమాన సమాజంలో స్త్రీల స్థితిగతులకు దర్పణం పడతాయి. స్త్రీల పట్ల ఆమె నిబద్ధతను వ్యక్తం చేస్తాయి. "స్త్రీగా నా చైతన్యం, నా రచనలూ" పేరిట 2000వ సంవత్సరంలో కాకతీయ విశ్వవిద్యాలయాన ఆమె చేసిన ప్రసంగంలోని కొన్ని భాగాలనిప్పుడు చదువుదాం.



ఛాయాదేవిని సత్కరిస్తున్న వేణుధర్‌రెడ్డి

## కుటుంబ పాత్రలే నా రచనలకు నేపథ్యం

### 'సాహితి' సత్కారం సందర్భంగా అబ్బూరి ఛాయాదేవి

కుటుంబాల్లో సాధారణంగా కన్పించే వ్యక్తులే తన రచనల్లోని పాత్రలకు నేపథ్యమని 2005 సంవత్సర కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు గ్రహీత అబ్బూరి ఛాయాదేవి అన్నారు. ఫిబ్రవరి 24న ఇక్కడి ఆంధ్రప్రదేశ్ భవన్‌లో ఆమెకు ఘనంగా సత్కారం జరిగింది. సమాచార శాఖ ప్రత్యేక అధికారి ఎన్.వేణుధరరెడ్డి ఆమెకు దుశ్శాలువా కప్పి మెమెంటోను అంద జేశారు. ఢిల్లీలోని సాహిత్య ప్రియుల నుండి ఈ కార్యక్రమానికి విశేష స్పందన లభించింది. ఈ సంద ర్భంగా జరిగిన ముఖాముఖి కార్య క్రమంలో సభికులడిగిన పలు ప్రశ్నలకు ఛాయాదేవి సమాధాన మిచ్చారు. స్త్రీవాదమంటే గయ్యాళి తనమే కాదని, తన రచనల్లో చూపిన విధంగా సౌమ్యంగానూ చిత్రీకరించ వచ్చు ని అన్నారు. పెద్ద సంఖ్యలో తెలుగువారు ఇక్కడికి రావడమే తనకు నిజమైన సత్కారమని అన్నారు. ఛాయాదేవి రచనా వ్యాసంగాన్ని, జీవిత విశేషాలను సాహితీవేత్త ఏల్చూరి మురళీధరరావు ముందుగా సభకు వివరించారు. సాహితి కన్వీనర్ కంభాలపల్లి కృష్ణ ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. శ్రీకాంత్, చంద్రశేఖర్ తదితరులు కార్యక్రమ నిర్వహణను పర్యవేక్షించారు.

నా పుట్టుకలోనే ఒక వైరుధ్యం ఉంది. రెండవ కొడుకు పుట్టాలనే కోరికతో దీక్షగా సూర్య నమస్కారాలు చేసేవారట. తీరా మాస్తే నేను పుట్టాను! అయినా, ఓటమిని అంగీకరించడం ఇష్టం లేక కావచ్చు, మా నాన్నగారు నన్ను మగపిల్లవాడిలా– మగపిల్లవాడి దుస్తులు రేసి, జుట్టు కత్తిరించి – పెంచారు.

స్కూల్ ఫైనల్లో ఉండగానే నాకు పెళ్లి చెయ్యాలనే ఆలోచన వచ్చింది మా నాన్నగారికి. కానీ ఆ సమయంలో మా అన్నయ్య ంగ్లాండులో పిహెచ్‌డి చేస్తున్నాడు. వాడు లేకుండా నా పెళ్లి చేయడం ష్టం లేక, నన్ను ఇంటర్‌మీడియట్‌లో చేర్పించారు. నేను ఏ సబ్జెక్టు సుకోవాలో ఆయనే నిర్ణయించారు. అప్లికేషన్ ఆయనే పూర్తి చేసి న్ను సంతకం పెట్టమనేవారు. పైన ఏముందో చూడాలంటే భయం. ల వంచుకుని సంతకం పెట్టేదాన్ని. తరువాత కాలంలో మా అన్నయ్య ప్పాడు ఏదీ చదవకుండా సంతకం పెట్టకూడదని. మా అన్నయ్య నా త కనీసం గ్రాడ్యుయేషన్ చేయించమని పట్టుపట్టాడు. మానాన్నగారు దనలేకపోయారు. బిఏ పూర్తయ్యే ముందు ఒక సంబంధం చూశారు. ది కుదిరినట్టే కుదిరి చెడిపోయింది. నన్ను ఇంట్లో ఊరికే ర్చోబెట్టడమెందుకని, రాజమండ్రి నుంచి హైదరాబాద్‌కి రప్పించి .ఏ.లో నిజాం కాలేజిలో చేర్పించాడు మా అన్నయ్య. నాలో అణగి న్న స్వేచ్ఛాభావాలకు మా అన్నయ్య చాలావరకు దోహదం చేశాడు.

మా వదిన రుక్మిణీ గోపాల్ అప్పట్లో కథలు రాసేది. తను న కథలు చూశాక నాకూ కథలు రాయాలన్న స్ఫూర్తి కలిగింది. అంతకు ముందు నాటకాల మీద అభిరుచి ఉండేది. రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో రెండు నాటకాల్లో చిన్న పాత్రలు ధరించాను. రేడియో నాటకాల్లో పాల్గొనేదాన్ని. బి.ఏ.లో నాన్‌డిటేయిల్డ్‌గా చదివిన 'బే రేట్స్ ఆఫ్ విమ్‌పోల్ స్ట్రీట్' అనే నాటకాన్ని తెలుగులోకి అనువదించి అనుసరణ చేశాను "పెంపకం" పేరుతో. అది రేడియోలో ప్రసారం అయింది – ఎం.ఏ. చదువుతుండగానే. అది తండ్రి నియంతృత్వం గురించి.. ప్రఖ్యాత ఆంగ్ల కవయిత్రి ఎలిజబెత్ బేరెట్ బ్రౌనింగ్ ప్రేమకథ అధారంగా రాసిన నాటకం. ఆ తండ్రి క్రమశిక్షణ, అధికారం మా నాన్నగారిని గుర్తుకు తెచ్చాయి. అందుకే ఆ నాటకం నన్ను ఆకట్టుకుంది. మా నాన్నగారు ఆ తెలుగు నాటకం స్క్రిప్టు పంపించమన్నారు. స్క్రిప్టు చదివి ఆర్ద్రంగా నాకు ఉత్తరం రాశారు– తనని చూసి ఎప్పుడూ భయపడవద్దనీ, తనకి పిల్లలపైన ప్రేమ తప్ప మరొకటి లేదనీ రాశారు. నా రచన వల్ల మాకు పరస్పర అవగాహన కలిగింది. ఆయన నా వ్యక్తిత్వాన్ని గుర్తించారనిపించింది. రచనకి ప్రయోజనం ఉంటుందని తెలుసుకున్నాను.

'భర్తని ఎన్నుకోవడం ఎలా?' అనే విషయంపైన రేడియోలో ప్రసంగించమన్నారు – రేడియోస్టేషన్‌లో తెలుగు ప్రోగ్రామ్స్ అప్పట్లో నిర్వహిస్తున్న ప్రముఖ కథకులు భాస్కరభట్ల కృష్ణారావుగారు. ఆ ప్రసంగం

తరవాతే ఆయన నాకు అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి సంబంధాన్ని సూచించారు. కట్నం తీసుకోలేదు. పెళ్లి తంతు సంప్రదాయబద్ధంగా జరిగినా, క్లుప్తంగా జరిగింది. సత్యనారాయణ వ్రతం వంటివి పాటించలేదు. మా మామగారూ మా వారూ ఎంఎన్ రాయ్ అంతేవాసులు. మా అన్నయ్యకి మార్క్సిస్టు భావాలు ఉండేవి. వీరందరి ప్రభావంతో నాలో కూడా హేతువాద దృక్పథం ఏర్పడింది.

వివాహం తరువాత, సాహిత్యరంగంలో నాకు ఎక్కువ ప్రోత్సాహం లభించింది. పాశ్చాత్య సాహిత్యం చదివే అవకాశం లభించింది. వ్యాపారపత్రికలో ప్రచురించబడిన నా మొదటి కథ 'విమర్శకులు'. 'తెలుగు స్వతంత్ర'లో 1955లో అచ్చయ్యింది. ఆంధ్ర యువతీ మండలి (హైదరాబాద్)లో సభ్యురాలినయ్యాక, మండలి తరఫున 'వనిత' అనే మాసపత్రికను ఒక సంవత్సరం పాటు నడిపాను. స్త్రీల సమస్యల గురించీ, కుటుంబ వ్యవస్థ గురించీ, సమాజం గురించీ ఆలోచించి, ఆలోచింపజేసే అవకాశం కలిగింది నాకు.

లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తుండగా వివాహం అయిన మా చిన్న ఆడపడుచు ఉద్యోగం మానేసి భర్త మీద ఆధారపడుతూ అసంతృప్తికి లోనవడం చూశాక 'ఉపగ్రహం – 1' అనే కథ రాశాను. ఓసారి సెలవులకి ఢిల్లీ నుండి హైదరాబాద్ వచ్చినప్పుడు, మా మరిది వాళ్లింట్లో రకరకాల బోన్‌సాయ్ చెట్లని పెంచడం చూశాను. మహావృక్షాలుగా రూపొందవలసిన వాటిని కళ పేరుతో చిన్న తొట్లలో మరగుజ్జు చెట్లలా కష్టపడి పెంచడాన్ని చూస్తే అనాదిగా స్త్రీని ఏ విధంగా సహజంగా ఎదగనివ్వకుండా ఇంటికి పరిమితం చేసి ఆమెను 'గృహలక్ష్మి' అంటూ పొగుడుతూ వచ్చారో స్ఫురించింది. స్త్రీని ఆధారపడేలా, నిస్సహాయురాలిగా ఎలా చేశారో చూపిస్తూ 'బోన్‌సాయ్ బ్రతుకు' అనే కథ రాశాను. ఆ కథ రాసినది 1974లో, ఒక సామాన్య పత్రికలో. అయినా ఆ కథ 1988లో కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించిన కథా సంకలనంలో వచ్చాక అందరి దృష్టినీ ఆకర్షించింది. అందులోని మౌలిక సత్యం అందరినీ ఆకట్టుకుంది. ఆ కథ పదవ తరగతి తెలుగు వాచకం (రెండోభాష)లో చేర్చబడింది.

1975వ సంవత్సరం 'అంతర్జాతీయ మహిళా సంవత్సరం' ప్రకటించబడింది. ఆ సందర్భంగా 'కర్త, కర్మ, క్రియ' అనే కథ రాసి ఆ సంవత్సరానికి అంకితం చేశాను. ఆఫీసుల్లో అధికారులు కొందరు పురుషాధిపత్యంతో ఉద్యోగినులను లైంగిక హింసకు గురి చేయడాన్ని చిత్రించాను ఆ కథలో. ఒక ఉద్యోగిని తన పై అధికారిని ఎలా ప్రతిఘటించడానికి ప్రయత్నించిందో చూపించాను. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అన్నట్టు అక్కడక్కడ అధికారంలో ఉన్న మంచిపురుషులూ ఉంటారని కూడా స్పష్టం చేశాను.

'ధైర్యవాణి' అనే కథ నేపథ్యం కొంత చెప్పాలి. 1988లో అబ్బూరి రామకృష్ణారావు గారి సంస్మరణ సభ సందర్భంగా 'కన్యాశుల్కం'లోని ఒక దృశ్యాన్ని కొందరు రచయితలూ, నాటకరంగ మిత్రులూ కలిసి, ప్రదర్శించాలనుకున్నారు. మధురవాణి పాత్ర వెయ్యడానికి ఎవరూ సరియైన వాళ్లు దొరకడం లేదని సతమతమవుతున్నారు. నేను మా వారితో, మా ఆడపడచు సుజాత మధురవాణిగా వేస్తే బావుంటుందని సూచించాను. "ఛీ" అన్నారు తక్షణం. ఒక మర్యాదస్థురాలైన గృహిణి మధురవాణి వేషం వేయడం ఏమిటన్న ఛీత్కారం అది. నటనలో అనుభవం లేదన్న అంశం కాదు. మర్యాదస్థుడు, బహు కుటుంబీకుడూ అయిన ఎ.ఆర్.కృష్ణ రామప్పంతులు వేషం వేస్తే లేని తప్పు ఒక గృహిణి మధురవాణిగా నటిస్తే ఏమిటి తప్పు– అని మనసులోనే గింజుకున్నాను. ఎనిమిదేళ్ల తరువాత, ఆ అనుభవాన్ని ఆధారంగా చేసుకుని 'ధైర్యవాణి' అనే కథ రాశాను. భర్త 'ఛీ' అని పడకగదిలో అన్నా వినిపించుకోకుండా మిత్రబృందం ముందు ధైర్యం చేసి తను మధురవాణి పాత్ర వేస్తానంటుంది కథానాయిక. నలుగురూ ఏమనుకుంటారు అని సమాజానికి భయపడతాం కాని, "ఆ సమాజం ఎక్కడుంది, ముంద మనలోనేగా" అనుకుంటుంది కథానాయిక కథ ముగింపులో.

"మొత్తం సమాజంలో మార్పు వచ్చి సర్వమానవ సమానత్వం ఏర్పడినప్పుడు స్త్రీలకు కూడా సమానత్వం సిద్ధిస్తుంది. స్త్రీలు ప్రత్యేకంగా పోరాటం సాగించడం మంచిది కాదు" అనే వాదనతో ఏకీభవించను. స్త్రీలు తమ పరిస్థితుల పట్ల చైతన్యవంతులు కావడానికీ, పురుషులని చైతన్యవంతులు చేయడానికి తమంతట తాము కృషిచేయవలసి ఉంది. ఎవరో సమాజం అంతటినీ సరిదిద్దిన తరవాత తమ పరిస్థితి కూడా మెరుగవుతుందని ఆశిస్తూ కూర్చోవడంలో అర్థం లేదు, ప్రయోజనం ఉండదు.

(కాత్యాయని విద్మహే సంపాదకత్వంలో వెలువడి 'తెలుగులో స్త్రీల సాహిత్యం' గ్రంథంలోంచి సంక్షిప్తంగా..

# తగాదా

పి. దస్తగిరి



విజయలక్ష్మి సూర్యనారాయణా భార్యాభర్తలు. ఇద్దరూ ఇంటర్ వరకూ చదువుకున్నవారే. ఆ వూరిలో కొంచెం ఆస్తిపరుల కిందే లెక్క. రెండు బోర్లు వున్నాయి. చాలా బోర్లు వేసినా, నీళ్ళుండే బోర్లు యివి. "ఏం పంట పెట్టినా గప్పుని పైకొచ్చే కండగల భూములున్నాయి." పాడి వుంది. తిండిగింజలతో పాటు ఆకు కూరలూ, కూరగాయలూ అన్నీ యింటి అవసరాలకు కొనకుండా పండుతాయి.

వీరికి నలుగురు ఆడపిల్లలు. ఇద్దరు పిల్లలకే కుటుంబ నియంత్రణ పాటిస్తానంది విజయలక్ష్మి. అయితే అత్త అంగీకరించలేదు. మూడవ కాన్పులో మగపిల్లవాడు పుడతాడని అటు వంశం, ఇటు వంశంలోని లెక్కాచారాల రుజువులు చూపింది. ఆ మగపిల్లవాడు నాలుగో కాన్పులో కూడా అవతరించలేదు. ఇంక విజయలక్ష్మి కుటుంబ నియంత్రణ పాటించింది.

విజయలక్ష్మి, సూర్యనారాయణలు ఒద్దికగానే వుండేవారు. ఇటీవల భార్యాభర్తల మధ్య తగాదాలొస్తున్నాయి. తొలకరి వర్షంతో ప్రారంభమవుతుంది తగాదా. అట్లా మొదలైన యీ తగాదా సేద్యం, విత్తనం, అమ్మకం గుండా ప్రవహించి, మరుసటి సంవత్సరం తొలకరి నాటికి ఆగితే ఆగుతుంది లేదా ఆ తొలకరి నుండి ప్రారంభమయ్యే మరో తగాదాతో కలుస్తుంది.

(1)

"ఏంరా! సూరీ! వుండావా?" అని అడుగుతూ వచ్చి, మంచం మీద కూర్చున్నాడు మస్తాన్ రెడ్డి.

"ఇప్పుడే యిట్లపాయ మామా! కూర్చో" అని మంచంపై రగ్గుపరచింది విజయలక్ష్మి.

రగ్గు సరిచేసుకుని కూర్చుంటూ "అట్ల పోదే? టయం అయిండ్లేదా?" అన్నాడు మస్తాన్‌రెడ్డి.

"లేదు మామా! ధరలు చెప్పే టైం యింకా అయిదు నిమిషాలుంది" చెప్పింది విజయలక్ష్మి.

"అదే కదా! రేడియోలో ధరలు చెప్పే టయానికి చచ్చినోడైనా లేచొస్తాడే?" అంటూ పక్కనే రాసుకుంటున్న కల్పనను చూచినాడు.

"ఏమ్మా! అది యింగ్లీషా? యిందీనా?" అని అడిగినాడు.

"ఇంగ్లీష్, తాతా!" కల్పన సమాధానం చెప్పింది.

"వొరె కొడకా! నాకు రెండక్షరాలు నేర్పీరా! మీ నాయనా ఎగతాళి చేస్తాడు. నా మనుమల్లూ ఎగతాళి చేస్తారు" అన్నాడు మస్తాన్‌రెడ్డి.

"నీకు యింగ్లీషు ఎందుకు తాతా! చత్వారం వొచ్చినోనికి కళ్ళద్దాలు కావాలి గానీ రంగుటద్దాలు ఎందుకు? యింత తెలుగు వస్తే ధరలు తెలుసుకోవచ్చు. బస్సెక్కొచ్చు, దిగొచ్చు అనంతపురం పోతే యాయంగడి ఏందో చదివి తెలుసుకోవచ్చు, పేపరు చదవొచ్చు. నిజంగా నీకు చదువుకోవాలని లేదు. రాత్రి బడికి పోవు. మనుమల్లతో, అందరితో ఎగతాళి చేయించుకుంటావ్" అన్నది కల్పన.

"ల్యా ల్యా ల్యా. రేపట్నుంచి ఖచ్చితంగా వస్తాను తల్లీ, ఈ వయసులో సిగ్గయితాది. సైగ్గా నేర్పించల్లరోయ్" అన్నాడు మస్తాన్‌రెడ్డి.

ఇంతలో ఏదో మునిగిపోతున్నవాని మాదిరి విస విస వచ్చి రేడియో 'ఆన్' చేసినాడు. సూర్యనారాయణ అంతా నిశ్శబ్దం. మామూలుగా కలిసే శంకరప్పా, ఆంజనేయులు యింకా ఒకరిద్దరు వచ్చినారు. ఆకాశవాణి కడప కేంద్రం నుండి ధరల వివరాలు ప్రసారం అవుతున్నాయి. ధరల వివరాలు అయిన వెంటనే కరెంట్ పోయింది.

"వార్నీ పాసన్నా! టి.వి. వార్తలు యినే టయానికన్నా కరెంటొస్తుందో రాదో?" అని శంకరప్ప అన్నాడు.

"కొంపలేం మునగలేదు లేప్పా వార్తలు యినకపోతే. ఈ ధరలు యింటే సాలదా? జనం ఎంత సుకంగా వుండారో? ప్రభుత్వమెంత సక్కగా పాలిస్తుందో తెలుస్తుంది" అన్నాడు ఆంజనేయులు.

"ఈ రోజు రేటు కొంచెం రైజయింది కదా!"

"ఏమి రైజో! ఏమి డానో? నిన్నటికి పోల్చుకుంటే కాసింత పెరిగింది. వారం కిందటికి పోల్చుకుంటే ఎంత తగ్గింది? ఎంత తగ్గింది? వోయమ్మా? ఎంత తగ్గింది?" వివరించినాడు ఆంజనేయులు.



"అసలికి యీసారి లాలూ సాబుకు బలే దుడ్లు! బలే దుడ్లు! యింకా కల్లం నుండి యింటికి రాకనే పచ్చి కాయల్నే అమ్మినాడు. అమ్మిన్నాటికీ, యీనాటికీ ఎంత వారా? మూటకి ఎనభైకి పైగా తేడా! పసిమి, ఆరవాసి లెక్కకడితే దిక్కుతెలీని వారా (= తేడా)". మస్తాన్‌రెడ్డి చప్పరిస్తూ చెప్పినాడు.

"చావు పుట్టుకలు చెప్పేవారుండొచ్చుగానీ ధరల కత ఎవరికి తెలుస్తుంది? పంటకాలమప్పుడు తక్కువుంటుంది. రైతుల దగ్గర మూటలు అయిపోగా, అయిపోగా ధరలు పెరుగుతాయి. అట్లని నమ్మి స్టాకు నిలిపితే రివర్సయితాది" అన్నాడు సూర్యనారాయణ.

"అట్లనే మా రాజా! అన్నీ అమ్మలేక చాలా అవసరమైనపుడు ఒక మూట, ఒక మూట బండికేసుకుని పొయ్యేది, సంతసేసుకొచ్చుకుండేది" వివరించాడు శంకరప్ప.

"అదేం చెప్తావ్! ఈ కత విను. ధరల కతే. అగమ్యగోచరం. రాంసుబ్బులుగాని కథ విను. నిరుడు వీధి వీధి తిరిగి, వూరు, వూరు తిరిగి శేర్లతో కొలిసి, దిక్కు తెలీని లాభం సంపాగించ. నిరుటి మాదిరీనే నిల్వ బెడితే రేట్లు పెరుగుతాయని ఒక్క కాయీ అమ్మకుండా చాలాకాలం అట్లెపెట్టె. లాబం పాయ! అసలు పాయ! అప్పులో పడినాడు. శివశంకర మెడికల్ షాపువాండ్ల బోరింగ్ మిషన్ రాజస్థాన్‌లో పనిచేస్తావుంటే దిన కూలిగా ఆటికిపోయినాడు." చెప్పినాడు మస్తాన్‌రెడ్డి.

ఇంతలో నరసయ్య ఒక వార్త మోసుకొని వచ్చినాడు –

జ్జా జ్జా న్నే వ్! ఎన్ని పసులు! అబ్బబ్బ! అవి పోతాంటే సుడ్రగాలి వచ్చినపుడు దుమ్ములేస్తాండ్లా అట్ల లేస్తాంది దుమ్ము. తోపుదుర్తి పక్కోల్లంట. అక్కడ మ్యాతల్యాక మన కొండల్కి యెగదోలుతుండారు?"

"మనుసులకి బూ లేదు. పసులకి మ్యాత లేదు. నోరు లేని జీవాల నరకం సెప్పేకి కాదు."

ఇంతలో కరెంట్ వచ్చి రేడియో మాట్లాడింది. "అన్నదాత సుఖీభవ! అన్నదాత కంటి అశ్రుజలపాతాలకు మంత్రి గుండె ద్రవించిపోతున్నది. రైతన్నను ఆదుకోవడం ప్రభుత్వ ధర్మం..." వాక్యం పూర్తికాకుండానే సూర్యనారాయణ రేడియో ఆపుచేసినాడు. క్యాకరిచ్చి ఎంగిలుమిసినాడు. చెప్పే వాళ్ళకి సిగ్గులేకపోతే వినే వాళ్ళ కన్నా వద్దా అన్నాడు.

**(2)**

ఇంట్లో నిశ్శబ్ద వాతావరణం. యుద్ధానికి సన్నద్ధమవుతున్న నిశ్శబ్దం. చిన్న పాప పరుగెత్తుకుంటూ వచ్చి నాన్న మీద 'చాకల మూట' వూగుతూ "లాలూ సాబోల్లు పేద్ద టి.వి. తెచ్చినారు. ఎంత బాగుందో, మనది యెవరికన్నా యిచ్చి మనమూ అట్లానే తెచ్చుకుందాం. మనకీ తీసుకురా నాన్నా" అంది. వెంటనే విజయలక్ష్మి జవాబిచ్చింది – "లాలూ సాబ్‌కు వచ్చిందేదీ మూటకు ఎనభయ్యే లాభం. మీ నాయనకి ఎంతొచ్చిందనుకో యింటివి? కట్టలు ఎంచి, ఎంచి చేతులు నొప్పి పెట్టినాయి. పేద్ద టి.వి.నే కాదు, విసిపి, కారు కూడా తెచ్చేదే!"

ఆ మాటలకు బాకుతో గుమ్మినట్లు విలవిలలాడినాడు సూర్యనారాయణ. పాపను విదిలించి, పక్కకు తోసి "అబ్బా తండ్రీ! నేనింక భరించలేను. ఇరవై నాలుగ్గంటలూ గీకడమేనా?" అని తలబాదుకున్నాడు. "యిట్ల సూటిపోటి మాటలతో పొడిసే కన్నా, సురకత్తితో గొంతు కోసేయ్! నేనేమన్నా జ్యోతిష్కున్నా ఎప్పుడు ఏ ధర వుంటుందో తెలుసుకోవడానికి? పోయినసారి మాదిరి ఈసారి అనుకోయింటి. చెనిక్కాయ అట్లే నిల్వపెట్టినాను. ధరపడిపాయ. నేనేం చేసేది? నిరుడు చివర్లో అమ్మినోల్లకి డబ్బులు వచ్చా. ఈసారి కల్లంలోనివి కల్లంలోనే యింక పసిమి ఆరకనే అమ్మిన వాల్లకి డబ్బులు వచ్చా. డబ్బులు చేదని యీ పని చేసినానా? అప్పులపాలు కావాలని ఈ పని చేసినానా? నాకు సంబంధం లేని దాన్ని పట్టుకొని నన్ను కాడాడిస్తాండావు" అన్నారు.

"ఏం అంత యాష్టపడాల్సిందేముంది? ఎట్ల రాసిందో అట్ల జరుగుతుంది. ఇది నీ యిల్లు. వీళ్లు నీ పిల్లోల్లు నువ్వు యజమానివి. నేనేదో పనిమనిషిని. నేనెందుకు కాడిస్తాను?" అంది విజయలక్ష్మి.

"అబ్బ! ఈ రోజు కొట్లాట లేదులే అనుకోయింటి మొదలైందా?" అంది పెద్ద పాప.

"నేనేమన్నా మూటలు కట్టి పుట్నింటికేమన్నా పంపుతున్నానా? అంతా నీకూ నీ బిడ్డలకే గదా! నాకేం యీ ముసలి పాత యింట్లో కాదు! పూరి గుడిసెలో ఉండల్ల! అనూ వుంటా. చెట్టుకింద ఉండల్ల! అనూ, వుంటా. నీ బిడ్డలకి చదువొద్దు. మంచి సంబంధాలొద్దు రావంటపోయే దానయ్యకో, పసులు గాసే వానికో బిడ్డల్ని ముడేయ్ నువ్వేదన్నా ఆశ్రమం చూసుకో! నేను ఏదన్నా బాయి చూసుకుంటా!.." విజయలక్ష్మి ఆగకుండా మాటలతో పొడుస్తూనే వుంది. తట్టుకోలేక సూర్యనారాయణ బయటకు వెళ్ళిపోయినాడు.

"తప్పించుకొని పారిపోతే లాభమేమొచ్చు? ఎదురుగా నిలబడల్ల! వాదించాల్ల! ఒప్పించల్ల! లేదా ఒప్పుకోల్ల!" ఇంకా ఏదో అనబోతోంది విజయలక్ష్మి.

"నాయదేముంది తప్పు? పోయినసారి నువ్వు చెప్పిన అమ్మింటే కొట్టడీ పట్టకుండా వచ్చింది కదా డబ్బు!" తప్పు ఎత్తిచూపింది పెద్ద పాప.

"సరేలే తల్లీ! మీ నాయన మీద ఈగ వాల్నీవు. మీతో, మీ నాయన గారితో వాదించే శక్తి నాకు లేదు. మీరంతా పోయి అన్నం తిని పడుకోండి!" అంది విజయలక్ష్మి.

పిల్లలు తిని మిద్దెక్కిన తరువాత సూర్యనారాయణ తిరిగి వచ్చినాడు. పెద్ద పాప అన్నం పెట్టింది. అమ్మనూ పిలిచింది. ఆమె ఆకలి లేదంది. పౌరుషంగా ఒక్కడే అన్నం తిని గబ గబ మిద్దెక్కినాడు సూర్యనారాయణ. ఆ తరువాత పెద్ద పాప బలవంతం మీద తట్ట దగ్గర కూర్చుంది విజయలక్ష్మి. పౌరుషంగా కొంత తినింది, కానీ తరువాత ఏడ్చుకుంటూ తినడం మానింది. "అంత ప్రేమ ఏమయిపాయ! ఎవరు గుంజుకుంద్రు? ఎవరు పుండుపెట్రి? ఇద్దరూ ఒక పళ్ళంలో కూచ్చుంటేనే దిగేది ముద్ద. యిపుడో నా చేతి ముద్దే వేపాకయింటే! విషమయింటే! అందరూ యిాల్లెక్కడ పెండ్లాం మొగుల్లు తండ్రీ!" అని మురిసిపోతావుంద్రి. "ఇపుడు నానీడే గిట్టకుండా వుంది. ఏం అంత చేయరాని పని ఏం చేసినాను?" అని మనసులోనే చాలా బాధపడుతోంది. ఏడుస్తోంది విజయలక్ష్మి.

"ఎవరబ్బ గంటన్నా అడిగినానా? ఎంత కష్టం చేసి పండించినాము? హాఫ్ఫట్ అంటే పండినాయా? నా బిడ్డలకు యింత తలదువ్వి సోకు చేయడానికి టైం లేదు. యింత కలిపి తినిపించే టైం లేదు. ముద్దు ముచ్చట తీర్చడానికీ టైం లేదు. ముచ్చట్లాడటానికి టైం లేదు. పసిబిడ్డకు కుదురుగా కూర్చొని పాలు తాపడానికీ లేదు. యింత కష్టపడి, గాలిలో, ఎండలో బాధపడి పండించుకొనేది నాలుగు డబ్బులు వస్తాయనే కదా! నాలుగు సౌకర్యాలు కలగజేయాలనే కదా!" విజయలక్ష్మి గట్టిగా ఏడుస్తూ మాట్లాడుతూ కూతురుతో బాధ వెల్లబోసుకుంది. "ఇదంతా ఎట్లన్నా ఆయ. నా బాధ ఎల్లబోసుకుండేకీ నాకు హక్కులేదా?" అనీ ప్రశ్నించింది మరింత గట్టిగా ఏడుస్తూ. అన్నం తట్లను విసురుగా పక్కకు తోసింది.



ఏడుపు విని సూర్యనారాయణ ిగివచ్చినాడు. అనునయంగా "ఎందుకు ాధపడతావు? నాకు లేదా బాధ? నేను చేతకాని ాన్ని, బుద్ధిలేనివాన్ని, సరే, నువ్వు అమ్మితే నేనొద్దంటానా? ఇగో ుదాలు కదలించను. నువ్వు ఎట్ల చేస్తే అట్ల. దున్నమంటే దున్నుతా. ారువు వేయమంటే ఎరువు వేస్తా. ఎపుడు విత్తనం వేయమంటే అపుడు ేస్తా. ఎపుడు అమ్మమంటే అపుడు అమ్ముతా" అన్నాడు.

"ఓహోహో! ఏం మాటలు చెప్తావో? పోయినసారి వర్షం ుస్తుంది, వస్తుంది తొందరపడవద్దు, అరకొర పదనులో విత్తద్దు అంటే ుంటివా? ఆడదాని మాట ఎట్లింటారు? మొగుడివి కదా! మొగోనివి ాదా! యింక పంట కాలమంతా అకాల వర్షమే!" అంది విజయలక్ష్మి.

"అందరికీ అయిందే మనకీ" జవాబిచ్చినాడు ూర్యనారాయణ.

"అందరితో మనకేం పని? మన వైనం కొద్దీ మనం పోవల్ల" విజయలక్ష్మి.

"నీదేం నాలికా, బట్టపేలికా? ఎట్లంటే అట్ల మాట్లాడుతావే? ుప్పు తప్పులు పట్టడమే నీ ధ్యేయం. ఇది తూర్పు అంటే కాదు పడమర ు తీరతావు. అందరితో పాటు మనమూ అంటే అందరితో మనకేం ు? అంటావు. పోనీ, మనంతకు మనం అంటే అందరు చేసే పని ు బాగుంటుంది అంటావు" – సూర్యనారాయణ.

మధ్యలో అందుకొని "అబ్బ నాయనా! అమ్మా!" అని పెద్ద ు ఎంత అడ్డమొచ్చినా వాళ్ళు ఆగలేదు. మేమెందుకు కొట్లాడుతాము? ుయాలు మాట్లాడుకోకూడదా?" అంటారు వాళ్ళు.

మాట్లాడుకోవడమంటే కరవటమా? అనేది పాప ప్రశ్న.

**(3)**

విజయలక్ష్మి చెప్పినట్లుగానే ఉల్లిగడ్డలు లోడు తీసుకొని కలకత్తాకు పోయినాడు సూర్యనారాయణ. కలకత్తాకు పోయిన సూర్యనారాయణ పదిరోజులైనా తిరిగి రాలేదు. ఆయన చెప్పినట్లు మద్రాసుకే పోయివుంటే బాగున్నేమో? అతి బాధపడుతున్నది విజయలక్ష్మి. ఫోను రాలేదు. ఫోను చేయడానికి చిరునామా తెలీదు. రోజులు గడిచేకొద్దీ ప్రతి గంటా బాధే. పగలు ఎట్లయినా పొద్దుపోయినా, రాత్రి గడపటం చాలా కష్టంగా ఉంది.

పదకొండో రోజు తెల్లవారుజామున వచ్చినాడు సూర్యనారాయణ. వాకిలి తీసి అతన్ని చూస్తూనే గబుక్కున అతన్ని పట్టుకొని మౌనంగా ఏడుస్తూ సొమ్మసిల్లినట్లు వాకిలికి ఆనుకుంది. "ఎంత కిరాతకుడివి? ఒక ఫోను చేయలేకపోతివా?" అనింది. "మేమేమయి పోవల్లనుకుండావు? ఆడ యాక్సిడెంటు, ఈడ యాక్సిడెంటు, ఆడ లారీ దోపిడీ, ఈడ దోపిడీ అని చెప్తాంటే... తండ్రీ! తండ్రి తండ్రీ! కంటికి కునుకు లేదు. ఆహారం దిగదు. నా చేతుల్లారా నా దేవున్ని..." గట్టిగ, యింక గట్టిగ ఏడ్చింది. పిల్లలు ఉలిక్కిపడి లేచినారు.

సూర్యనారాయణ ఆమె మురిపానికి ముద్దు ముద్దుగ, గట్టిగ నవ్వినాడు. "నవ్వుతావు మోసకారివి!" ఆ చెంప, ఈ చెంప ఫళ ఫళ అదరగొట్టి, మనిషిని తోసేసి వంటింట్లోకి పోయింది. పొయ్యిలో కంది కట్టె దురికి, గనగన మండజేసి నీళ్ళు కాంచింది. వొళ్ళు రుద్దు, రుద్ది పోసింది. అతనికిష్టమైన బొరుగుల 'ఉగ్గాణి' చేసింది. మిరపకాయ బజ్జీలు చేసింది. బ్రూకాఫీ చేసింది. తిన్న తరువాత మంచానికడ్డంపడి, ఆదమరచి నిద్రపోయినాడు సూర్యనారాయణ.

ఆయన తెచ్చిన సంచి వెతికింది విజయలక్ష్మి. పిల్లలకూ, తనకూ తెచ్చిన కొత్తబట్టలున్నాయి కానీ ఒక్క రూపాయి నోటు లేదు. డబ్బు ఏమయింది? డి.డి. కూడా లేదు. తనకు తిక్కబట్టి వెతుకుతున్నది. ఏది తెచ్చినా తనకే యిస్తాడు కదా! దావలో ఏమన్నా జరిగిందా? ఎంత తర్కించినా అర్థం కాలేదు. మనిషి క్షేమంగా వచ్చినాడు సంతోషము అనుకుంది. అయినా డబ్బు ఏమయినట్లు? అనే ఆలోచన మనసులో వేధిస్తూనే వుంది.

లేచిన తరువాత సూర్యనారాయణ యిట్ల చెప్పినాడు. "పాపం డ్రైవరు ఉత్తముడు. ఓనరే డ్రైవరు. ఎక్కడ చూసినా ఉల్లిగడ్డల లారీలే అక్కడ! బంగకపోయినా మా కొద్దు, మాకొద్దు అంటారు. లారీ బాడుగలే గిట్టవు. తీసుకుపోయిన తరువాత పచ్చి సరుకు ఎక్కువకాలం నిలిపేకి లేదు. ఆటికీ రెండు రోజులు నిలిపినాము. చివరికి లోడు దించితిమి. లారీ బాడుక్కే రెండు వేలు తక్కువొచ్చింది. టీ తాగేకి కూడా నా దగ్గర పైసా లేదు. నా దీనావస్థ చూసి డ్రైవరే "అన్నా! నువ్వు దిగులు పడొద్దు. నిదానంగా కాలం కలిసొచ్చినపుడు యిస్తువులే. రెండు వేలూ వొద్దులే" అని అంగడికి పిలుచుకుపోయి బట్టలు తీసిచ్చినాడు. దారి పొడుగూనా ఖర్చంతా పాపం ఆ పిల్లాడే పెట్టినాడు."

"నాదే తప్పు... నువ్వు చెప్పినట్లు చెన్నై పోయింటే..."

"యిట్ల లాటరీ బతుకున్నన్నాళ్ళూ అట్ల చేసింటే బాగుండు, యిట్ల చేసింటే బాగుండు అని మనం, మనం తగాదా పడాల్సిందే. మన పంటకు మార్కెట్ మనది కాదు. మనం ఓట్లేసి గెలిపించిన ప్రభుత్వమూ మనది కాదు. తగాదా అంతా దీనితోనే.

# కథను తీర్చిదిద్దిన గురజాడ



**అవసరం బట్టి ఆయుధం ఎన్నుకున్నట్టు, సందర్భం బట్టి ప్రక్రియ ఎన్నుకోవడం గురజాడలో కనిపిస్తుంది. కథా రచనలో, కవిత్వం విషయంలో, కన్యాశుల్కం నాటకంలో – గురజాడ అగ్రస్థానంలో వున్నారు. మూడు విభిన్న ప్రక్రియ లలో తాను చెప్పాలనుకున్న విషయాలను కళాత్మకంగా చెప్పడం ఆయన గొప్పతనం. ఇందులోని అంత స్వూత్రాన్ని గుర్తించకుండా ప్రక్రియా పరమైన రాగద్వేషాలు పెంచుకోవడం తర్వాతి తర్వాతి తరాల్లో కనబడటం విచిత్రం. ఇది రచయితలకు వుండాల్సిన స్పష్టతాంశం.**

**నాగసూరి వేణుగోపాల్**

"ఏయే భాగాలలో అనంగీకారమో, ఒక భోగం పడచును, మైక్రోస్కోపు ముందు వుంచి ఎనలైజ్ చేసి చూస్తే తప్ప అమీతుమీ తేల్చుకోరాదు. ప్రయోగం, పరిశోధన, రుజువు సాధ్యపడనిదే ఏదీ సిద్ధాంతంగా చెప్పకూడదు..." ఇది గురజాడ అప్పారావు ఆంగ్ల కథానిక 'స్టూపింగ్ టు రైజ్' అనే దాన్లో అన్నమాట. 'సంస్కర్త హృదయం' కథ యిదే! చాలా సరళమైన అంశాన్ని చాలా చమత్కారంగానే చెప్పడం కాదు. విజ్ఞాన విషయాల సైద్ధాంతిక భూమికకు సంబంధించిన మౌలిక అంశాలను యిట్టే పేర్కొన్నారు. జఠిలమైన విషయాలను జఠిలంగానే చెప్పవలసిన పని లేదు – అనే విషయం కూడా సుతారంగా చెప్పాడు గురజాడ. ఎటొచ్చి మనం గుర్తించాలి.

గురజాడ అనే ఐదే ఐదు – కాదంటే నాలుగున్నర – కథలు మాత్రమే రాశారు. కానీ కథకుడిగా ఆయన వ్యూహం సమగ్రమైందీ, పరిపుష్టమైందీ – అనిపిస్తుంది. కథావస్తువు పూర్తిగా బాధితుల పక్షం. దిద్దుబాటు (కమలిని), మెటిల్డా, సంస్కర్త హృదయం – కథలు స్త్రీ సమస్యలకు సంబంధించి, స్త్రీ పక్షం వహించేవి. ఇపుడు స్త్రీ చైతన్యవాదమని వినబడుతుంది కానీ – ఆయన రెండు కథలకు కథానాయికల పేర్లు పెట్టడం గమనార్హం. మీ పేరేమిటి? పెద్ద మసీదు – కథలు మతం సంబంధించిన అంశాలను స్పృశించినవి. మొత్తం కథలు అధిక సంఖ్యాకులను బలంగా ఖండిస్తూ వ్రాసినవే! ఈ విషయంలో రచయిత ధైర్యం గురించి చెప్పుకోవాలి. దూరంగా వున్నవారిని అందరూ విమర్శించగలరు. కానీ చాలా దగ్గరగా, బలంగా వున్న శత్రువులను ఖండించడం – హాస్యంగా, వ్యంగ్యంగా ఎత్తి పొడవడం చిన్న విషయం కాదు. అవసరం బట్టి ఆయుధం ఎన్నుకున్నట్టు, సందర్భం బట్టి ప్రక్రియ ఎన్నుకోవడం గురజాడలో కనిపిస్తుంది. కథా రచనలో, కవిత్వం విషయంలో, కన్యాశుల్కం నాటకంలో – గురజాడ అగ్రస్థానంలో వున్నారు. మూడు విభిన్న ప్రక్రియ లలో తాను చెప్పాలనుకున్న విషయాలను కళాత్మకంగా చెప్పడం ఆయన గొప్పతనం. ఇందులోని అంత స్వూత్రాన్ని గుర్తించకుండా ప్రక్రియా పరమైన రాగద్వేషాలు పెంచుకోవడం తర్వాతి తర్వాతి తరాల్లో కనబడటం విచిత్రం. ఇది రచయితలకు వుండాల్సిన స్పష్టతాంశం.

కథా రచనకు సంబంధించి నిడివి గురించి కూడా మనం ఆలోచించాలి. ఈ ఐదు కథలు 5 పేజీలు, 15, 6, 3, 21 – వుండటం ఆసక్తి కల్గిస్తుంది. కథ ప్రయోజనం బట్టి రచయిత నిర్ణయించుకోవాలి మరి! దిద్దుబాటు, మెటిల్డా, పెద్ద మసీదు కథలు యిపుడు మనం చదివే కథల నిడివిలో వున్నాయి. ఇవి దాదాపు 95 సంవత్సరాల క్రితం రాశారని గుర్తుంచు కోవాలి. మనం శతాబ్దం వెనుక వున్నామా లేదా గురజాడ గారు శతాబ్దం ముందు వున్నారా – అని అనిపించక మానదు. యాభై పేజీల్లో ఐదు కథలు యివ్వడం రచయిత విజయమే!

అవసరం అయితే లేదా మరింత సార్వత్రికమనిపిస్తే మార్చుకోవడంతో తప్పులేదు. విజ్ఞానశాస్త్రం చెప్పే అంశం కూడా యిదే! కొత్త పరిజ్ఞానం తోడయినపుడు, ప్రయోగాత్మకంగా రుజువు అయినపుడు మార్చుకోవడం శాస్త్రీయ పద్ధతి. 'కన్యాశుల్కం' మాత్రమే కాదు 'దిద్దుబాటు' కూడా మార్పుకు లోనైంది. భాషాపరమైన సార్వత్రికతకు ద్వారాలు తీసింది. దిద్దుబాటుకు ముందే రచయిత కన్యాశుల్కం ద్వారా మార్పు ప్రయోజనం గమనించారు. ఇది ఆయన శాస్త్ర దృష్టి. వీరేశలింగం పంతులు సంస్కరణ అభిలాష వున్నా – చెప్పేటపుడు వళ్ళు తెలియకుండా వాదించకపోవడం గురజా గొప్పదనం. అదే గురజాడను చిరంజీవి చేసింది. అదే ఆయన శిల్ప వైశిష్ట్యం. హాస్యం వ్యంగ్యం, వెటకారం రంగరించి చెప్పడంతో గుర్తుండటమే కాదు, దెబ్బ గట్టిగ తగులుతుంది. మొరటుగా చెప్పకుండ సుతారంగా సూచించడం ఎక్కు ప్రభావవంతమైంది. ఆసక్తిగా నడపటం ఎం ముఖ్యమో, అంతే స్థాయిలో ప్రారంభ ముగింపులు వుండటం తెలివైన వ్యూహ 'దిద్దుబాటు', 'కథానిక', 'తలుపు తలుపు అంటూ మొదలవుతుంది. తలు తెరవబడలేదు. ఒక నిమిషమతడూరుకొనె గదిలోని గడియారము టింగుమని ఒం గంట కొట్టినది – అని కథ సాగుతుం ఆసక్తిని కొనసాగించడమే కాక, సమయా సూచిస్తారు. తర్వాత అతని మనోగతం వెళతాడు. తర్వాత దీపం కూడా లే సూచిస్తూ కథ నడుపుతాడు – కథానా కమలిని ఉత్తరం ఉంటుంది. చివరన కమ నవ్వుతో కథ ముగుస్తుంది. కేవలం రెం

పాత్రలతో కథ నడపటం అప్పటికి గొప్ప విషయమే! అంతేకాదు 'ఆదారు చదువే నేరిస్తే ఏటౌతాది?' అని పాత్రోచితంగా ఆ ప్రాంతపు భాషను ప్రవేశపెట్టారు.

ముగింపు కూడా అంతే ముఖ్యం. చదువరి మీద ప్రభావం కల్గించే విషయంలో ముగింపు చాలా ముఖ్యమైంది. ఆయన కళ్ళు నీళ్ళతో గిర్రున తిరిగాయి – అని 'సంస్కర్త హృదయం' ముగిస్తే – అంతలో మంచం కింది నుంచి అమృతం వొలికే కలకలనవ్వు, మనోహారియైన నూపురముల రొద విననయ్యెను – అని 'దిద్దుబాటు' ముగుస్తుంది. మిగతా మూడు కథలు సంభాషణతో ముగియడం విశేషం. మరీ ముఖ్యంగా 'పెద్ద మసీదు' (మతము : విమతము) అయితే "అయ్యో! నువ్వా మావా!" అని ముగియడం అద్భుతమైన కొసమెరుపు. ఈ మూడు పదాల జవాబు మొత్తం కథలోని కథను ఎరుకపరుస్తుంది. ఈ కథ అర్థంతరంగా ఆగిపోయిందని అంటారు. ఒక్క నార్లగారు మాత్రమే యిది సంపూర్తి అయిన కథ అన్నారు. ఈ ముగింపు – మూడు పదాల జవాబు – అద్భుతమైన కొసమెరుపు.

కథ నడపటం కూడా సందర్భం బట్టి గమనార్హం. మీ పేరేమిటి, సంస్కర్త హృదయం – వర్ణనాత్మకం కాగా, దిద్దుబాటు, పెద్ద మసీదు, మెటిల్డా – సంభాషణాత్మకంగా సాగుతాయి!! నా కళ్ళకు కట్టినట్టు ఆ వొంచిన మొఖం. బిందువులుగా స్రవించిన కన్నీరు : ఆచుకొన్న నిట్టూర్పుల చేత కంపించిన రొమ్ము, ఏ మహాకవి రచనలోనూ లేదనగలను. అగాధమైన ప్రౌఢమైన కరుణ రసం, ఆ సరిలేని సొగసున్ను.... "–యిది మెటిల్డా గురించి వర్ణన. అలాగే మరోచోట "మీ పేరేమిటి"లో క్రీస్తును, శ్రీ మహావిష్ణు యొక్క పదకొండవ అవతారంగా చెయ్యడానికి సాధ్యంకాక వొదబడి వూరుకున్నాం..." అంటారు రచయిత. పైన ఎంత భావుకత యిక్కడ అంత వ్యంగ్యం వుంది. అలాగే 'సంస్కర్త హృదయం'లో "– సమాజంలో భోగం పడచులు "సేఫ్టీ వాల్వ్యూస్" వంటి వారు... 'అనడంలో చమత్కారంతో నాణేనికి రెండోవైపు వంటి దృష్టి కూడా వుంది. "లేబొరేటరీలో దుర్వాసన కొట్టే సల్ఫ్యూరిక్ యాసిడ్, హైడ్రోజన్ కంటే అగరు, అత్తరుల వాసనలు నరికొత్త మార్పులని అంగీకరించాడు..." అని 'సంస్కర్త హృదయం' లో అనడం హాస్య చతురతే! అంతకుమించి "దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్ళారా? మీ పేరేమిటి?" అనే కథ శీర్షికలో శాస్త్ర దృష్టి పుష్కలంగా వుంది. ఇంత సమగ్రమైన, ప్రభావవంతమైన వ్యూహం ఎలా సాధ్యపడింది – అనే ప్రశ్నకు జవాబుగా ఆయన ఆలోచన, పాండిత్యపు నేపథ్యం పరిశీలించాలి. ఆయన బి.ఎ.లో తత్వశాస్త్రం, సంస్కృతం నేర్చుకున్నారు. గిడుగు రామమూర్తి పంతులు బాల్య స్నేహితుడే కాదు, బి.ఎ. దాకా చదువుకున్నారు. మొదట ఇంగ్లీషులో కవిత్వ రచన. అలా తొలి దశలో రాసినవి ప్రచురింపబడటమే కాదు, అభినందనలతో పునర్ముద్రింపబడ్డాయి. పెద్ద పత్రికలలో, మొదట హైస్కూలులో ఉపాధ్యాయుడు, తర్వాత డిప్యూటీ కలెక్టరాఫీసులో హెడ్‌క్లర్క్ తర్వాత లెక్చరర్ ఉద్యోగం. 1891లో నూట పాతిక జీతం, ఇంగ్లీషు వ్యాకరణం, సంస్కృత సారస్వతం, అనువాదం, గ్రీకు, రోమన్ చరిత్రలు – ఆయన బోధించేవారు. అదే సమయంలో సంస్థాన శాసన పరిశోధక పదవి. తర్వాత సంపాదకుడు కావాలని ఆశతో 'ప్రకాశిక సంపాదకునిగా డిక్లరేషన్, కావ్యాలు, చరిత్రలు పరిశోధించి, పరిష్కరించడం, గజపతుల దావాలు నడపటం, రీవారాణి ఆంతరంగిక కార్యదర్శి ఉద్యోగం, మద్రాసు విశ్వ విద్యాలయంలో ఫెల్లో పదవి. ఇదీ ఆయన నేపథ్యం. అంతకుమించి అనారోగ్యం.

గురజాడ కథలు ఒకటికి మూడు సార్లు చదివితే, మనం ఆయన బాణి పట్టుకుని ముందుకెళ్ళింది స్వల్పమే – అనే అభిప్రాయం తప్పక కలుగుతుంది.

---

## శీర్షిక ఏదైతేనేం?

### కొలనుపాక మురళీధరరావు

ఎన్ని స్కానింగ్‌లు తీసినా
ఎన్ని ఎక్స్‌రేలు తీసినా
కనిపించని దబ్బు జబ్బు
దీనికి లేదు మరేమి ట్రీట్‌మెంట్!
మానవుని స్వార్థపరత్వం
రాజకీయ రాక్షసత్వం
అవినీతి హంగులు
దగా మోసాల చేతలు
చిత్తశుద్ధిలేని నేతలు
వాడ వాడన వెలసిన
బ్రాండీ విస్కీ దుకాణాలు
సగటు మనిషిని
తాగి తందనాడమంటున్నాయి
ఖాళీ జేబులు,
తాళి బొట్టును తాకట్టు పెడుతున్నాయి
ఏ ప్రభుత్వమొచ్చినా
ఏముంది గర్వకారణం?

నోట్లు, సారా ప్యాకెట్లు
సంపాదించే ఓట్లు
ఓట్ల బ్యాంకు కోసం
రిజర్వేషన్లు, కొత్త కొత్త ఫర్మానాలు,
గల్లీ నుండి
ఢిల్లీ వరకు రాజకీయ సంక్షోభం
కిస్సా కుర్సీకా
చూపిస్తున్న రాజకీయ తడాఖా
అధికారమంటే మజాకా?
గద్దె పదిలం కోసం
ఏ గడ్డి తినడానికైనా సిద్ధం

డబ్బు, హోదా
అంగబలం, అర్థ బలం,
అదే రాజకీయం
నిన్నూ, నన్నూ అతడు
వాడుకోవడమే తప్ప
ఆదుకోవడం తెలియని
నాటి నేటి చాణుక్య నీతి
చేతులు జోడించుకుని
ముంగిటకు వస్తాడు
అరచేతిలో వైకుంఠం చూపిస్తాడు
చిర్నవుతో బోల్తా కొట్టిస్తాడు
ఆ చిక్కని ఆ నవ్వే
నిన్నూ నన్ను ముంచుతుంది!!
నవ్వుతూనే వాడు మాత్రం పబ్బం
గడుపుతుంటాడు

# నిర్మాణం నేలతోనే....



నన్ను, నా జీవితాన్ని నాశనం చేసిన ఈ చదువు నాకొద్దు. ఈ కంప్యూటర్లు, ఈ సీడీలు, ఈ ఫ్లాపీలు, ఈ లాప్‌టాప్ నాకొద్దు.

నాకు కావలసినవన్నీ నేను కోల్పోయాక... నాకు ఏం మిగిల్చాయి ఇవి? డబ్బు...? డబ్బు?! నా ఒంటరితనానికి ఈ మానసిక అశాంతికి ఏం ఊరట ఇస్తుంది డబ్బు?!"

ఎ. రవీంద్రబాబు

రోజుకు పద్దెనిమిది గంటలూ... ఇరవై గంటలూ కంప్యూటర్ ముందు కూర్చుని నే చేసిన శ్రమంతా... ఏం మిగిల్చింది నాకు?! నాలో నేనే దహించుకుపోయే ఒంటరితనం తప్ప.

జీవితమంటే ఇంజనీర్ అవడం... స్టేట్స్ వెళ్ళడం లక్ష్యమైన నాకు... లక్ష్యాన్ని సాధించాక... కోల్పోయినదంతా పోగేసుకుంటే.. ఏం మిగిలింది?! శూన్యంలో నా కన్నీటిని తుడిచే ఒక్క ఓదార్పు లేదు.

ఇప్పటికే నా చుట్టూ వున్న జనం నన్ను పిచ్చివాడ్ని అంటున్నారు. "అమెరికాలో రెండేళ్ళు గ్రేట్ కంప్యూటర్ ఇంజనీర్‌గా పేరు తెచ్చుకొన్న రఘు ఇలా ప్రవర్తిస్తున్నాడేంటి...??? మనసు చలించి వుంటుందా...? అని సమాధానపరచుకుంటున్నారు అనినీ... అనినీ... కానీ ఆ రెండేళ్ళు నా పాలిట [illegible] అని ఈ పిచ్చి జనానికి చెప్పినా అర్థం కాదు... అర్థం చేసుకొనే స్థితీ వీళ్ళకి లేదు.

జాబ్‌కు సెలవు పెట్టి మరీ ఏ మహాభారతాన్నో, మహాప్రస్థానాన్నో చదువుకుంటుంటే... మన దేశ చరిత్ర రాయటంలో సంతోష వలస పాలకుల ప్రభావం ఎంతవరకు వుందని...? నా కంప్యూటర్ కొలీగ్స్‌తో చర్చిస్తుంటే... సుఖం అంటే ఏమిటి? సంతోషం అంటే ఏమిటి? కేవలం సుఖం వలనే సంతోషం వస్తుందా? ఇలాంటి వెర్రి అనుమానాలు వస్తున్న నన్ను చూసి జనం పిచ్చివాడి అనడంలో అర్థం వుంది.

కొడుకు కంప్యూటర్ కోర్సులు తప్ప వేరే చదవకూడదనీ..., కూతురుకు ఎన్.ఆర్.ఐ. సంబంధం తప్ప వేరే సంబంధాలు చూడకూడదనీ... భీష్మించుకూర్చున్న ఈ లుప్తజ్ఞానులకు ఏమని చెప్పాలి? జీవితాన్ని ధనంతోనూ... స్టేటస్‌తోనూ తూచే ఈ పా కల్చర్ వాళ్ళకు నేనేమని చెప్పగలను?!? నేను ఏం మాట్లాడినా పిచ్చి ముదిరింది అంటారు.

ఈరోజు నే చేస్తున్న ఈ పనితో నన్ను మెంటల్ హాస్పిటల్‌కు తరలించాలని అందరూ నిర్ణయించుకుంటారేమో.. అసలు నన్ను కాదు విద్యని వ్యాపారం చేసి... జ్ఞానాన్ని ఎగుమతి సరుకు చేస్తున్న ఈ వ్యవస్థని మెంటల్ హాస్పిటల్‌కు తరలించా

అందాన్ని ఆస్వాదించడం... ఒక్క మానసిక సంబంధానికై కరిగి కన్నీరయ్యే స్పందనను నేర్పక, మనిషిని యంత్రాన్ని చే నియంత్రించే ఈ విద్యా వ్యవస్థనే తరలించాలి పిచ్చాసుపత్రికి.

నాలో రగులుతున్న కసికి... నిస్సార్యమైన జీవితానికి కారణమైన ఈ కంప్యూటర్... సి-సి ప్లస్... ఒకటేమిటి ఈ పుస్తకాలను ఎన్ని వేలు పోసి కొన్నానో...!!!

అన్నిటిని వెతికి మరీ కుప్పగా పోస్తున్నారు. ఇంటి ముందు కుప్పను చూసి, గుమిగూడారు జనం. నా గురించి ఒక్కొక్కరు ఒక్కో రకమైన మాటలు మాట్లాడుతున్నారు.

"వీడేంటి...? ఇలా కుప్పగా పోస్తున్నాడు...? పిచ్చి ఎక్కువైందేమో...?!" ఒకరి మాట.

"ఎవరి కన్నా చెబ్దామంటే తల్లి కూడా మొన్ననే చచ్చిపోయే...." ఇంకొకరి మాట.

"పాపం... ఇంత చదువు చదివి చివరకు..." మరొకరి మాట.

అవును... నా తల్లి చనిపోయి మూడు రోజులైంది. నన్ను కని, పాలిచ్చి, పెంచి, గోరుముద్దలు తినిపించిన అమ్మ చనిపోయి మూడురోజులైంది. చిన్నప్పుడు పక్కలో పడుకోబెట్టుకొని రామాయణాన్ని, భారతాన్నే కాదు భట్టి విక్రమార్క కథల్ని, అపూర్వ చింతామణి, బొబ్బిలి యుద్ధం, మూడు కుక్కల మరాఠీ కథల్ని అలవోకగా చెప్పిన అమ్మ చచ్చిపోయి మూడు రోజులైంది.



సెలవలకు ఇంటికి వెళ్తే గడ్డ పెరుగుతో తప్ప అన్నం పెట్టని అమ్మ... అల్లూరు చెరువు బేడిసెలు నాకు ఇష్టమని చేపలు పట్టేవాళ్ళకు చెప్పి మరీ తెప్పించి, చింతాకు వేసి వండి పెట్టే అమ్మ... చనిపోయి మూడు రోజులైంది.

"ఒరే...! ఆ చదువులు మనకొద్దురా... ఉన్న ఒక్కగానొక్క కొడుకువీ ఈ ఏడెకరాలూ సాగు చేసుకొమ్మని "నాన్న బతిమాలి చెప్పినా వీను వినకపోతే..., నాకోసం, నాన్నతో గొడవ పెట్టుకొని, మూడు రోజులు అన్నం తినడం మాని, రెండెకరాలు అమ్మించి, నా చదువుకు డబ్బు ఇప్పించిన అమ్మ చచ్చిపోయి మూడు రోజులైంది.

నాన్నకు గుండె జబ్బు చేస్తే... డబ్బు పంపించగలను. కానీ నేను రాలేను. మంచి హాస్పిటల్లో చూపించండని ఫోన్ చేస్తే అక్షరం ఒక్క కూడా చదవడం తెలియని అమ్మ నాన్నని హాస్పిటల్లో పెట్టుకుని ఎంత కన్నీటిని దిగమింగిందో... కోడల్ని దగ్గర పెట్టుకొని... గుండె దిటవు చేసుకుని... భర్త ప్రాణాలకై ఎంతమంది డాక్టర్లకు మొక్కిందో...!?

తాళికట్టి జీవితాంతం తోడు ఉంటానని భరోసా ఇచ్చిన భర్త చనిపోతే... కడుపున పుట్టిన కొడుకు వుండీ... లేనట్లే అయితే... భర్త శవం ముందు నిబ్బరంగా కూర్చున్న అమ్మ... తనను తానే ఓదార్చుకున్న అమ్మ... చనిపోయి మూడురోజులైంది.

"హిందూ ధర్మ శాస్త్రాలు ఒప్పుకోవు... తండ్రికి కొడుకే కొరివి పెట్టాలని" ఎంతమంది చెప్పినా... "నా దేవుణ్ని ఆ దేవుడి దగ్గరకు నేనే పంపుతానని" భర్త శవానికి తానే నిప్పంటించిన అమ్మ.

"అత్తమ్మా...! నేను రవిని ప్రేమించాను. మేమిద్దరం పెళ్ళి చేసుకుంటాం" అంటే తన కోడలు పెళ్ళికి వెళ్ళి అక్షింతలు వేసి వచ్చిన అమ్మ. ఆ విషయం నాకు తెలిస్తే బాధపడి... ఎక్కడ అగ్రిమెంట్ పూర్తి కాకుండానే వచ్చేస్తానోనని గుండెల్లో మంటల్ని గొంతులోనే ఆపేసుకున్న ప్రతి అమ్మ... చనిపోయి మూడు రోజులైంది.

అమ్మ శవాన్ని దహనం చేసిన క్షణం నుండి ఆలోచించాను. అమ్మ చనిపోతూ చెప్పిన చివరి మాటల గురించి... కన్నీటిని కారుస్తూ ఆలోచించాను. గుండెను తడి చేస్తూ ఆలోచించాను. ఆలోచించి, ఆలోచించి ఆలోచనలు ఆవిరయ్యే వరకూ ఆలోచించాను. మూడు రోజులు మౌనాగ్నికి బలై చివరకు ఈ నిర్ణయం తీసుకున్నాను.

పుస్తకాల రాకుల్లోంచీ, టేబుల్ డెస్క్లో నుంచీ పుస్తకాలనూ, సి.డి.లనూ, ఫ్లాపీలనూ కుప్పగా పోస్తూనే ఉన్నాను.

పుస్తకాల మధ్య నుండి రెండు లెటర్లు కింద పడ్డాయి. నా గతాన్ని చీకటిలా గుర్తు చేస్తూ... నా భార్య నాకు రాసిన రెండే రెండు లెటర్లవి. నేను అమెరికాలో ఉన్నప్పుడు... నేనింకా ఈ జనాలనుకునే మంచివాడిగా ఉన్నప్పుడు... నేను అనుకునేవాడ్ని.

'నేను సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌ను కదా...! నా భార్య నాకు మెయిల్స్ ఇవ్వొచ్చు కదా...! ఎంజాయ్‌గా చాటింగ్ చెయ్యొచ్చు కదా...! తన ఫీలింగ్స్‌కు సంబంధించి ఏ గ్రీటింగ్ కార్డునో నాకు మెయిల్ చెయ్యొచ్చు కదా" అని. మొదటి లెటర్ చూసిన తర్వాత అదే మాట ఫోన్లో చెప్పాను.

"కొన్ని సున్నితమైన భావాలు.... ఆలోచనలు మన సొంత భాషలో చెప్పినంతగా అరువు భాషలో చెప్పలేం. నా అనుభూతుల్ని ఆత్మీయంగా నా వేళ్లతో నేను రాసి పంపినప్పుడే నాకు కలిగే తృప్తి హాయిగా వుంటుంది... నువ్వు దూరంగా ఉన్నా అవి హృదయానికి ఏదో తెలియని ఊరటనిస్తాయి.

ఇక గ్రీటింగ్ కార్డ్స్ అంటావా...?! నా ఊహలను ఎవరో తయారుచేసిన బొమ్మల్లో, అక్షరాల్లో చూసుకోవడం నాకు ఇష్టం వుండదు. షాపుల్లో గ్రీటింగ్ కార్డ్స్ కొని జనవరి ఫస్టుకు, అకేషన్స్‌కు పంపడాన్ని చూస్తుంటేనే మన అనుభూతుల్ని, ప్రేమల్ని, స్నేహాల్ని మార్కెట్లో సరుకుల్లా చూస్తున్నామన్న భావన కలుగుతుంది నాకు" అంది.

నా ఇష్టాల్ని గౌరవించడం కోసమేమో తర్వాత మెయిల్స్ చేసేది. తర్వాత తను వారం రోజుల్లో పెళ్ళి చేసుకోవడానికి ముందు రెండో లెటర్ రాసింది. మొదటి లెటర్ చదివినప్పుడే నేను మేల్కొని వుంటే నా జీవితం ఇంకోలా వుండేదేమో...!

నేను అమెరికా వెళ్ళడానికి ఏడు లక్షల కట్నాన్ని కానుకగా తెచ్చిన విజయ నాకు మిగిల్చిన జ్ఞానం లాంటి జ్ఞాపకాలు ఈ రెండు ఉత్తరాలు. తన తండ్రి ప్రావిడెంట్ ఫండ్‌ను నా భవిష్యత్‌కు కానుకగా ఇచ్చి నా నిస్సహాయతకు బలైన విజయ రాసిన రెండు ఉత్తరాలు.

మూడు రాత్రులు నాకు స్వర్గసుఖాలనందించి నే వెళ్లేటప్పుడు నాకు తోడుగా వచ్చి ఎయిర్‌పోర్టులో కన్నీటి పర్యంతమైన విజయ, నేను లేని ఒంటరి చీకటి రాత్రులను బలవంతంగా నా జ్ఞాపకాలతో గడిపి... మెయిల్స్‌లో నాతో నవ్వుల్ని పంచుకున్న విజయ... ఒకప్పుడు నా సర్వస్వమైన విజయ నుండి నేను కానుకగా మిగుల్చుకున్న ఈ రెండు ఉత్తరాలివి.

తనకు, మహేష్‌కు మధ్య ఏర్పడిన స్నేహం ఎలాంటిదో... మాటనూ... సంఘటననూ నాతో చెప్పిన విజయ

నిర్మొహమాటంగా..." నేను రవికి దూరంగా ఉండలేను. అతడ్ని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను" అని ఖచ్చితంగా చెప్పి... వివాహ వ్యవస్థను నిజాయితీగా ధిక్కరించిన విజయ. ఏ సంబంధమైనా మానసిక కలయిక మీదే ఆధారపడి వుంటుంది. శారీరక కలయిక మీద కాదు అని నిర్భయంగా నిరూపించిన విజయ రాసిన రెండే రెండు ఉత్తరాలు.

నా మెయిల్సన్నీ ఎటు పోయాయో... పాస్‌వర్డ్ కాదు... మెయిలైడీనే మర్చిపోయాను. ఈ మూడు రోజుల్లో... కానీ విజయ రాసిన రెండు ఉత్తరాలు ఇప్పటికీ నా చేతుల్లో గత జ్ఞాపకాలను ఆత్మీయంగా గుర్తు చేస్తున్నాయి, బాధిస్తున్నాయి.

ఉత్తరాల మడతలు విప్పితే గతం నా గుండెను కాల్చుతుందని తెలుసు. కానీ చదవాలనే తపన అంతకంటే ఎక్కువ కాల్చుతుంది. బాధలో కూడా ఏదో తెలియని సంతోషం ఉందని మొదటి ఉత్తరం విప్పాను. నాకూ ఇప్పటికీ తెలుసు. నేను విప్పుతుంది ఒకప్పుడు నన్ను వదిలి ఉండలేని ఒకప్పటి నా భార్య హృదయాన్నని...

ప్రియమైన భర్తకు,

కొన్ని భావాల్ని, బాధల్ని పూర్తిగా అక్షరాల్లోకి అనువదించలేము. అసలు మనిషి తన మనసును విప్పి వేరే మనిషికి చూపిస్తే తట్టుకునే శక్తి ఎవరికి ఉండదనుకొంటాను. నీవు చదివే ఈ అక్షరాలు కేవలం నా హృదయంలోని భావాల్ని సగం మాత్రమే అర్థం చేసుకోవడానికి నీకు ఉపకరిస్తాయి.



నేను ఎయిర్‌పోర్ట్ నుండి వచ్చిన క్షణం నుండి నీవు లేవనే దిగులు నన్ను ఆవరించింది. రోజు రోజుకు అది నన్ను తీవ్రంగా బాధిస్తుంది. భార్యాభర్తల మధ్య దూరం ఇంత ఇబ్బందికరంగా ఉంటుందా...? అని అనిపిస్తుంది. అత్తమ్మ ఎంత ప్రేమగా చూసినా, మామయ్య ఎంత అభిమానంగా పిలిచినా నీవు లేని లోటు తీరేది కాదు.

మొన్న మంగళవారం రోజు అన్నం తింటున్నాను. మధ్యలో నీవు గుర్తు వచ్చి, గదిలోకి వెళ్లి కన్నీళ్లు పెట్టుకొంటుంటే అత్తమ్మ వచ్చి ఓదార్చి ముద్దలు కలిపి పెట్టింది. నువ్వు అన్నం తినిపించేదం గుర్తుకు వచ్చింది. ఆ రోజు రాత్రంతా నిద్రలేదు. ఆ రోజే కాదు. ఇంతవరకూ నీవు వెళ్ళింది మొదదలు ఏ రోజూ నేను పూర్తిగా నిద్ర పోలేదు.

నిద్రపోదామని పడుకోగానే గుర్తుకు వస్తావు. నీ చేష్టలూ గుర్తుకు వస్తాయి. ఇంక నిద్ర ఎలా పోగలను చెప్పు? విరహం అంటే ఏమిటో నాకు తెలిసి వచ్చింది. అనుభవించడం ఎంత నరకంగా ఉంటుందో కూడా తెలిసింది.

నీవు వెళ్లిన మూడో రోజు అనుకుంటాను. మొదటిసారిగా నువ్వు కొనిచ్చిన చీరను ఉతుకుతూ... నాకు తెలియకుండానే ముఖానికి హత్తుకున్నాను. సబ్బుతో ఉంది కదా కళ్లు బాగా మండాయి. కళ్ళ ఎర్రుపు చూసి అత్తమ్మ అడిగితే ఏం చెప్పాలో అర్థం కాలేదు.

ఏమండీ...! మీకు దూరంగా ఉండటం నా వల్ల కావడం లేదు. డబ్బులు పోతే పోయాయి. అగ్రిమెంట్ వదలి వచ్చే అవకాశం వుంటే తప్పక వచ్చేయండి. ఇక్కడ జాబ్ చూసుకోవచ్చు.

ఉంటాను
మీ భార్య

ఎంటెక్ అయిన తర్వాత స్టేట్స్ వెళ్ళాలనే నా కోర్కె తీర్చడానికి మూడున్నర లక్షలు కడితే అవకాశం ఇస్తామన్నారు ఓ కంపెనీ వాళ్ళు. చదువుకే పొలం అమ్మిన నాన్నను ఇబ్బంది పెట్టడం ఇష్టంలేక పెళ్ళి చేసుకుని... కట్నంతో నా కోర్కె తీర్చుకోవాలనుకున్నాను. రెండు సంవత్సరాల అగ్రిమెంట్ పూర్తికాగానే ఇండియాలో వాళ్ళ బ్రాంచ్ వున్న ఏదో ఒక మెయిన్ సిటీలో ఉద్యోగం ఇస్తామన్నారు. నెలకు ముప్పైవేల వరకూ జీతం. ఈ విషయాన్ని అడ్డుపెట్టుకొనే పెళ్ళి చేసుకున్నాను.

కట్నం అందగానే పాస్ట్‌పోర్ట్, వీసా త్వరత్వరగా రెడీ అయిపోయాయి. పెళ్ళి అయిన నెలకే నేను అమెరికా వెళ్ళాను. రెండు సంవత్సరాలు పూర్తి కాగానే ఇండియా వచ్చి ముంబయ్ లాంటి మహానగరంలో జీవితాన్ని ఎంజాయ్ చేద్దామనుకున్నాను. కానీ ఆ రెండు సంవత్సరాలే నా జీవితాన్ని తిరగరాశాయి.

ఆలోచనలు ఆపి, కన్నీటిని బలవంతంగా ఆపుకుంటూ రెండో లెటర్ చదవడం ప్రారంభించాను.

ప్రియమైన భర్తకు...

ఇకనుండి మిమ్మల్ని భర్త అ సంబోధించను. నేను రవిని పెళ్ళి చేసుకోవాల నిర్ణయించుకున్నాను. ఈ విషయం మీకు న మాటల ద్వారా అర్థమై వుంటుందను కుంటాన చివరిగా మీకు లెటర్ రాయాలనిపించింది.

మీరు రవి కంటే ముందు న శరీరానికి దగ్గరై ఉండవచ్చు. కానీ రవి న మనసుకు దగ్గరయ్యాడు. అతనితో నా జీవిత సంతోషంగా వుంటుందని నేను నమ్ముతున్నాను. అందుకే ఈ నిర్ణయ తీసుకున్నాను.

మీరు స్టేట్స్ నుండి వచ్చాక నా రెండో పెళ్లి గురించి కేసు కోర్టులు వంటి వాటికి వెళ్లొద్దు. ఒకవేళ వెళ్ళాలనిపిస్తే ఒక్క విషయ ఆలోచించు. తాళి కట్టి కేవలం నెల రోజులు కూడా నాతో పూర్తి గడపకుండా వెళ్ళిపోయావు. నీ జీవితాన్ని నీవు చూసుకొన్నావు. ఒంటరితనాన్ని రవి పూర్తి చేశాడు. రవి పరిచయం అయ్యాక వచ్చిన తర్వాత నీతో సంతోషంగా జీవిస్తానన్న నమ్మకం నాకు లే

అత్తమ్మకు ఈ విషయం తెలుసు. పెళ్ళికి కూడా వస్తాన ఇక మా అమ్మా, నాన్నల గురించి నేను అంతగా పట్టి కోదలచుకోలేదు. స్త్రీకి ఏం కావాలో అర్థం చేసుకున్న వాళ్ళయితే న నిన్ను పెళ్ళి చేసుకోమని బలవంతం చేసే వాళ్ళే కాదు.

మీ నాన్న చావు బతుకుల్లో వున్నా... అత్తమ్మ బా సతమతమవుతున్నా... నీవు వస్తావేమోనని ఎదురుచూశాను. కా నువ్వు...!?! ఒక్క మాట చెప్తాను. మనిషి జీవితానికి ముఖ్యమై డబ్బు, స్టేటస్, చదువు కాదు. కనీస అవసరాలతో పాటు... ప్రేమ ఆప్యాయతలు... మిగిలినవన్నీ తర్వాతే... కానీ వాటిని నీవు నీకు ద వాళ్ళ నుండీ దూరం చేసుకున్నావు.

నీ భవిష్యత్ నీవు ఆశించినట్లే ఉండాలని నేను కోరుకు

వి

నా కళ్ళ నుండి బాధంతా కన్నీటి బొట్లుగా రాలుతుంది. ఎం.ఎ. హిస్టరీ చదివిన నా భార్య ఆలోచనలు ఏమాత్రం తప్పు కాదన్న వాస్తవం నుండి రాలుతున్న కన్నీటి బొట్లవి.

కన్నీటిని తుడుచుకుంటూ... లెటర్లను నా పర్సనల్ ఫైల్లో పెట్టాను. బయటకొచ్చి చూశాను. నేను పారేసిన పుస్తకాలు, వస్తువులు కుప్పగా పెరిగి నన్ను వెక్కిరిస్తున్నట్లు అనిపించింది నాకు. జేబులో నుండి అగ్గిపెట్టె తీసి నిప్పంటించాను.

తగలబడి పోతున్నాయి. నా గతం వ్యాపకాలన్నీ తగలబడి పోతున్నాయి. ఆ మంటల్ని చూస్తుంటే అమ్మ శవాన్ని కాల్చినప్పుడు వచ్చిన మంటలు గుర్తుకు వస్తున్నాయి. ఆమె తన జీవితంలో నా వలన ఎన్ని మంటలు భరించిందో గుర్తుకు వస్తున్నాయి. నా భార్య విజయ నా వలన ఎంత బాధను గుండెల్లో భరించిందో... ఆమె హృదయం ఎంతగా కాలిపోయిందో గుర్తుకు వస్తున్నాయి.

అమ్మ చనిపోయే ముందు, నన్ను దగ్గరకు పిలిచింది. వెళ్ళాను. ఆప్యాయంగా నెత్తి మీద నిమురుతూ...

'రఘూ మట్టినీ, మనుష్యుల్ని ప్రేమించడం నేర్చుకో... ప్రేమించడం తెలుసుకున్నాక నువ్వెప్పుడూ ఒంటరివాడివి కావు" అంది.

ఆ మాటలే ఈ మూడు రోజులూ నాలో మంటలుగా మండి నన్ను ప్రక్షాళనం చేశాయి. ఇంట్లో మిగిలిన వస్తువులూ, అమెరికా నుండి వచ్చాక ఈ రెండు సంవత్సరాలు నన్ను నేను నిర్మించుకోవడానికి చదివిన పుస్తకాలూ... బట్టలూ... అన్నీ సర్దుకున్నాను.

ఆటోలో లగేజీ పెట్టుకొని, పాత జీవితానికి ముగింపుగా కొత్త జీవితానికి ప్రారంభంగా... నా చదువుకు అమ్మగా మిగిలిన ఐదెకరాల పొలం నా కోసం ఎదురుచూస్తూ ఉందనీ, ఈ యాంత్రిక మహానగరాన్ని వదిలి... నా వూరి నేల తల్లిని ముద్దాడాలని బయలుదేరాను. అమ్మ ఒడి తీయదనం కోసం...

# ప్రగతికా... పతనానికా...?

**తాతోలు దుర్గాచారి**

తరాల తరబడి పరదాస్యంలో మగ్గి
పరపీడనా సంకెళ్ళ విముక్తికై
అహర్నిశలు శ్రమించి,
జాతి స్వతంత్ర జీవనోజ్వల భవితకై
ఎన్నో ఆశయాలతో, ఎందరో మహనీయులు
ఎంతో దీక్షతో త్యాగించి, పోరుసల్పి
పరపాలకులను పారద్రోలి
స్వపరిపాలన సాధించి
భరతజాతి బంధాలను తెంచారు
భావితరానికి బంగారు భవితనందించాగు
ఇంతటి స్వేచ్ఛాఫలం...
సమాజ మనుగడకే ప్రశ్నార్థకమైంది
సంస్కర్తలుద్ధరించిన జాతిని
విద్రోహులు క్షణాల్లో విధ్వంసం చేస్తున్నారు
కంచే చేను మేసినట్లుగా
పాలకులు సైతం దేశాన్ని పరాధీనం చేస్తున్నారు
ప్రపంచీకరణ పేరుతో
పరాయి సంస్కృతికి దోసిళ్ళొగ్గుతున్నారు
సహజీవన స్థితి మార్చి -
సామాన్యుడి గతి ఏమార్చుతున్నారు
జాతి మనుగడకు మార్పు ఇదేనా...?
ఇదేనా మన గమనం? ఇదేనా మన లక్ష్యం...?
గమ్యం లేని మన పయనం ఏ వైపు?
ప్రగతికా... పతనానికా...?

# మనంగా మనడానికి

**పోతగాని సత్యనారాయణ**

మనం మనంగా మనడానికి
అంతరిక్షమంత జ్ఞానమవసరం లేదు
మూలాలను గుర్తు చేసే జ్ఞాపకాలనూ మరవనక్కరలేదు!
ఆలోచనతో కూడిన అడుగే పరిష్కారానికి దిక్సూచి
వాడి దృశ్యా దశ్య ఆదేశాల పరంపరతో
కాళ్ళను కాళరాత్రి కాల్ సెంటర్లలో బంధించి
కళ్ళను కంప్యూటర్ తెరకు బిగించి
మెదడుతో సహా అంగాంగాలను ఛిద్రించి
శ్రమశక్తిని కారుచౌకగా దోచుకుంటూ
డాలర్లు పండించుకుంటున్న
ఆ సామ్రాజ్యవాది చేతి వేళ్ళ కింద అణచబడి
మానసిక దాస్యపు ఊబిలోనికి కూరుకుపోతున్న కీబోర్డు మీటపై
స్వాభిమానాన్ని అతని పాదాల ముందు
తివాచీలా పరుస్తావెందుకు?!
నువ్వు ఐ టి. కంటితో చూసింది మొదలు
భాష, భావం, సంస్కృతి, సంప్రదాయమే కాదు -
అర్ధరాత్రి అత్యాచారాల సుడిగుండంలో చిక్కి
నీకు నీవే దూరమవుతున్న హెచ్చరిక!
ఖరీదైన గోడల మధ్య
నీ మెడకు ఎగ్జిక్యూటివ్ బిరుదును వ్రేలాడగట్టి
నీవూ ఒక కాంట్రాక్ట్ కార్మికురాలవేనన్న
నిజాన్ని సైతం నమ్మలేని అహాన్ని నూరిపోస్తున్నాడు -
వాడి ప్రపంచీకరణ సాలెగూటి నుండి
నిన్ను నీవు దక్కించుకునే క్రమంలో
నీ అస్తిత్వపు ఆత్మగౌరవాన్ని బలిపెట్టకు!
ఆ పెదాల పైన మెరిసే
మధ్యతరగతి మందహాసాన్ని మభ్యపెట్టకు!

# సమీక్షా పర్వం

* తెలంగాణా మట్టి పరిమళం "మంకమ్మ తోట"
* జాతి జీవనయానం 'జానపదం'
* హైకూ ధాన్యంలోకి పయనం "నక్త ప్రణయ యాత్ర"
* 'పొగచూరిన ఆకాశా'న్ని కవిత్వంతో కడిగే ప్రయత్నం
* ఇగిరిపోతున్న మానవ సంబంధాలను వివిధ కోణాల్లో చర్చకు పెట్టిన కథలు
* సమకాలిక వ్యవస్థ, నాయకుల మీద సంధించిన శరాఘాతం
* 'గరుడ స్తంభం' వెలుగులో నిరుపేదల బతుకులు
* కథా కథనంగా 'గల్లీ'

**జీవన్**



## తెలంగాణా మట్టి పరిమళం అన్నవరం దేవేందర్ కవిత్వం

గతంలో 'తొవ్వ', 'నడక' అనే రెండు కవితా సంకలనాలు ప్రచురించిన అన్నవరం దేవేందర్ తన మూడో సంకలనం 'మంకమ్మ తోట లేబర్ అడ్డా'తో ముందుకొచ్చాడు. 'ఎల్లలు ఎన్ని దాటినా నా మట్టి వాసనే నాకు పులకరింత' అంటూ ఆ మట్టి వాసనల్నే తన కవిత్వం నిండా పులుముకున్నాడు. జీవనదులెన్ని తెలంగాణాలో ప్రవహిస్తున్నా కరువు వికటాట్టహాసం చేస్తున్నది. దీనికి కారణం ఒక్క ప్రకృతి మాత్రమే కాదు. నిజాం సర్కారు నిరాదరణకు గురైన తెలంగాణా గత ఐదారు దశాబ్దాలుగా కాంగ్రెస్, తెలుగుదేశం ప్రభుత్వాల హయాంలలోను తీవ్ర నిర్లక్ష్యానికి గురైంది. తెలంగాణాకు జరిగిన అన్యాయం యీనాటిది కాదు. భాషా సంస్కృతుల విషయంలోనూ వివక్షకు గురైంది. సొబగులీనే తెలంగాణా యాస అపహాస్యానికి గురైంది.

ఏ పదబంధ ప్రబంధంలోనూ
నా యాస లేదు బాసలేదు
వాక్యం నా పలుకు వల్లించదు
అక్షరాల్లో నా నుడికారపు శబ్దం లేదు
అంతేనా!

'తెలంగాణా సంస్కృతి తెర్లయింది' అని కవి వాపోతాడు. 'ఇక నుంచి నేను / కొత్త వ్యాకరణంతో వాక్యం రాసి / కొత్త గుణకారంతో లెక్కలు తీస్తా' నని ప్రకటిస్తాడు.

జీవనదులు ప్రవహించే చోట నీటికి కటకట. ఇది విచిత్రాల్లో కెల్లా విచిత్రం.

భుజం కాయ కాసుడు
జాకెట్ మీద శిల్లులు
ఒంటి వూపిరి పాణం
కింద మీద చెయ్యరాదు
నీళ్ళుంటే సావత్తంది
నీళ్ళుంటే కండ్లల్ల నీళ్ళే

విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల మార్కెట్లోకి బహుళ జాతి సంస్థలు ప్రవేశించడంతో వ్యవసాయం సంక్షోభంలో పడింది.

'ఎవుసాన్ని రోగం చేసిందెవుడు
ఎవుసాన్ని నక్కి దువ్వ చేసిందెవ్వలు' అంటూ ప్రశ్నిస్తాడు.
'అంతా పురుగు... రోగం
ఇత్తునాల నుండి మందుల దాకా
మోసం... మోసం... పచ్చి మోసం'

ఫలితంగా పీకల్లోతు అప్పుల్లోకి కూరుకుపోయాడు రైతు.

నారు మల్లల్లో పత్తి చేనుల్లో
ఏచ్చుకుంటున్న అప్పుల విషయాలు'

సమస్యను చెప్పడం మాత్రమే కాదు సమస్య లోతుల్లోకి పరిష్కారాన్ని కూడా సూచిస్తున్నాడు కవి :

దేశ దేశాల్లో దేశాన్ని తాకట్టు పెట్టిన వాల్లు
నేల నేలనంతా అప్పుల మయం చేసిన వాళ్లు
అప్పుల ఊబిలో దిగిన ఓ రైతన్నా
వేలాడుతున్న వురితాడును
కొడవలితో కొయ్యి

వ్యవసాయం సంక్షోభానికి గురవడంతో వేరే మార్గం లేని వ్యవసాయ కూలీలు, చిన్న రైతులు, వలసపోతున్నారు. పట్టణాల్లో సరకుగా మారుతున్నారు.

పల్లె పొలిమేరలు దాటి
అడ్డా మీద సరుకుగా మారిన సందర్భం
అంగడితో గొడ్డు గోదా అమ్ముడుపోయినట్లు...
నిలువెత్తు మనిషి
తనకు తానే అమ్ముకుంటున్న దృశ్యం
- - - - - - - - - - - - - - - -
చినుకులు కురవని పల్లెలు, ఎల్లగొడితే
అడ్డమీద కూలిలైరి

చేతివృత్తులు చిన్నాభిన్నమయ్యాయి. నేత పనివాళ్ళ దుస్థితిని వర్ణిస్తూ

- 'సంసారం తెగిన పోగు - ఎంత అతికినా గతికి రాదు'

అంటాడు.

నెత్తురోడుతున్న తెలంగాణా పల్లెల అశాంతిని యిలా చిత్రించాడు :

ఊరు ఇప్పుడు రక్తం మడుగు
ఊరు ఇప్పుడు కన్నీళ్ళ కొలను.
ఊరు యిప్పుడు ఉరికంబపు తాడు

దానికి కారణమైన రాజ్యహింస స్వభావాన్ని విశ్లేషిస్తూ -

'రాజ్యమంటే రాజ్యమే మరి
బలగాలు అవే బందూకులూ అవే

మారింది రాజుగాని రాజ్య స్వభావం కాదు' అంటాడు.

నేటి తెలుగు కవిత్వంలో ప్రపంచీకరణ దుష్ప్రభావాల వ్యతిరేకత ప్రస్ఫుటంగా కనిపిస్తున్నది. అన్నవరం దేవేందర్ కవిత్వం అందుకు మినహాయింపు కాదు.

ప్రపంచీకరణ పడగ నించి
రైతు కూలీల బతుకులో
విషం చిమ్ముతంది

ఈ కార్చిచ్చు వర్ధమాన దేశాలను దహించి వేస్తున్నది - దానికి కవి స్పందన యిలా వుంది :

ప్రపంచ వాణిజ్యం ప్రచండమై
గ్రామ వికాసాన్ని ఆర్పేసింది
భౌగోళీకరణ అగ్ని
దేశ దేశాలకు అంటుకుంటున్న నిప్పు

ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ మేలి ముసుగులో సామ్రాజ్యవాదం అన్ని దేశాల మార్కెట్లను కొల్లగొడుతున్నది. ఆయా దేశాల భాషా సంస్కృతులను ధ్వంసం చేస్తున్నది. సామ్రాజ్యవాద ధానాల్ని తూర్పారపడుతూ -

సామ్రాజ్యవాదం మన దర్వాజ ముందు
ప్రపంచీకరణ మొకం పెట్టుకొని ఇకిలించిన్నాదే
దేశీయత గుండె కలుక్కుమన్నది
బహుళ జాతులు భారతీయతపై కన్నేసి
సరళీకరణ కనుసైగ చేసిన్నాదే
దేశీయత దేహం నీరసం చెందింది
- - - - - -
తెల్లవాన్ని తరిమి కొట్టినా
గ్లోబలైజేషన్ చక్కెర పూతతో
ఇది తెల్లపాలనే.

జూకంటి జగన్నాథం అన్నట్టు అన్నవరం దేవేందర్ ఒకానొక తెలుగు ప్రాతినిధ్య కవి. ఆయన కవిత్వంలో లోతు, గాఢత, విస్తృతి వుంది. సమకాలీన సమస్యల యెడల సరైన దృక్పథం వుంది. కవిత్వానికి సామాజిక ప్రయోజనం వుండాలని కోరుకునే వాళ్ళందరూ తప్పక చదవవలసిన కవితా సంకలనమిది. అన్నవరం శ్రీనివాస్ వేసిన బొమ్మలు భావస్ఫోరకంగా వున్నాయి.

**(మంకమ్మ తోట లేబర్ అడ్డా (కవితా సంకలనం))**
**కవి : అన్నవరం దేవేందర్, పేజీలు : 127, వెల : రూ. 75/-, నూతన సాహితీ ప్రచురణ, కాపీలు దొరుకు చోటు : 9-5-148, సప్తగిరి కాలనీ, కరీంనగర్-505001)**

---

**శైలి**



## జాతి జీవనయానం జానపదం

ఏ రంగంలో పనిచేసే కార్యకర్తకైనా వస్తుగత దృష్టి చాలా వసరం. సాహితీ సాంస్కృతిక రంగాల్లో పనిచేసేవారికి మరీ వసరం. జీవితపు లోతులు తెలియాలంటే ఇతరుల పట్ల సానుభూతి ృష్టి ఒక్కటే సరిపోదు. అనుభూతి దృష్టి కూడా ఉండాలి. గుడ్డివారిని ాసి అయ్యో పాపం! అనుకుంటే సరిపోదు. తానే నిజంగా గుడ్డివాణ్ణి యితే లోకం ఎంత చీకటైపోతుందో... అనుభవించి తెలుసుకుంటే దీ అనుభూతి దృష్టి. అయితే ఇది అంత తేలిగ్గా ఒంటపట్టదు. ఒక ్టాన అబ్బదు. ఇందుకు మనసులో ఎవరికి వారే అంతఃసేద్యం ుకోవాలి. అందుకు నాందిగా అలాంటి అభాగ్యుల పట్ల సానుకూల కృథం ఉంటేనే ఆ సేద్యం సుసాధ్యం అవుతుంది. కృషి ఫలిస్తుంది.

బద్రి కూర్మారావు ఈ మార్గంలో 'ఉత్తరాంధ్ర జానపద లు' పై తన దృష్టిని సారించి గ్రంథం ద్వారా ఆ కళలను పదుగురికి ంచడం అభినందనీయం.

జాతి వైతాళికులుగా శ్రీశ్రీ అభివర్ణించిన జానపద కళలే నాధారంగా బ్రతికేవారు నేటికీ అనేకమంది ఉన్నాడు. కళల పట్ల ందన, నిజాయితీ, ప్రేమ ఉన్నవాడు మాత్రమే ఆ కళలను ాకారులను గుర్తించగలరు. గౌరవించగలరు. లేనిపక్షంలో ప్రపంచీకరణ మాటున అమానవీయ సంస్కరణలు రాజ్యమేలుతున్న ఈ నేపథ్యంలో కనీసం ఆ కళాకారులను మనుషులుగానైనా గుర్తించడం దుస్సాధ్యం.

సత్యహరిశ్చంద్ర నాటకం చూసిన బాపూజీ మహాత్ముడుగా మారాడని మనం విన్నాం. కళలు ప్రజల జీవితాలను ప్రభావితం చేస్తాయని చెప్పడానికి ఇదో తార్కాణం.

అలాగే ఒరిస్సా సరిహద్దు రాష్ట్రం జంగాలపాడు గ్రామ కళాకరుడు 'టంపా రాములు' ఆట పాట ద్వారానే రామయణ మహాభారత కథలు. పాత్రలు, స్వభావాలు తెలుసుకోవడమే కాదు. ఆ కళాకారుని స్ఫూర్తితో లక్ష్య నిర్దేశాన్ని ఏర్పరచుకున్నాడు కూర్మారావు. 'నా మొత్తం జానపద రచనలకు ప్రేరణ ఈ టంపారములే'నని వినమ్రంగా చెప్పుకున్నాడు. తదనుగుణంగా జానపద కళల పరిరక్షణార్థం. 'గిడుగు రామమూర్తి తెలుగు భాష మరియు జానపద కళాపీఠం స్థాపించి' శక్తి మేరకు కళలకు, కళాకారులకు సేవలందించడం ముదావహం. ఆ పీఠమే ఈ గ్రంథం ప్రచురించింది.

ఔనన్నా, కాదన్నా నేటి సమాజంలో ఈ సాంస్కృతిక వృత్తులవారు లేదా జానపద వృత్తి కళాకారులు దాదాపు 10 శాతం మంది నేటికీ ఉన్నారు. యుగయుగాలుగా తమదైన శైలీ నైపుణ్యంతో సాంస్కృతిక కళా ఉత్పత్తులు సృష్టిస్తూ, ప్రదర్శిస్తూ ప్రజలను రంజింప చేస్తున్నారు. చాలామంది నిరక్షరాస్యులైనప్పటికీ తమ జీవితానుభవాన్ని, లోకానుభవాన్ని రంగ రించి హితైక విషయాలు చెబుతూ ప్రజలను అలరిస్తున్నారు. జాతి జనజీవన యానంలో, వికాసంలో వీరు అంతర్భాగం. వీరి కళలు జాతి మహా సంపద, ఈ సత్యాన్ని కాదనలేం.

ప్రపంచీకరణ ఘాతుకానికి ప్రాణంలాంటి వ్యవసాయం, చేతివృత్తులతో పాటు, ఈ జానపద సంపదంతా శీఘ్రగతిన ధ్వంసం అవుతున్నది. సునామి దెబ్బకు తీర ప్రాంత ప్రజల మాదిరి ఈ జానపద కళాకారులు గట్టునపడ్డ చేపల్లా విలవిలా కొట్టుకుంటున్నారు. చుట్టూ వున్న చీకటిని చూసి ఏడ్చేకంటే చేతనైతే చిన్న చిరుదీపం పెట్టు అన్న

లోకోక్తిననుసరించి బద్రి ఈ కృషి సాగించాడు.

జానపద కళాకారులను మూడు రకాలుగా వర్గీకరించాడు.

- భిక్షాటన వృత్తిగా గల ఎరుకుల, గంగిరెద్దుల, బేడజంగాలు, దాసర్లు మొ॥
- ఆశ్రితజాతిగా ఉన్న భట్రాజులు, పొడపోతలు, రుంజ మొ॥
- కొత్తగా వచ్చిన నవీనరూపాలు, బుర్రకథ, పగటి వేషాలు మొ॥

ఇవేకాకుండా ఇంకా ఎటువంటి జానపద కళలైనా ఆ కళలను, సంస్కృతిని కాపాడుకోవాలనే సంకల్పాన్ని వెలిబుచ్చాడు.

సమాజం ఉన్నంతకాలం జానపద కళలు ఉంటాయి. వీటిని సమూలంగా అంతరింపచేయడం ఎవ్వరి తరం కాదు. కొన్ని కాలానుగుణంగా పుడుతూ వుంటాయి. కొన్ని పునరుద్ధరింపబడు తుంటాయి. ఆ విశ్వాసాన్ని ఈ పుస్తకం కల్పిస్తుంది. హరికథ ఆవిర్భవించిన తీరు, కవాళీ ప్రవేశించిన విధం, ఆధునిక వీధి నాటిక ప్రక్రియ మొదలగునవన్ని ఈ పుస్తకంలో చోటు చేసుకున్నాయి.

తోలు బొమ్మలాట, జముకుల పాట, తప్పెటగుళ్ళు, దాసరి పాటలు, జంగాల కథలు, బుర్ర కథలు, ఒగ్గు కథలు, భజనలు, కోలాటాలు, చెంచుపాట, యక్షగానం, చిందు భాగోతం, డప్పు నృత్యం, గిరిజన నృత్యాలు మొదలైనవి 100కు పైగా జానపద కళారూపాలు ఉన్నట్టు తెలుపుతూ వాటిలో 70 రూపాలను రేఖామాత్రంగా వివరించాడు.

ఈ గ్రంథంలో పేర్కొన్న అనేక కళారూపాలు ఉత్తరాంధ్రకే పరిమితం కాలేదు. యావదాంధ్ర దేశంలో ఉన్నాయనే విషయం అవగతమవుతుంది.

జానపద గీతికల్లోని కులాంతర ప్రేమ వంటి అంశాలను కూడా చూడవచ్చు.

నాయుడు : రెల్లిదిరెల్లిది రెల్లిదోలి చిన్నది /
రెల్లి : మీరు చూస్తే పెద్ద కులం, మేం చూస్తే చిన్న కులం...

ఈ పాట బాణి 'జయం' చిత్రంలో 'రాను రానంటూనే చిన్నది' పాట ద్వారా వింటాము.

అలాగే బొడ్డపాడు గ్రామానికి పూజారిగా వచ్చిన సుబ్బారావు పాణిగ్రాహి జముకును ఆలంబనగా చేసుకుని విప్లవ గీతాలతో తెలుగు తేజాన్ని ధ్వనించి ఆబాల గోపాలాన్ని ఉర్రూతలూగించిన విషయాన్ని స్ఫురణకు తెస్తాడు. కళ జన్మతః లభిస్తుందనుకునే రచయిత భావనకు ఈ వాస్తవం విరుద్ధం. అక్కడక్కడ పునరుక్తి దోషాలు ఉన్నాయి.

జానపద కళలు, పలు గీతాలు, కొందరి జీవన చిత్రాలు, ప్రముఖుల సూక్తులు, స్వీయ భావనలు, పరిష్కారాలు పుస్తకంలో పొందుపరిచారు. కళల పట్ల ఆపేక్ష ఉన్నవారే గాక సాంస్కృతిక రంగంలో పనిచేస్తున్న, పని చేయాలనుకున్న ప్రతి కార్యకర్త చదవాల్సిన పుస్తకం. వారికి మరింత ఆసక్తిని, ప్రేరణను కలిగిస్తుంది.

**('ఉత్తరాంధ్ర జానపద కళలు, వెల : రూ. 100/-లు. పేజీలు : 290, ప్రతులకు : భద్రి లక్ష్మీ ఫణిశ్రీ, కేరాఫ్ బద్రి కూర్మారావు పిజి.టి. (ఎస్.ఎస్), ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాల, కొప్పెర్ల (పోస్టు), పూసపాటి రేగ (ఎస్.ఒ), విజయనగరంజిల్లా - 535 204)**

---

**మొహీబుల్లాఖాన్**




# హైకూ ధాన్యంలోకి పయనం "నత్త ప్రణయ యాత్ర"

ఇస్మాయిల్ ప్రతి హైకూలో ఒక చక్కని దృశ్యం, ఒక మధుర అనుభూతి, ఒక రమ్యమైన భావం, ఒక దర్శనీయమైన పద చిత్రం, ఒక ఎత్తి పొడుపు, ఒక హెచ్చరిక, ఒక ధ్వని, ఒక విషాదం - ఏదో ఒకటి లేకుండా ఉండదు.

ఈయన విలక్షణ వీక్షణా సంపన్నుడు. వీరి భాష సహజంగా, సజీవంగా ఉంటుంది. వీరి హైకూల్లో భావం గూఢంగా, గాఢంగా ఉంటుంది. తన కవితాక్షర దేహంతో మన ముందు సదా నిలిచే మౌనీ, జ్ఞానీ, వేదాంతి.

"చెట్టున వేలాడుతోంది దారం / ఒక కొసన గాలి పటం / రెండో కొసన పిల్లలేరీ?" పై హైకూలో చలనశీలత్వం గురించి చెప్పారు. పిల్లల కేరింతలతో గాలిపటం ఉవ్వెత్తున లేస్తుంది. పిల్లలే లేకుంటే అది నిరర్థకం కదా!

"తెల్లారింది / పిట్ట పాడింది / ఇంకేం కావాలి!" దీనిలో ప్రకృతి పట్ల ప్రేమ, సింప్లిసిటీ ద్యోతమవుతున్నాయి. భౌతిక విలువలు పెరిగిపోయిన ఈ తరుణంలో ప్రకృతిని ఆస్వాదించమని బోధించే ఇలాంటి హైకూలు అనుసరణీయాలు.

"ప్రతి ఉదయం / ఒక కొత్త కవిత / ఈ కావ్యం అనంతం...". ఈ హైకూ మనలో అంతులేని ఆశావాదాన్ని పెంపొందిస్తుంది.

తుపాను హడావిడిలో / పాప ఒక్కర్తే అడిగింది చంద్రుడేమయ్యాడని" పిల్లలు ప్రకృతికి దగ్గరగా ఉంటారన్న విషయం ద్యోతకమవుతుందిక్కడ. అందరూ రొటీన్‌లో, హడావిడిలో ఉంటే పాప తను గాఢంగా ప్రేమించే చంద్రుణ్ణి ఆరా తీస్తుంది. depth of love knows no bounds అన్న విషయం కనబడుతుందిక్కడ.

"హోరున వర్షం / దండెం మీద కాకి / గదిలో నేను" ఒంటరవ్వడం ఎంత బాధాకరమో! వర్షం చేత గదిలో తమూ, దండెం మీద కాకీ బంధింపబడ్డారట.

"ఈమెను ప్రేమిస్తున్నానని / అడుగడుక్కీ రుజువు చెయ్యాలి / బతుకంతా పరీక్షే!" ఈ bondedness మనం ప్రతీ చోట గమనిస్తాం - ఇంట్లో, చుట్టుప్రక్కలా, పని చేసే చోటా, భార్యక్కానివ్వండి, బాసుక్కానివ్వండీ, లవర్‌కి కానివ్వండీ ఈ పరీక్షల్లో పాసు మార్కుల కోసం చాలా అవస్థలు పడతాం మనం.

"వీళ్ళకి చాతవక్కానీ / నీలాకాశాన్ని కత్తిరించి / సంచీల్లో కుట్టి అమ్మేస్తారు". మెటీరియలిజం ఎంతలా పాతుకుపోయిందో తెలుస్తుందిక్కడ.

"లోతుగా ఆలోచించి / లోతందక / చివరికి మరణించాడు" Road not taken లో పయనించమని లీలగా స్ఫురింపచేస్తాడు కవి. రొటీన్‌కు అలవాటు పడి, దానికి భిన్నంగా ఉన్న విషయాన్ని అంగీకరించలేక, హైరానా పడటం కనబడుతుందిక్కడ. కొత్తదారి వెంబడి కొత్త తీరాలకు పయనించమని చెప్పడం.

"ప్రతి పనికీ అడ్డంగా / తలూపుతూ డీయన / అచ్చు

ంత గోడ 'గడియారం". కించిత్ హాస్యస్ఫోరకంగా, చమత్కారంతో ాడిన హైకూ ఇది. Different from routine ఉంటే కాదని పిల్లల్ని, ువతని పెద్దలు సాధికారికంగా అడ్డుకోవడం చూస్తుంటాం మనం. ారే కాలంతో మనమూ మారాలనీ, లేకుంటే Stagnate ుయిపోతామని తెలుస్తుందిక్కడ.

"అక్షరారణ్యాలని / విస్తరింప చేశాడీ కవి / ఒక్క మొక్క టితే సంతోషిద్దును." వేదకాలంలో యాగాల్ని పాడు చేయడానికి క్షసులు పాటు పడేవారట. ఈ కవి కాలంలో తమది కవిత్వమని ిస్తున్న కొంతమంది పేజీలకు పేజీలు ఒంపేస్తున్నారు. ఆ బ్రహ్మ ార్థమేమిటో వారికీ, చదువరికీ అర్థం కాదు. దానికి బదులు ఓ క్క నాటితే ప్రాణాధారమైన ప్రాణ వాయువు లభిస్తుంది కదా అంటూ ారంగా చెబుతాడు కవి.

"ఒడ్డికి చుక్కాని తాటించి / పడవ నడిపాడు సరంగు : ాత్ములకి ఉపకరణం కాదు ముఖ్యం." ప్రచారార్భాటాలపై చెంప పెట్టు ఈ హైకూ! మహాత్ములు సాదాసీదాగా తమ పని సాధిస్తారని, అనవసర భేషజాలకుపోరని తెలియ చెబుతారు. పావలా పనికి పాతిక రూపాయల ప్రచారం చూస్తూనే ఉన్నాం మనం.

"చెట్టుని కూల్చితే / ఆకాశంలో / పెద్ద గొయ్యి" పర్యావరణమూ, ఓజోన్ పొర అని హైటెక్‌గా గొంతు చించుకుంటున్న తరుణంలో అరటి పండు ఒలిచినట్లుందీ హైకూ!

నిజానికి ఇస్మాయిల్ అనే పచ్చని చెట్టు కూలాక, సాహితీ ఆకాశంలో పూరింపలేని పెద్ద అగాథమే ఏర్పడింది మరి. తన కవిత్వంతో నేల నుండి నింగికి వారధి నిర్మించి తన కవిత్వమంత సుతారంగా నడిచి వెళ్ళారాయన అనంతంలోకి, అంతే సుతారంగా తపోభంగం కాని హైకూ ధ్యానంలోకి.

**("నత్త ప్రణయయాత్ర" హైకూలు, ఇస్మాయిల్, వెల : రూ. 30/- ప్రతులకు : కుమారి ట్వింకిల్, 2-421-2, బాలాజీనగర్, ఎ.పి.ఎస్.పి. క్వార్టర్స్ ఎదురుగా, కాకినాడ)**

---

రా



## 'పొగచూరిన ఆకాశా'న్ని కవిత్వంతో కడిగే ప్రయత్నం

పైనున్న వస్తువులు పొగచూరు తున్నాయంటే, వాటి కింద ం మండుతుందనేది స్పష్టం. మరి ఆకాశమే పొగచూరుతోందంటే, ంచం మొత్తం తగలబడుతోందనేది సుస్పష్టం. అవును మరి, ాజ్యవాద దేశాలు రగిలించిన చిచ్చు దావానలంలా వ్యాపించి, సంస్కృతులు, సాంప్రదాయాలు, భాషలు, భావజాలాలు, ట్లు, ఆచారాలు. ఒకటేమిటి మనవని మనమనుకొనేవన్నీ కాలి వుతున్నాయి. "చూడు చూడు నీడలు, నీడలు పొగమేడలు"... ఆకాశంలో కమ్ముకొంటున్న పొగనీడల్ని మహాకవి శ్రీశ్రీ ఏనాడో ించాడు. కాకపోతే ఆ పొగ ఈనాడు మరింతగా విజృంభించి, ం మొత్తాన్ని కమ్మేసింది. సూర్యుణ్ణి, చంద్రుణ్ణి మింగేసింది. ీకరణ మంటల్లో, ప్రపంచం మొత్తం సజీవ దహనమైపోతూ ఆర్తనాదానికి అక్షర రూపమే అద్దేపల్లి రామమోహనరావుగారు చూరిన ఆకాశం".

ఈ సామూహిక దహనంలో, కవికి సహజంగానే, భాష చావుకేకే మొదట వినపడింది. పాశ్చాత్య సంస్కృతీ హంలో పడి మన భాష ఎలా దిగజారిపోతోందో ఇందులోని కవితలోనే చెబుతూ,

"సంస్కృతి నా ఇల్లయితే,
భాష నా వీధి గుమ్మం..."

అంటూ,

"అ ఆ ల్ని కలుపు మొక్కలుగా విసిరేసుకుంటే ఒక సంస్కృతి"
మట్టికేసి తల బాదుకొని మూర్ఛపోతుంది మన తనం.
"సగం అట్లాంటిక్‌లో, సగం పసిఫిక్‌లో పడి కొట్టుకు
" అంటూ ఆవేదన వ్యక్తం చేస్తాడు.

భాషతో మొదలుపెట్టి, ప్రపంచీకరణ ప్రభావం వల్ల పోతున్న అనేక అంశాల్ని కవి స్పృశించాడు. టి.వి, ఇంటర్‌నెట్ వంటి ప్రసార మాధ్యమాలు చిమ్ముతున్న విషాన్ని, వాటివల్ల అంతరించి పోతున్న మన మూలాల్ని కవిత్వీకరించడానికి ప్రయత్నించాడు. ప్రపంచీకరణ నేపథ్యంలో రాసిన కవితలన్నింటిలోకి, హైలెట్‌లాంటి కవిత "నా దేశంలో నేనే పరదేశిని" ప్రపంచీకరణ దుష్ప్రభావాల్ని ఎంతో ప్రభావవంతంగా ఇందులో కవిత్వీకరించడం జరిగింది.

ఈ పుస్తకంలో ప్రపంచీకరణ పడికట్టు పదాల ప్రయోగం నుండి తప్పించుకొన్న కవితలు కూడా ఉండటం విశేషం. అలాంటి ఓ మంచి కవిత. "నాకో ఉత్తరం కావాలి". ఇందులో అంతరించిపోతున్న ఉత్తర సంస్కృతిని వర్ణిస్తూ...

"నీ ఆలోచనల నదిలో ఈదులాడి / తడిబట్టలతో ఒడ్డుకు వచ్చి / నీ కలలలోకి దూకి / నీలి చుక్కల్తో తాదాత్మ్యం పొంది / కాగితం మీద అక్షరాలై ముద్రపడిన నీ అనుబంధం / నా కళ్ళ నావల మీద / నా రక్తంలోకి ప్రయాణం చేసి / నా ఆలోచనల కదలి ఒడ్డున లంగరు వేసుకొంటే / దాని పేరు ఉత్తరం" అంటూ అందంగా అభివర్ణిస్తాడు. చివరగా "మిత్రమా! అప్పుడప్పుడూ ఉత్తరాలు రాస్తూ ఉండు / అప్పుడప్పుడు అక్షరాల వాన కురుస్తూ ఉండు / ఎండిన నేలలో మొలకెత్తిన కవితల పంటల్ని / ఆకలితో ఉన్నప్పుడల్లా కోసుకోనీ" అంటూ ఎంతో ఆర్ద్రతతో మనల్ని కమ్ముకొంటాడు. ఇటువంటిదే మరో మంచి కవిత. "వాన వెలసిన మర్నాడు". ఇందులో కవి ఆధునిక తారురోడ్లను కాదని, మట్టిరోడ్లకున్న ప్రత్యేక గుణాన్ని ప్రశంసిస్తూ, "అందరూ పెద్ద వాన కురవగానే యింకిపోయే / అద్దాలలాంటి రోడ్లు గొప్పవని చెప్పుకొంటారు గాని / మబ్బుతో తడి స్నేహాన్ని చప్పరించే గుంటల్లోనూ / అడుగుల్ని చెరక్కుండా హత్తుకొనే బురదలోనూ / వానతో ఆడుకొని, అలసిపోయి / ఒళ్ళంతా చెమటలు పట్టిన మట్టి బాటల్లోనూ / ఆకుల చివర్ల నుంచి చిన్న చిన్న వానపళ్ళుగా / జారిపడే నీటి బొట్లలోనూ / మేఘం తనను తాను చూసుకొని / ఒళ్ళంతా చల్లని హాయిలో పరవశించి / మళ్ళీ కురవడానికి సిద్ధపడుతుంది / అందుకే నాకు వానస్పర్శని తొందరగా వదిలించుకోలేని / గతుకుల, గుంటల రోడ్లంటేనే భలే యిష్టం" అనడం నిజంగా మనల్ని మళ్ళీ పల్లెటూళ్ళకు తీసుకెళ్ళే ప్రయత్నమే.

"బుద్ధుడూ – బూతుబొమ్మలు" అనే స్త్రీవాద కవితలో కవి – "నీ దేహమంతే నీ దేహానికి / మంట పెడుతున్న మార్కెట్ మధ్య / నీ ప్రతిఘటన స్వరం / తారాస్థాయిని చేరలేదు / ఆకాశంలో రెండో సగం మారలేదు' అంటూ స్త్రీల నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ "ఇవ్వాళ నీ ఉపేక్ష / రేపటి ప్రళయానికి నాంది కానివ్వకు / నీ ప్రతిఘటనకు

విరామమివ్వకు / ఉప్పెనని వాయిదా వెయ్యకు" అంటూ సరికొత్త శిల్పంతో స్త్రీ జాతిని జాగృతపరుస్తాడు.

అలాగే మరో కవితలో "ఎంజాయ్ చెయ్యాలంటే ఎక్కడికైనా వెళ్ళు / సముద్రం భుజం మీద చెయ్యేసి / నిశ్శబ్దంగా పలకరించి / నిన్ను నువ్వు చూసుకోవాలంటే మాత్రం / భీమ్లీకే వెళ్ళు" అంటూ అందమైన భీమ్లీ ఒడ్డుకు మరింత అందమైన తన కవితా ఒడ్డాణం తొడిగి మనల్ని రంజింపచేస్తాడు.

ఒకే వస్తువును ప్రధానంగా చేసుకొని రాసిన కవితల్లో వైవిధ్యం చూపడం కష్ట సాధ్యం. అయితే, శిల్పంలో వైవిధ్యం పాటించడం ద్వారా కవి ఈ ప్రమాదాన్ని దాటే ప్రయత్నం చేశాడు. అయినప్పటికీ "డాన్స్ బేబీ డాన్స్" మరియు "డాన్సింగ్ బాడీ" అనే కవితలు. "వాన వెలిసిన మర్నాడు మరియు "నువ్వెప్పుడైనా" అనే కవితలు మనకు చర్వితచరణాలుగానే కన్పిస్తాయి.

అనేక కవితల్లో కవి, నేటి యువతలోని అభ్యంతరకర పోకడల్ని వ్యంగ్య ధోరణితో విమర్శించడం జరిగింది. ఈ నేపథ్యంలోనే వెర్రి తలలు వేస్తున్న నేటి మోడ్రన్ డాన్స్‌ను, దానిపై పిచ్చి వ్యామోహం పెంచుకుంటున్న యువతను విమర్శిస్తూ చెప్పినప్పటికీ, "తకిట తకిటలు పాతాళంలోకి పరుగెత్తి / భరతుడు, వాత్స్యాయనుడి కాళ్ళు పట్టుకోవాలి / నీ జబ్బలు అబ్బ రబ్బ అని డబ్బులు రాలుస్తుంటే / మార్క్స్, మైకేల్ జాక్సన్ దగ్గర పాఠాలు దిద్దుకోవాలి" అని చెప్పడం ఏ మాత్రం సమర్ధనీయం కాదు. ఎందుకంటే, ఎంతగా యువతో పెడధోరణులు కనబడుతున్నా, శాస్త్రీయ నృత్యాన్ని ఎంతో భక్తిశ్రద్ధలతో నేర్చుకొంటున్న వారున్నారని, అలాగే కమ్యూనిజంకోసం ప్రాణాల్ని సైతం ఫణంగా పెట్టి పోరాడుతున్న వారున్నారన్న సత్యం అద్దేపల్లికి తెలియంది కాదు.

అస్పష్టత, సంక్లిష్టతలకు ఈ పుస్తకంలో చోటు లేదు కవితలన్నీ కూడా సరళంగా, సూటిగా చెప్పడం జరిగింది. కాకపోతే వీటికే మాత్రం భంగం కలిగించకుండానే, చాలా కవితల నిడివి తగ్గించి కవిత్వ పాళ్ళను పెంచడానికి అవకాశముందనిపిస్తుంది.

"అమ్మ కడుపులో తొమ్మిది నెలలు / పిడికిళ్ళు బిగించుక్కూర్చున్న శిశువు / తెలుగు అక్షరంలా కనిపించదూ" అంట తెలుగు వర్ణాన్ని అపురూపంగా వర్ణించిన కవి అంతటితో ఆగకుండ "అక్షరాల్ని నా అస్తిత్వపు కొలిమిలో పుటం పెట్టి ఆ బాణం మొన పూశాను. ఆ మొన గుచ్చుకున్న గుండెలన్నీ పుస్తకాల పేజీలై జన కళ్ళలోకి ఎగురుతున్నై. రాగాన్ని నా నెత్తురు తీగలకి పూసి బాణ గొంతుకి గొలుసుగా వేలాడదీశాను. బాణం పాటగా మారి నిరుపే నేలల్లో పులకరింతలు పోసింది. రేఖలు కరిగిపోతున్న నా రేఖాచిత్రా బాణం నిండా ముగ్గులుగా పెట్టాను. ఆ ముగ్గులు సమాజ ప్రాంగణం నిప్పుగీతల భావికాలాలుగా బిగిసిపోతున్నై" అంటూ అనంతమై ఆత్మవిశ్వాసంతో ఆకాశమంత ఆవేశంతో తన కవితా బాణా వర్ణిస్తున్నప్పుడు, అంతేగాదు ఆ బాణంతో ఆకాశాన్ని కమ్ముకొ ప్రపంచీకరణ అనే పొగను కూడా తుడిచి పారేస్తాడనే నమ్మ పాఠకునికి తప్పకుండా కలుగుతుంది. "అక్షరం రాస్తున్న చెయ్యి ఆగ అంటున్న ఈ కవి చేతి నుండి ఇలాంటి మరెన్నో అద్భుతమైన కవి సంపుటుల్ని ఆశిద్దాం.

**(పొగచూరిన ఆకాశం, కవి : అద్దేపల్లి రామమోహనరా పేజీలు : 100, ధర : రూ. 75/-లు, లభించు చోటు : ప్రజా బుక్‌హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్ మరియు నవోదయ బుక్‌హౌ ఆర్యసమాజ్ ఎదురుగా, హైదరాబాద్).**

మొలకలపల్లి కోటేశ్వరరావు

# సమకాలీన వ్యవస్థ మీద సంధించిన శరాఘాతం

నేటి రాజకీయ నాయకుల తీరుతెన్నుల గురించీ, ఆ నాయకుల సేవలో తరించిపోతున్న మీడియా ప్రతినిధుల మాయాజాల బండారాన్ని గురించీ, ఈ వ్యవస్థని శతవిధాలా కాపాడటానికే వున్న పోలీస్ దాష్టీకాన్నీ, దౌర్జన్యాల్నీ గురించి, కార్పొరేషన్ ఛైర్మన్ పదవుల కోసమో, డైరెక్టర్ పదవుల కోసమో, కాంట్రాక్టులూ, సుగర్ ఫ్యాక్టరీలూ, ఇతర ప్రభుత్వ ప్రజల ఆస్తుల్ని కొల్లగొట్టడానికి మంత్రుల చుట్టూ తిరిగే అనుచరగణం ఆబతనాన్నీ, ఆశబోతుతనాన్ని గురించీ, పేద కూలీల మీద పెత్తందార్ల అనుచరులు బాంబులు విసిరీ, కొంతమందిని బలిగొనీ బీభత్సం సృష్టిస్తే చివరికి పోలీసులు ఆ పేద కూలీల్నే అరెస్ట్ చేసి జైళ్ళకి పంపించిన యథార్థపు సంఘటనల్ని గురించీ, బ్రాకెట్టులు నడిపీ, సారా అమ్మించీ, రైల్వే బొగ్గు, ఇనుము, రాగి దొంగతనం చేసి లుచ్ఛాగా, దొంగగా, రౌడీగా, బ్రోకర్‌గా బతికిన ఆటిన్ అప్పారావులు రూపాంతరం చెంది కాలేజీలు, కాన్వెంట్‌లు నడుపుతూ, సీరియళ్ళూ, సినిమాలు తీస్తూ సమాజసేవ, కళాసేవ, ప్రజా సేవలు చేయడాన్ని గురించి, స్వయం సహాయక సంఘాల లీడర్ల విచిత్ర విన్యాసాల్నీ, వింత పోకడల్ని గురించీ, పదవుల కి కుర్చీలాటలో కుర్చీలు ఎక్కి జనాల్ని పాలించడం కోసం నాయ భార్యలే భర్తల్ని లాలించో, ఎదిరించో, బెదిరించో, ఫాకులాడే వ్యామోహాల్ని గురించీ, ప్రజల కోసం, భూమి కోసం, తోటల పోరాడే యువకులు ఎన్‌కౌంటర్లకు బలవుతున్న పరమ సత్యాల్ని గు – మొత్తం మన వ్యవస్థ, నాయకులకి సంబంధించిన మూలాల్ని తీసి ఎండగడుతూ సమకాలీన సమాజ స్వరూపాన్ని అ ప్రతిబింబించినట్లుగా సమగ్రంగా, వ్యంగ్య ధోరణిలో హాస్యం ఎగతాళి చేస్తూ కీలెరిగి వాతపెట్టినట్లుగా నిజాల నిప్పుల్ని విరజిమ అట్టాడ అప్పలనాయుడు రాసిన రాజకీయ వ్యంగ్య రూ 'అనగనగా... ఒక రాజ ద్రోహం' నవల.

రాబల్లి విశ్వనాథం సర్పంచ్‌గానూ, మండలాధ్యక్షుడు ఎంఎల్ఏగానూ అలా అంచెలంచెలుగా ఎదిగి చివరికి మంత్రి ఎగబాకుతాడు. చిన్నతనంలోనే పదవిని ఆశించి సర్పంచ్ సీతంన ఏకైక కూతురు ధనలక్ష్మిని కోరి వివాహమాడి, ఆమెతోపాటు వున్న పాతిక ఎకరాల పల్లపు భూమి, పాతిక ఎకరాల మెట్ట రైస్ మిల్లు, సర్పంచ్ పదవి స్వంతం చేసుకుంటాడు. ఆమె ఆసు ఒక బిడ్డని కని విశ్వనాథం దయతో కన్నుమూస్తుంది. ఆ భార్య ఆమెకి పురుడు పోసిన ఆ ఆసుపత్రి డాక్టర్ ప్రేమకుమారి ప్రవేశ కొంతకాలానికి ఆ ప్రేమకుమారిని వదిలించుకుని, శ్యామలరావుతో ఆమెకి ముడికట్టించి అతనిని తన అను చేసుకుంటాడు. జిల్లా పరిషత్ ఛైర్మన్ కొర్ల కోట క్రిష్ణంనాయు

కూతురు వీరలక్ష్మిని తన జీవితంలోనికి ఆహ్వానిస్తాడు.

ప్రభుత్వం అంగడిలో బేరం పెట్టిన సుగర్ ఫ్యాక్టరీని మంత్రి అండతో దండుకోవాలని ఊణ్ణం గంగరాజు ఉవ్విళ్లూరిపోతుంటాడు. జన్మభూమి ప్రోగ్రాం కోసం కలగాం వెళ్ళిన మంత్రికి తన పదవి ఊడిపోయిందని తెలుస్తుంది. వెంటనే ఆయనకి ప్రజలు గుర్తుకొస్తారు. వాళ్ళ సమస్యలు గుర్తుకి వస్తాయి. గ్రామాలకి రోడ్లు, కరెంట్, స్కూళ్ళూ, పొలాలకి నీళ్లూ, పంటలకి ధరలూ, నదులకి ప్రాజెక్టులూ, నగరాలకి ఫ్యాక్టరీలు, ఫ్యాక్టరీ కార్మికులకి జీతాలూ, వంశధార రెండో దశ పూర్తి చేయడం, నౌపడా ఫిషింగ్ హార్బర్ ఏర్పాటు చేయడం, ఉద్దానంకి మంచినీరు అందించడం, వౌయిజాగుకి వంటావార్పుకి వాటరందించడం ఇవన్నీ చేయాలనీ, వీటికోసం ప్రజల్ని చైతన్యవంతం చేయాలనీ సంకల్పిస్తాడు. ప్రజా చైతన్యం ఒక్కటే తనని తిరిగి సింహాసనం ఎక్కించగలదని తెలుసుకుంటాడు. ప్రజల్ని రెచ్చగొట్టి తిరిగి పదవి పొందాలనుకుంటాడు. అందుకు ప్రణాళికలు సిద్ధం చేస్తాడు. 'కళింగాంధ్ర సంక్షేమ సంరక్షణ సంగ్రామ సమితి'ని స్థాపిస్తాడు. ఆ సంస్థ ద్వారా ఆందోళనా శంఖారావాన్ని పూరిస్తాడు.

విశ్వనాథం ఇలా వుంటే - భార్య వరలక్ష్మి జిల్లా పరిషత్ చైర్మన్ కావాలని కలలు కుంటూ అందుకు అనుగుణంగా పావులు కదపటం ప్రారంభించింది. ప్రభుత్వ దూతగా ఎస్పీ రాంచంద్రరావు రంగప్రవేశం చేసి విశ్వనాథంతో బేరం పెడతాడు. మంత్రి పదవి కావాలో, భార్యకి జెడ్పీ ఛైర్మన్ పదవి కావాలో తేల్చుకోమంటాడు. ఉద్యమాన్ని మాత్రం విరమించుకోవాలని స్పష్టం చేస్తాడు. పోలీసులు ఎలాంటి పనులనైనా చేస్తారనీ, చేయగలరనీ, ప్రభుత్వమే పోలీసుల చేతిలో కీలుబొమ్మలాంటిదని ఎస్పీ తన మాటల ద్వారా వెల్లడి చేస్తాడు.

శ్రీకాకుళం అడవుల్లో లభించే తేనెపట్టులాంటి మధురమూ, సహజ సుందరమైన మాండలీకంతో నవల చక్కగా చదివించేలా వుంది. వర్తమాన రాజకీయ ధోరణుల మీద పదునైన విమర్శలూ, ఘాటైన వ్యాఖ్యలూ వున్నాయి. నాయకుల మీద సంధించిన వాగ్బాణాలు, వ్యంగ్యాలు, వెటకారాలు సరేసరి! ఉదాహరణకి - "రౌడీలు వేరేగా, రాజకీయ నాయకులు వేరేగా- యిపుడున్నారేంటి?", "ప్రభుత్వం ఒక దున్నపోతులాంటిది! ప్రజల కన్నీళ్ళు దానికి వాన చినుకుల్లాటివి!", "మన దరిద్రం - మరొకడికి భాగ్యం!" ఇలాంటి సత్యాలు బోలెడు.

తెలుగులో రాజకీయ నవలలు చాలా తక్కువే గదా! ఆ లోటుని ఈ నవల కొంత మేర కవర్ చేస్తుంది. సమకాలీన రాజకీయాల మీద ఆసక్తి కలిగిన సాహిత్యాభిమానులు తప్పకుండా చదవాల్సిన నవల.

**(నవల : అనగనగనగా.... ఒక రాజద్రోహం..., రచయిత : అట్టాడ అప్పల్నాయుడు. స్నేహ ప్రచురణలు, శ్రీకాకుళం, ధర : 50/-లు, ప్రతులకు : మైత్రి, దిశ, విశాలాంధ్ర అన్ని శాఖలు)**

---

ముకోరా




# 'గరుడ స్తంభం' వెలుగులో నిరుపేదల బతుకులు

పేద సంచార జాతుల వారి బతుకు చిత్రాలూ, దళితుల వివక్ష, అంటరానితనం, వాళ్ళ సమస్యలు, రైతుల వెతలు, వేదనలు, నిజం పడగ నీడలో పేదల బతుకులు ఛిద్రం కావడం - ఇలా సమాజంలో పీడిత ప్రజానీకం ఎదుర్కొంటున్న సమస్యల్ని, వాళ్ళ బతుకుల్ని ఇతివృత్తాలుగా తీసుకుని జి. వెంకట కృష్ణ వెలువరించిన కథల సమాహారం 'గరుడ స్తంభం'.

కడుపు చేత బట్టుకుని... రకరకాల విద్యలతో... ఆటలతో... ఏ బొదుగూ లేక... సంచరిస్తున్న జాతులు... ముత్తాతలూ, తాతలు, తండ్రులు, పిల్లలూ... పిల్లలకి పిల్లలూ... పేదరికంలో... జన్మభూమిలో పరదేశీకులుగా... ఇది ఒక 'సంచారి' కథ.

'ఇల్లిల్లూ తిరిగి భిక్షమెత్తుకునే' తండ్రి కులవృత్తిని ద్వేషించుకుంటూ, సేద్యం చేసి రైతుగా బతకాలనే కొడుకు సొసైటీ, బ్యాంకు, ప్రెసిడెంట్‌ల మోసాలకి గురై, అప్పుల పాలై, అవమానాలపాలై తిరిగి తండ్రి వృత్తినే అనుసరించడం 'గరుడ స్తంభం'. కులవృత్తివాళ్ళకి ఏ లోటు లేకుండా తిండి పెట్టింది. కానీ తిండి పెట్టాల్సిన సేద్యం చీకటిని మిగిల్చింది.' పొలంలో దిగుతున్నప్పుడు "జాగ్రత్త నాయనా - కసువు సేద్యం, గండం" అంటాడు తండ్రి. కరువు సేద్యంలో ఏ గండాలు వుంటాయో అప్పుడు అతనికి అర్థం కాలేదు కానీ తరువాత అర్థమైంది.

వినాయక నిమజ్జనం చేయాలని కోరుకున్న దళితుల్ని అడ్డుకున్న అగ్ర కుల అధికార అహంకారం 'రాజకీయ దేవుడు'. దేవుని పూజ వెనుక కులం, మతం, పెత్తందారీతనం, పాలన, రాజకీయం, అధికారం, అణచివేత ఎలాంటి పాత్రని పోషిస్తాయో విస్పష్టంగా వెల్లడించిన కథ. ఇలాంటిదే, రామాలయ నిర్మాణంలో దళితులు భాగస్వాములు. ప్రవేశానికి మాత్రం అనర్హులు. ఊళ్ళో వున్న హోటల్లోనూ వివక్షే. వాటిని వ్యతిరేకించి పోరాడి సాధించుకోవడం 'పడిలేచే కెరటం'.

'కరువంటే వానలు రాకపోవడమే కాదు, మనుష్యుల మధ్య ప్రేమలు లేకపోవడంగా కూడా జల్లప్ప అనుభవం.' అల్లుడి మరణంతో కొడుకుని వెంటబెట్టుకుని పుట్టింటికి చేరిన కూతురు, రాకాసి కోడలు, కన్నతల్లిలాంటి భూమిని అమ్ముకుని బళ్ళారి చేరిన కొడుకు, పశువులకి మేత లేక 'సొంటేర్లు'కి ఏటికి పోయి సొమ్మసిల్లి పడిపోయిన జల్లప్పని 'సొంటేర్లు' కథలో చిత్రిస్తే, పశువులకి మేత లేక, నీళ్ళులేక, మరో దారిలేక చూస్తూ చూస్తూ బిడ్డల్లాంటి పశువుల్ని సంతకి తోలుకుపోయి, కనీసం సాక్కునే రైతులకైనా అమ్ముకుని వాటి ప్రాణాల్ని నిలుపుకుందామనే ఆశతో మోసపోయి కటిక వాళ్ళకి అమ్ముకోవడం 'పశువుల సంత'లో చిత్రించారు. సీమ కరువు దృశ్యాల్ని బాధామయంగా, ఆర్ద్రంగా ఆవిష్కరించారు ఈ రెండు కథల్లో రచయిత.

సంస్కరణల పేరుతో కఠిన చట్టాలు రావడంతో జీతాలు లేక సొసైటీ గుమస్తాలు, సెక్రటరీలు ఇబ్బందులు పడటం, చివరికంటా వచ్చిన పంట చివరి తడికి నీళ్ళు లేక ఎండిపోయే స్థితి రావడంతో అటు సొసైటీ అటెండర్ రాగన్న, ఇటు పెద్ద రైతు రాంరెడ్డి ఆత్మాహుతికి పాల్పడటం 'రెండు ఆత్మల వ్యథ' కథ. రైతుల పేరుతో లోన్లు తీసుకోవడం, తిరిగి చెల్లించిన బాకీల్ని జమ చేసుకోక రైతుల్ని మోసం చేయడం, ఆ సెక్రటరీకి మంత్రి, అధికారులు రక్షణ కవచంలా వుండటం 'ఈ ఆకలికి అంతం లేదు' ఇతివృత్తం.

భూములూ... సారాయిలూ... గనులూ... (టోల్) గేట్లూ... కాంట్రాక్టులూ అన్నీ పంచుకోవడానికి ఆడుతున్న ఫ్యాక్షన్ ఆటలో, పోలీస్

అంపైర్ చేతిలో, ఫ్యాక్షన్ నీడలో ఆశ్రయం పొందిన సామాన్యుడు ఎలా బలైపోతాడో ఫ్యాక్షన్ 'పడగనీడ' తెలియజేస్తుంది. మరో కథ ఫ్యాక్షన్ కుటుంబం ప్రమీల భర్త, మామ, మరిది అందరూ ఫ్యాక్షనిస్టులే. భర్త ఫ్యాక్షనిస్టు ప్రభుత్వ ఉద్యోగి కూడా. అతను ప్రత్యర్థి ఫ్యాక్షన్ చేతిలో హతమవుతాడు. భర్త పోయిన ఆమెని మరిది వశపరచుకోవాలని యత్నిస్తాడు. ఆ చీకటి కుటుంబాన్ని ఛీత్కరించి ప్రమీల బయటపడి 'వేకువలోకి' పయనిస్తుంది కథ. క్రైస్తవ మిషనరీల ఆస్తులు, అత్యంత విలువ చేసే భూములు ఫ్యాక్షనిస్టులూ, కబ్జాకోరుల పాలు కాకుండా వాటి పరిరక్షణకూ, అవి పేద దళితులకి చెందడం కోసం ఉద్యమం ప్రారంభించడం 'పునరుత్థానం' కథ.

మేనరికపు బలవంతపు పెళ్ళి వలన అక్కని పోగొట్టుకున్న ఓ తమ్ముని వేదన, వ్యధ 'కన్నీటి స్పర్శ' అయితే తల్లిదండ్రుల ప్రవర్తనతో విసిగిపోయి ఇల్లు వదిలి పారిపోయిన స్నేహితుని జ్ఞాపకాల గనిని తొలిచిన కథ 'హృదయస్పర్శ' ఓ చురుకైన పల్లెటూరి పిల్లగాడి కథ 'ఉట్లు మాను'.

ఈ మంచి కథలతో పాటు వాస్తవానికి దూరమైన కథ 'నిద్ర రాని తల్లి' ఒక తల్లి భర్తనీ, కొంత కాలానికి కొడుకునీ ఊళ్ళో కొంతమంది స్వార్థపరులు, దుర్మార్గులు బాంబులు విసిరి చూపుతారు. నిజానికి ఆ కొడుకు, భర్త ఎంతో మంచివాళ్ళు. ఊళ్ళో పేదలకి బాగా సాయపడుతుంటారు. ఎవరికి హాని చేసే వాళ్ళు కాదు. వాళ్ళని చంపిన తరువాత "ఒకరి మీద ఒకరు పడి చంపుకుంటూ, చంపినందుకు కక్షకట్టి ప్రతీకారంతో..." అని ఒక ముసలమ్మ ఆ తల్లికి హితబోధ చేస్తుంది, ఆ భర్తనీ, కొడుకునీ ఫ్యాక్షనిస్టులుగా చిత్రించినా ఈ కథకి న్యాయం జరిగి వుండేది.

కథలు అన్నీ రాయలసీమ మాండలికంతో నిరాడంబరంగా, సహజంగా, జన జీవితాల్ని వాస్తవికంగా, యథార్థంగా చిత్రిస్తూ చక్కగా చదివించేలా ఉన్నాయి. అల్లం రాజయ్య, స్వామి ఈ పుస్తకానికి వెనుక మాటలు రాశారు. ప్రగతిశీల కథాభిమానులందరూ చదవాల్సిన సంకలనం.

(కథలు : గరుడ స్తంభం, రచయిత : జి. వెంకటకృష్ణ, ప్రచురణ : స్ఫూర్తి ప్రచురణలు, కర్నూలు. ధర : 50/-, ప్రతులకు : దిశ, నవోదయ, విశాలాంధ్ర - హైదరాబాద్)

---

**వి. ప్రతిమ**




## ఇగిరిపోతున్న మానవ సంబంధాలను వివిధ కోణాల్లో చర్చకు పెట్టిన కథలు

**మా**నసికంగా ఎదగడంలో యిప్పటి సమాజంలో ఎన్నో అవరోధాలున్నాయి... తుదీ మొదలూ లేని వెతుకులాట... అందుకే చాలామంది ఇంటలెక్చువల్స్‌లో పర్వర్షన్ వస్తోంది... చాలామంది మెటీరియలిస్టులైపోతున్నారు. ఈ దారులేవీ దొరకనప్పుడు ఆత్మహత్యల పాలవుతున్నారు.

ఈ విషయాన్ని మూడు ప్రధాన పాత్రలతో పాటు మరో మూడు పాత్రల్ని తీసుకుని లోతుగా చెప్తుంది రచయిత్రి.

మానసికంగా ఎదగాలని ప్రయత్నించకపోవడం... మనుషుల మధ్య సంబంధాలు ఎండిపోతుండటం... ప్రత్యామ్నాయంగా జీవితాలు చాలించుకోవడం... సింధూరి నిజంగానే ఆత్మహత్య చేసుకున్నదా... లేదా యివ్వాల్టి దారుణమైన పరిస్థితుల్ని వ్యక్తం చేసే క్రమంలో తీక్షణమైన ఆగ్రహంతో రచయిత్రి ఆమెను హత్య చేసిందా అర్థం కాక చాలాసేపు పాఠకుడికి ఊపిరాడదు... మొత్తానికి గుండెలోతుల్ని తడిమే కథ ఈ సంపుటి శీర్షికగా వెలసిన "సింధూరి"...

సింధూరి మరణాన్ని నిరాకరిస్తూ మొదటి కథ చదవగానే చాలాసేపు పుస్తకాన్ని పక్కన పెట్టిగాని రెండో కథలోకి వెళ్ళలేం మనం...

'సింధూరి' ఎస్. శ్రీదేవి వెలువరించిన కథా సంపుటి.. కుటుంబ జీవితంలోని రోజువారీ కన్పించీ కన్పించని చిన్న చిన్న సుడిగుండాలకు లోతైన పరిష్కారాల హారం ఈ సంపుటి...

మనిషికీ మనిషికీ నడుమ కన్పించని మాయ గోడ కులం, కులం అంటే శ్రమ విభజన అని అంబేద్కర్ ఏనాడో చెప్పినప్పటికీ ఈ చిన్న పదం ఈనాటికీ కూడా మనుష్యుల మధ్య ఎన్ని అవాంతరాలనీ, ఎన్నెన్ని అవమానాలనీ, ఎంతెంత అరాచకాన్ని సృష్టిస్తుందో మనకు తెలీందేమీ కాదు...

ఈ నేపథ్యంలో కుల వ్యవస్థని ఖండిస్తూ అనేకానేక కథలు వచ్చినప్పటికీ ఈ సంపుటిలోని "యుద్ధం ముగిశాక" కొంత ప్రత్యేకంగా చెప్పుకోదగినది... యుద్ధం పూర్తయితే 'హమ్మయ్య' అంటూ తేలిగ్గా ఊపిరి పీల్చుకుంటాం కానీ... నిజానికి అసలు విషయం అప్పుడే మొదలవుతుందన్న విషయం సింబాలిగ్గా చెప్తుంది రచయిత్రి...

కులాంతర వివాహాలు కొంత కులాల గోడల్ని కూలగొట్టగలవని అనుకుంటాం గానీ భ్రమల్ని పటాపంచలు చేస్తూ అసలు కథ అప్పుడే మొదలవుతుంది... వాళ్ళకి పుట్టిన పిల్లలు అందునా ఆడకూతుళ్ళయినపుడు వాళ్ళకి పెళ్ళి కావడమన్నది ఎంత కష్టమో తెలిసొస్తుంది మాలతి దంపతులకి. తమ ఆశయాలకు, ఆలోచనలకు అనుగుణంగా పెంచుకున్న కూతురికి తగిన వరుడిని తీసుకురావడం అసాధ్యమై పోతుంది వారికి -

జ్ఞానదేవ్ రచయిత్రి ఊహాపాత్రే అయినప్పటికీ నిజంగా అటువంటి ఒక వ్యక్తి ఈ భూమండలం మీద వుంటే ఎంత బావుండు అన్పిస్తుంది మనకి.

స్త్రీలుగా, పురుషులుగా, కులాలుగా, మతాలుగా వున్నవాళ్ళుగా. లేనివాళ్ళుగా విడిపోయిన ఈ సమాజ విలువల దూరంగా వ్యక్తి విలువ తెలిసే చోట పెరిగిన జ్ఞానదేవ్‌కి ఏది ఏమి స్పష్టంగా తెలుసు...

చాలా ఏళ్ళుగా ఒక అంగీకృత విధానంలో మనమం ఆచరిస్తూ వచ్చిందే అయినా కథ పూర్తయ్యేటప్పటికి మనకూ విషయం కొత్తగా అర్థమవుతుంది... కులం, మతం, ఆస్తి, అంత కట్న కానుకలూ యివన్నీ కూడా స్త్రీ పురుషులు ఒకరికొకరు కానపుడు వాళ్ళ పెళ్ళిలో ముఖ్య పాత్ర వహిస్తాయి. ఒకరినొ కావాలనుకున్నపుడు యివన్నీ తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి.

రచయిత్రి శైలి కూడా పాఠకుడ్ని ఆకట్టుకుంటుంది. ఒక ఆమె అంటుంది. 'మాటలనేవి బిగించి ముడివేసిన పూసల దం వంటివి... ఒకసారి ముడి విప్పితే జలజలా రాలిపోతాయి' అని.

అదేవిధంగా 'ప్రేమరాహిత్యం' కథ కూడా ప్రేమించు మనసులు కులాల మూలంగా విడగొట్టబడి ఒకదానికొకటి దూ మూడు మనసులు సంఘర్షణకు గురైన కథ...

ఒక ఉద్యోగి జీవితంలో రిటైర్మెంటనేది చివరి అంకంగా ఫీలవుతాం. కానీ నిజానికి అది మరో మజిలీకి ఆరంభం అన్న సంగతి స్పష్టంగా తెలుస్తుంది. 'మరో మజిలీకి' అన్న కథ చదివినపుడు...

ప్రతి మనిషికీ ఒక అవగాహనా పరిధి వుంటుంది... కొందరికి అది విస్తృతంగానూ, మరికొందరికి అది ఇరుగ్గానూ వుంటుంది... ఆ పరిధి అవతల వున్నది మనకి తెలీనది... ఇంకొకరు చెప్తుంటే తెలుసుకోవడం ద్వారా కొంత మేరకు విస్తరించుకోవచ్చు... అలా చెప్పినా తెలుసుకోనివి వుంటాయి... అహం చేత కొంత... తెలీడం వల్ల వచ్చే మార్పులకి భయపడి మరికొంత... మానవ సంబంధాలన్నీ ఈ చీకటి కోణాల్లోనే కొట్టుమిట్టాడుతున్నాయి...

ఉద్యోగ విరమణ సందర్భంగా తీవ్ర ఒత్తిడికి గురవుతోన్న రాజారావుకి భార్య జీవితం పట్ల ఒక అవగాహనని కలిగిస్తుంది. ఇద్దరూ ఒక స్పష్టమైన జీవితాలోచనతో ఉద్యోగ విరమణ తర్వాత సంతానం వద్దకి వెళ్ళాలనే ప్రతిపాదనని తిరస్కరిస్తారు... ఇంతకాలం పిల్లల కోసం మాత్రమే జీవితాలనీ, డబ్బునీ వెచ్చిస్తూ వచ్చిన దంపతులు యిక మీదట తమ కోసం తాము బతకాలన్న గట్టి నిర్ణయాన్ని తీసుకుంటారు.

కొడుక్కి పెళ్ళవుతోందంటే మనకి జీతం, భత్యం లేని పనిమనిషి ఏర్పడుతుందనీ, ఆదరువుగా వుంటుందనీ ఆశించే స్థాయి నుండి అత్తగార్లు చాలా ముందుకు నడిచి వచ్చినప్పటికీ... యివ్వాల్టికీ కూడా కోడలు తమ వాళ్ళనందరినీ వదిలి పెట్టి కొత్త యింట్లో, కొత్త మనుషులందరితోనూ కలగలసి పోవడం కోసం ఎంత తపన పడాల్సి వస్తుందో మనందరికీ తెలిసిన విషయమే...

అత్తా కోడళ్ళ మధ్య నుండే సాంప్రదాయ వైరాన్నీ, ఇంట్లో మనుషుల మధ్య రగిలే చిన్న చిన్న నిప్పురవ్వల్నీ... స్త్రీ, పురుష భేదాలు లేకుండా ఎవరెవరి ప్రవర్తనలు ఎలా వుంటాయి.. ఎలా వుండినట్టయితే బావుంటుంది అన్న సున్నితమైన విషయాలని చర్చకు పెట్టిన కథ 'కోడలొచ్చింది'.

అయితే ఈ కథలో పంటి కింద రాయిలా తగిలిన ఒక వాక్యం ప్రసాదరావు తనలో తాను యిద్దరు స్త్రీలు కలిసినపుడు సాధారణంగా భర్తల గురించో, అత్తల గురించో, కోడళ్ళ గురించో మాట్లాడు కుంటారు... అనుకోవడం నిజంగా దారుణం... ఇవ్వాళ స్త్రీలకి మాట్లాడు కోవలసిన, మాట్లాడుకోదగిన విషయాలు ఇతరాలనేకం వున్నాయి...

అయితే బహుశా రచయిత్రి వుద్దేశం స్త్రీలు అవి తప్ప మరోటి మాట్లాడుకోలేని స్థితిలోకి నెట్టబడ్డం వెనుక వున్న కుట్ర గురించి కావొచ్చు.

తల్లిదండ్రుల నిర్లక్ష్యం మూలంగా, నిర్వ్యాపారత్వం వల్ల, సోమరిపోతుతనం వల్ల పిల్లలెలా బలవుతారో చెప్పిన కథ 'బలిదానం'... ప్రధాన వస్తువు ఇదే అయినప్పటికీ స్త్రీలు ఎల్లకాలం సహిస్తూ పోవడం మూలంగా జీవితాన్ని కోల్పోవడమే కాకుండా పిల్లల జీవితాల్ని కూడా ఫణంగా పెట్టాల్సి వస్తుందన్న ప్రమాదాన్ని సూచిస్తూ స్త్రీలు తిరగబడాల్సిన అవసరాన్ని కూడా తెలియచెప్తుందీ కథ...

ఇదే వస్తువుతో మరింత విస్తృతంగా చర్చకు దిగిన కథ 'వారసత్వం' తమ బాధ్యతారాహిత్యం మూలంగా తల్లిదండ్రులు... ముఖ్యంగా తండ్రులు తమ పిల్లలకి అందిస్తున్న వారసత్వం... వాటి మూలంగా తర్వాతి తరం పడుతోన్న తిప్పలు... ఇబ్బందులు... తమలో తాము ముడుచుకు పోవడం - తల్లిదండ్రులు చేసిన దానధర్మాల మూలంగా పిల్లల మీద పడుతోన్న భారపు ఇమేజ్... పిల్లలకి తమదైన గుర్తింపు లేకుండా నాన్నగారబ్బాయిగానే మిగిలిపోవడం... తండ్రి నిర్వ్యాపారత్వం మూలంగా మేనమామలు సాయపడి చివరికి మేనల్లుడి నుండి కృతజ్ఞతని కోరుకోవడం... యిలా వివిధ కోణాల్లో నుంచి చర్చిస్తుంది కథ. తల్లిదండ్రులు పిల్లలకిచ్చే వారసత్వం గురించి...

ఇంకా ఈ ఇరవయ్యో శతాబ్దంలో కూడా ప్యూబర్టీ ఫంక్షన్ని గ్రాండ్‌గా సెలెబ్రేట్ చేసి మా అమ్మాయి పెద్ద మనిషయిందహో అంటూ ప్రకటించడాన్ని నిరసిస్తూ 'నిన్నటి మొగ్గ' పండుగలూ, పబ్బాలూ స్త్రీల మీద ఎంత ఒత్తిడి వేస్తాయో, ఎలా ఒళ్ళు హూనం చేస్తాయో చర్చిస్తూ... ఆమెకి కొడుకిచ్చిన 'చిరు కానుక' వంటి ఎన్నో కథలు ఈ సంపుటంలో వున్నాయి..

ఇలా ఈ సంపుటిలోని అన్ని కథలూ కూడా మన చుట్టూ వున్న సమాజంలోని, కుటుంబ జీవితాల్లోని వివిధ రకాల సమస్యలని సున్నితంగా, లోతుగా చర్చకు పెట్టిన కథలే...

'గుండె లోతు' కథ రాసిన సాహితి గురించి సీరియస్ పాఠకులందరికీ అవగాహన వుంది. ఆ సాహితియే ఈ శ్రీదేవి అన్న విషయం పాఠకులు గుర్తుంచుకుని చదవాల్సిన సంపుటి 'సింధూరి'.

**(పుస్తకం పేరు : సింధూరి, రచయిత్రి : ఎస్. శ్రీదేవి, పేజీలు : ౦, ధర : రూ. ౦/-లు, లభించు చోటు : ప్రజాశక్తి బుక్‌హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్ మరియు నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, హైదరాబాద్).**

---

**పసునూరి రవీందర్**

# కథా కథనంగా....

## 'గల్లీ'




సుదూర లక్ష్యాలను చేరుకోవడంలో మార్గమధ్యంలో అలసిపోతామేమో అని ఆలోచించేవారు ఆ గమ్యాన్ని చేరలేరు.

\- కారల్‌మార్క్స్

ఉన్నత శిఖరాలను చేరుకోవాలన్న బహుదూరపు బాటసారొకడు ప్రయాణించి, ప్రయాణించి ఒక కొండ మీదకి చేరాడు. తన లక్ష్యం ఆ కొండ ఆవల ఉన్న సముద్రపు ఒడ్డున ఉంది. కానీ ఈదటం రాని ఈ బాటసారి సముద్రాన్ని అధిగమించలేదు. అలాగని కొండ దిగి కిందన ఉండలేదు. సరిగ్గా ఈ విషయం ఆశారాజుగారు వెలువరించిన కవిత్వాన్ని చదివినపుడు గుర్తుకొస్తుంది.

ఈ సంవత్సరం వెలువరించిన తొలి సంకలనాల్లో ఆశారాజు గారి "గల్లీ" ఒకటి. చక్కటి ముఖచిత్రంతో, తక్కువ పేజీలతో అందంగా తీర్చిదిద్దబడిన పుస్తకమిది. హైదరాబాద్ నగరంలోని హైదరాబాదీల మనుకునే వాళ్ళు మాట్లాడే భాషలో (అంటే సగం ఉర్దూ, సగం తెలుగులో) సాగింది ఈ రచన. ఆశారాజుగారు తెలియని కవులు చాలా తక్కువగానే ఉంటారనుకోవాలి. అయితే వారి కవిత్వం అందరికి తెలిసి ఉంటుందనుకోవడం లేదా తెలియకపోవచ్చుననుకోవడం అప్రస్తుతం. ప్రస్తుతం ఈ గల్లీ సంకలనంలో సరిగ్గా 23 కవితలున్నాయి. ఆశారాజుగారు తన నిత్య జీవితంలో చదివినవి, చూసినవి, విన్నవి కవితీకరించడం కోసం ప్రయత్నించారు. ఆ ప్రయత్నంలో వీలైనంత ఎక్కువగా హైదరాబాద్ భాషగా చెప్పుకునే Mixed Languageని ఉపయోగించి, తన Nativityని నిరూపించుకున్నారు.

ఆశారాజుగారనుకున్నట్లు అన్ని దృశ్యాలు, సంఘటనలు కవిత్వంలో సరిగా ఇమడవు. అయినా కవిత్వంలోనే బంధించే ప్రయత్నం చేస్తే అది కథ కాక, కవిత్వం కాక పలుచనవుతుంది. గల్లీలో కూడా ఈ ధోరణి మోతాదుకు మించి ఉంది. తన మిత్రులు గొడవపడిన విషయాన్ని 'పహిల్వాన్' అనే పేరుతో పుస్తకంలో మొదటి పోయెమ్‌గా ఉంది. మిత్రుల మధ్య గొడవ జరగడం ద్వారా ఆశారాజుగారు ఏం చెప్పదలచుకున్నారో ఎంతకూ అర్థం కాలేదు. దాదాపుగా ఎక్కువ కవితల కథనాలకు ఉర్దూ శీర్షికలనే పెట్టారు. కవిత్వంలో భాష ఏదైనా భావం సరిగా పలికించడం ప్రాథమికాంశం. ఆ అంశానికి ఆశారాజుగారు తిలోదకాలిచ్చారు. ఆశ్చర్యకరమైన అంశం ఇందులో ఎక్కువ కవితలు వివిధ పత్రికలలో అచ్చైనవే.

'గల్లీ' కంటే ముందు ఆశారాజుగారు 'సర్వాంతర్యామి' వంటి సంకలనం గానీ, వాటి కంటే ముందటి సంకలనాల్లో కాస్తో, కూస్తో హృదయతంత్రుల్ని కదిలించగలిగారు. కానీ గల్లీని మాత్రం గందరగోళంగా పాఠకలోకం పైకి విసిరారు. కవిత్వం కోసం తహతహలాడే వారికి ఈ గల్లీ ఒక నిరాశను, నిట్టూర్పును మాత్రమే మిగులుస్తుంది. అన్ని సందర్భాలను కవిత్వీకరించకుండా ఆశారాజుగారు కథా రచనవైపు దృష్టి సారిస్తే మంచిదనిపిస్తుంది. తనకు హృద్యమైన అంశాలు మిగిలిన వారందరికి అంతే ఆనందం కలిగిస్తుందని చెప్పలేం. కాబట్టి అంశం ఏదైనా వ్యవస్థను దృష్టిలో పెట్టుకొని, దాన్ని వ్యవస్థీకృతం చేసి రసానందం కలిగించగలగాలి. అది చదివిన కవిత్వ ప్రియులు జీవితాంతం వాటిని గుర్తుంచుకోకపోయినా, అని చదువుతున్నప్పుడైనా కాస్త మనసును రంజింపచేయగలగాలి. కానీ అటువంటి ప్రయత్నమేదీ 'గల్లీ'లో గత్తర గత్తరగా వెదికినా దొరకలేదు. ఒక పోయెమ్ పొడుగూత ఎటువంటి మంచి వాక్యాలు లేకున్నా, చివరకన్నా కనీసం అనందించే, పదే పదే స్మరించుకునే పంక్తులైనా లేకుండా ఆ పోయెమ్‌ని ముగించడం సరియైంది కాదు.

ఈనాడు రాశికి కొదవలేకుండా కుప్పలు, తెప్పలుగా కవిత్వం కట్టలు తెంచుకొని సంకలనాలు సంకలనాలుగా వస్తున్నది. రాష్ట్రంలో ఏదో మూల రోజు ఏదో ఒక కవితా సంకలనం వెలువడుతూనే ఉంది. కానీ ఎన్ని నిలచిపోతున్నాయనేది ప్రశ్న? ఒకటి రెండు సంకలనాలు వెలువరించిన కవి మళ్ళీ కనిపించడం లేదు ఎందుకు? అధునాతనంగా వస్తున్న మార్పుల్ని, నూతనంగా వ్యక్తీకరించలేకపోవడం కూడా ఒక కారణంగా చెప్పవచ్చు. ఈనాటి కవిత్వంలో చాలా వరకు క్వాలిటీగా వస్తున్న కవిత్వం లేకపోలేదు. కేవలం నాలుగు పంక్తుల్లో ఎన్నో జీవితాల సారాన్ని కవిత్వీకరించే కవులు మనకు లేకపోలేదు.

ఆశారాజుగారి కవితా శిల్పంలో ఇలాంటి లోపాలు మనకు కనిపిస్తాయి. వస్తువు విషయంలో కూడా ఆశారాజుగారు పరిధిని నియమించుకున్నట్లు గమనించవచ్చు. తన మిత్రులతో తనకున్న అనుబంధాన్ని చెప్పడం కోసమో, తను చూసిన వలస కూలీల మాటల్నో, అధికారుల్ని బెదిరించడం వరకు మాత్రమే ఆశారాజుగారు పరిమితమయ్యారు.

రోజు రోజుకు నగర జీవనం ఎన్ని వైవిధ్యాలకు గురి అవుతున్నదో ఈ కవి గుర్తించలేకపోయారు. ఈ 'గల్లీ'లో దృశ్యాన్ని కళ్ళ ముందుంచడానికి, చదివే పాఠకునికి అర్థం కావడం కోసం మాత్రమే ఈ కవి శ్రమించినట్లుగా కవితల్లో కనబడుతున్నది. అలాకాకుండా ప్రస్తుతం వస్తున్న కవిత్వాన్ని కొంత సీరియస్‌గా గనుక పరిశీలిస్తే ఏ కవినైనా తన గమనం సులభమవుతుంది.

**(గల్లీ - కవితా సంకలనం, కవి : ఆశారాజు, వెల : రూ. 35/-, ప్రతులకు : ప్రజాశక్తి, నవోదయ, దిశ, తెలుగు పుస్తక కేంద్రాలు)**

---

# ఊరులేనితనం

**షకూర్**

తల్లి నుండి బిడ్డను విడదీసినట్లు
పల్లె నుండి మనిషిని వలస పంపే
కుయుక్తులు
కాళ్ళ క్రింద నేలను
జలస్థాపితం చేసే పన్నాగాలు
పచ్చ నోట్ల కత్తెరతో
పేగుబంధాన్ని కోసే ప్రణాళికలు

పల్లె పునాదుల క్రింద
ముందస్తు ఊబిల్లా పునరావాస
వాగ్దానాలు
పోడు గుండెల్లో -
జలకత్తుల్ని దింపే కుతంత్రాలు
తల్లి నుండి బిడ్డనే కాదు
తల్లి పల్లెను జలజ్వాలల్లో బుగ్గి చేసే
కుట్రలు

ఇక్కడ -
పల్లెలన్నీ పేగు కదిలిన బాధతో
నిద్రల్ని చూరుకు వ్రేలాడదీసి
చూపుల్నీ చిమ్నీలుగా నిలబెడుతున్నాయి

పంచాయితీ మైకుల్లా
వార్తలు వినిపించె సాయం పక్షుల
కలరావాల్ని
ఏ అపరిచిత పాదం నేల తాకినా
పేగులై వెంటాడే మా విశ్వాస జీవాల్ని
ఎట్లా వదులుకోవటం?

కులాల్ని పొలిమేరల్లోనే పాతి
కూర్మి వరసలతో వసంతాలాడే మా
చుట్టరికాల్నీ
ఎట్లా త్రెంచుకోవడం?

ఈ వాకిట్లో -
మా చెల్లెళ్ళ చిరునవ్వులు వెన్నెల
కల్లాపీలైనాయి
ఈ నేల నేలంతా-
మా పాదముద్రలు ముగ్గులై మురిశాయి
ఈ వాకిళ్ళు పొక్కిళ్ళయితే
మా గుండెకు ఎక్కిళ్ళు వస్తాయి

ఇది పల్లె కాదు -
మా ప్రాణాలు మూటగట్టిన ముల్లె
ఈ ముల్లె మీద ఏ కన్నుపడ్డ
ఆ కంట్లో జిల్లెళ్ళు మొలుస్తాయి

పొలిమేర దాటిపోతున్న
కన్నకొడుకుల్ని కడసారి చూస్తూ
తల్లడిల్లె తల్లి సజల నేత్రంలా వుంది పల్లె

పస్తులతో ప్రాణాలు తీసుకుంటాం గాని
ఆస్తుల కోసం అమ్మపల్లెను అమ్ముకోం
ఊరులేనితనం ఊహించడమే కష్టం
చావో రేవో మాకు ఊరితోనే ఇష్టం



# మాయలబూసి

దీప్తి

అది అమావాస్య నాటి అర్ధరాత్రి... అయినా ఆ మాయా ద్వీపంలో వెయ్యి వోల్టుల దీపాలు మిలియన్ల మిలియన్ల వెలుగును విరజిమ్ముతున్నాయి. ఆ ద్వీపంలో రాత్రికీ పగలుకూ తేడా లేదు. అందుకే అక్కడ పక్షులుండవు. పక్షులే కాదు ప్రకృతి సిద్ధమైన వేవీ వుండవు. అన్నీ కృత్రిమాలే. నడక, నడత, పూలూ, పళ్ళూ, పాలూ, పెరుగూ, గాలీ, నీరూ, వెన్నెల, వేడిమీ, వయసూ, వలపూ, సుఖం దుఃఖం, ప్రేమా, పెళ్ళీ, గర్భం, పిల్లలూ... అన్నీ... అన్నీ....

అదంతా వాళ్ళు సాధించిన ప్రగతి. అలాంటి మాయాద్వీపం దండధరుడు మాయలబూసి తూగుటుయ్యాలలో పరుపు మీద పడుకొని నిద్ర రాక అటూ ఇటూ దొర్లుతూ వెండి జలతారు తెరను చూస్తూ ఆలోచిస్తున్నాడు, అరబ్బుల పెట్రోలియం భేద ఉపాయాలతో కాజేశాం. మెక్సికో ...ధకంతో ఎన్ని బిలియన్ల మందుగుండు ...మారైంది? మలేషియా తగరం, అల్జీరియా, ...యాల ఇనుము దీనికే వెచ్చించాం కదా! ...ఆయుధాలతోనే కదా ప్రపంచపు పంచదార ... (క్యూబా)ను కైవసం చేసుకుంది!

అంతేనా! జావా ద్వీపపు అరటి పళ్ళూ, హవాయీ దేశపు అనాసలు, ఆసియా మావిళ్ళు, చలిదేశాల ద్రాక్ష... ఆహా వాటి రుచి... అంతకంటే వాటిని స్వాధీనపరచుకోవడానికి ఎన్నెన్ని తంత్రాలు, ఎత్తులు, కుయుక్తులు... అబ్బో వీటన్నిటినీ మించిన ఇండోనేషియా సుగంధ ద్రవ్యాలు...

భూగర్భం లోపలి పొరల నుండి వెలికితీసిన కంబర్లే వజ్రాలు, ఆసియా నవరత్నాలు, బంగారం... అన్నీ కొంచెమైనా వదలకుండా తెచ్చి యీ ద్వీప గర్భంలో నిలవ వేశాను.

సూర్య చంద్రులున్నంత వరకే కాదు... ఈ విశ్వమంతా మాడి మసైపోయినా భూగోళానికెటువంటి ప్రమాదం రాకుండా అత్యాధునిక రక్షణ వలయాలేర్పరచుకున్నాను.

అయినా...

మాయల బూసి మనసు ఏదో అసంతృప్తితో వేగిపోతుంది. ఆ పాల నురగల పట్టు పరుపుగానీ, సుగంధ పరిమళాలు గానీ, నులివెచ్చని గాలి గానీ, ఆఖరికి ప్రపంచ సుందరుల పొందు కూడా అతని బాధను పోగొట్టలేకపోయాయి. అలా మదనపడుతూనే మంచం మీది నుంచి విసుగ్గా లేచి వెండి జలతారు తొలగించి బయటికొచ్చి నిలబడి ఆకాశం కేసి చూశాడు. ఆకాశంలో మినుకు మినుకుమని మెరిసే నక్షత్రాలు తనను చూసి నవ్వుతున్నట్టనిపించింది. నాలుగు వందల ఏళ్ళ నాడే తన దాయాదులు భూగోళాన్ని చుట్టి చంకన పెట్టుకుంటే యింత శాస్త్రీయ అభివృద్ధి సాధించిన యీ యుగంలో విశ్వాన్ని మడచి సెల్‌ఫోన్‌లా జేబులో పెట్టుకోలేకపోయిన తన అసమర్థతను నక్షత్రాలు వెక్కిరిస్తున్నట్లు అర్థమైంది. అంతే... ఆయనకు అంతులేని కోపం వచ్చింది. అలా ఆయనకు కోపం వచ్చిందో ఎవరికో మూడినట్టే -

మాయల బూసి దగ్గర ఒక మంత్రదండముంది. ఆ మంత్రదండం గ్రహాంతర శక్తులను కూడా నిర్వీర్యం చేస్తుంది. ఇప్పుడు ఆ మంత్రదండంతోటే నక్షత్రాల పని పట్టాలని ఆవేశంగా తన ఆంతరంగిక గృహంలోకి వెళ్ళాడు.

వింత! ఆ మంత్రదండం నిండా చీమలు... సెల్‌ఫోన్ నిండా చీమలు... కంప్యూటర్ నిండా చీమలు... హీటర్ నిండా చీమలు... మీటర్ నిండా చీమలు... ఏసీ నిండా చీమలు... పీసీ నిండా చీమలు... మంచం కిందా, మంచం మీదా చీమలు... పెన్నులో చీమలు... గన్నులో చీమలు... కాలి కిందా చీమలు... కాలి మీదా చీమలు... బూటు నిండా చీమలు... సూటు నిండా చీమలు... అండర్‌వేర్‌లోనూ చీమలు... అండర్ ఆర్మ్‌లోనూ చీమలు...

అంతటా చీమలు... ఎర్ర చీమలు, నల్ల చీమలు, తెల్ల చీమలు, చిన్న చీమలు, పెద్ద చీమలు, చలి చీమలు, సీమ చీమలు, గండు చీమలు, మొండి చీమలు...

దండు దండుగా, బారులు బారులుగా, కలిసి కట్టుగా, కదలి అలల్లా, మీదికి మీది మీదికి వురికురికొస్తున్నాయి.

విచిత్రం కాదు - నిజం....

మాయలబూసి తన మంత్ర దండంతో సహా వాటికి ఆహారమైపోయాడు.

# స్మారకస్థూపం

గేరా

ప్రార్థనా స్థలాల నిండా
పావురాల గుంపులు
శాంతే,
ఎటో ఎగిరిపోయింది...

పొలంలో నుండి
అమ్మ పాడుతోంది
కొమ్మకు ఊగుతూ
జోలె వింటోంది...

పిట్టను కాల్చాలంటే
ఓ కన్ను మూయాలి
చెట్టును కూల్చాలంటే
రెండూనూ...

నిన్న అమెరికా వెళ్ళి
నేడొచ్చాడా
ఈ రోడ్లూ, కల్చర్
చెత్త చెత్తంటాడు

అమ్మల వరుసలో
మా అమ్మ నిల్చుంది
రైలాటకు గాదు
నీళ్ళ వాటాకు

కన్నీరు-
కారేది కన్నుల్లోనుండయినా
ఊరేది
గుండెల్లో నుండే

తలతెగిన
ఒంటరి తాటిచెట్టు
కరువు రైతుల
స్మారక స్థూపంలా...

నీరివ్వడంలో
నోరెల్లబెట్టిన బోరు,
చిన్నారిని మింగి
కన్నీరు తాగింది

# జడపదార్థం

ఎన్. అరుణ

నన్ను నేను తొలుచుకుంటూ
లోపలికి
హఠాత్తుగా
ఓ పద్యం చేతికి

రాళ్ళ గుట్టలో కూడా
ఒక సందేశం ఉంది
అదే
సమతూకం

ఈ పెన్సిల్
అరిగిపోవచ్చుగాక
కాని
నా పేరులో బతుకుతుంది

ఒకే కెరటం
రెండుగా విరిగింది
స్నేహ భంగానికి
కారణం ఎవరో!?

నీళ్లు
ఊళ్లకు ఊళ్లనే నమిలేశాయి
తప్పంతా
నీళ్లదేనంటావా

కాయ, కష్టాల్ని
తెలిపేది
పిల్లల వీపుపై
కాన్వెంట్ పుస్తకం

అలవాటు లేనివాడు
అడ్డగాడిద
అంటోంది
నేటి గుట్కా

కాలం ఎప్పుడూ
తిరుగుతూనే
ఉంటుంది అలుపెరగని
అమ్మలా...

తిట్టినా కొట్టినా
చలనంలేని
జడపదార్థమే
నా(నే)టి ఆడది

పుస్తకాల ఆలయం
గ్రంథాలయం
దోమల ఆలయం
వైద్యాలయం

చీర వుంటే
తల్లి పాత్ర
అది తీసేస్తేనే
హీరోయిన్ పాత్ర

ఐదేళ్ళకోసారి
నాయకుల మాటలకు
నోటు చూసి
లేచేదే ఓటు

ఎన్నికల ముందు
చేసే వాగ్దానాలు
అందని ఆకాశానికి
నిచ్చెనలు

వృక్షాలు గాలిలేక
ఉక్కిరి బిక్కిరౌతున్నాయి
కాలుష్య ధాటికి

మనిషి జీవితాన్ని
సెల్ నియంతలా
శాసిస్తోంది
ఇది వాస్తవం

న్యాయం నల్లకోటులో
ధర్మ దేవత
నిజంగా భయంతో
దాక్కుంది.

# పిచ్చిపిల్ల



అవ్వా! అవ్వా! అయ్యా అమ్మ రేపు వస్తారే! నిజం చెప్పే, ముసలిదాన్ని కుదుపుతూ అడిగింది ఆరేళ్ళ లక్ష్మి. ఏం చెప్పాలో అర్థం కాక ఆకాశం కేసి బిత్తరచూపులు చూస్తూ కంట తడిపెట్టుకుంది రాములమ్మ. రోజూ ఇదే వాలకం నీ అమ్మ అయ్య రేపు వస్తారు లేవే చెప్పడం, ఊర్లోకి పొద్దున మబ్బున వచ్చే ఎర్ర బస్సు వచ్చేవరకు చూడటం, బస్సులోంచి దిగిన వాళ్ళను ఎగాదిగా చూడటం. రోజూ అదే పనైంది లక్ష్మికి.

జనజ్వాల

పల్లెల్లో పనుల్లేక, తినడానికి తిండి దొరకక ఆ ఊరోళ్ళంతా దేశం పోతుండ్రు. అందులో ఆరేళ్ళ క్రితం మూడునెలల పసికూన లక్ష్మిని తన తల్లి రాములమ్మ చేతిలో పెట్టి తండ్రి రాజయ్య, భార్య వెంకటమ్మతో పాటు ఊరి గుంపు మేస్త్రి భద్రయ్య సర్వీసు బస్సులో దేశం పోయిండు భద్రయ్య. పోయినోళ్ళు పోయిండ్రు కాని వాళ్ళు మాత్రం తిరిగి రాలేదు. అసలు, వాళ్ళు భూమి మీద ఉంటే కదా తిరిగి రావడానికి. ఎప్పటికి రారన్న సంగతి గుంపు మేస్త్రి భద్రయ్యకు, రాములమ్మకు, ఆ ఊరి పెద్దలకు మాత్రమే తెలుసు. మట్టిగడ్డలు తవ్వుతూ పై మట్టి కొండలు కూలి అక్కడికక్కడనే చచ్చిన ఐదుగురిలో ముగ్గురు రాములమ్మ మొగుడు, కొడుకు కోడలు అన్న సంగతి భద్రయ్య మేస్త్రీ చెబితే గాని తెలిసింది.

ఊర్లో వర్షం లేదు, పల్లెలోని చెరువులు, కుంటలు, బావులు ఎండిపోయినవి. కానీ ఎక్కడి నుండి వచ్చిందో రాములమ్మ గుండెలో ఊట, కళ్ళ వెంట ఒకటే ఊకదాటిగా కన్నీటి వర్షం. తనవాళ్ళు సచ్చిండ్రని మేస్త్రి భద్రయ్య చెప్పినపుడు తనలోని వర్షం పిడుగాళ్ళ వర్షంగా మారి అయ్యో! దేవుడా! నేనెందుకు బతకాలి? ఎవరికోసం తండ్రీ! అంటూ ఆ పిడుగాళ్ళ వర్షమే ఆ గుడిసెను చుట్టుముట్టింది. చచ్చిపోవాలని అనుకుందేమో కానీ, గుడిసె ముందల మట్టి ఇసుకలో ఒక కాలుపెట్టి ఇసుక గూళ్ళు కట్టుకుని ఆడుకుంటున్న లక్ష్మి తన కన్నీటి మబ్బుల్లోంచే కనిపించింది రాములమ్మకు, చిన్నపిల్ల ఈ పిల్లను ఎవరు చూస్తారు, చంటిది "ఆగమై"పోతుంది కదా! అనుకునే లోపల వర్షం తగ్గుముఖం పట్టింది.

తనవాళ్ళు చచ్చిపోయినందుకు 50వేల రూపాయలు ఇస్తానన్నాడు గుంపు మేస్త్రి భద్రయ్య. ముందుగా ఇవి ఉంచుకో అని 15వేల రూపాయలు చేతిలో పెట్టి కాగితాలపై రాములమ్మ వేలిముద్రలు వేయించుకుని వెళ్ళిపోయాడు భద్రయ్య. తనవాళ్ళు లేని ఆ రూపాయలు ఏం చేసుకోవాలో అర్థం కాక చంటిదైన లక్ష్మిని చూస్తూ, దానికోసం ఏమైనా చేయాలని దిగులు దిగులుగానే ఒక బర్రె, ఒక ఆవును, ఒక దూడను పెబ్బేరు సంతకు పోయి బేరమాడి కొని తెచ్చుకుంది రాములమ్మ. తనవాళ్ళను వాటిలో చూసుకుంటూ వాటిని పోషిస్తూ, వాటిపై ఆధారపడి కాలం వెళ్ళబుచ్చుతుంది రాములమ్మ. కానీ, కాలంతో పాటు లక్ష్మి కూడా పెరుగుతూ వచ్చింది. అప్పుడే దానికి ఆరేళ్ళు. దాని వయసుతో పాటు ప్రశ్న కూడా

బలంగానే పెరుగుతూ వచ్చింది. అప్పటి నుంచి ఒకటే వాలకం. తన అవ్వతో అదే ప్రశ్న అమ్మ అయ్య ఎప్పుడు వస్తారని? జవాబు తన ప్రశ్నకు ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కాక, నిజం చెప్పితే చంటిది తట్టుకోదని, గుండె పగిలి చస్తుందని చెప్పలేక చెప్పలేక ఈ నెల ఆ నెల అంటూ ఆఖరికి అబద్ధాల రేపును సృష్టించింది రాములమ్మ.

సూర్యుడు రావడం, చంద్రుడు పోవడం, ఆ ఊర్లోకి ఎర్ర బస్సు పొద్దున, మాపున రావడం, పోవడం, అప్పుడెపుడో 'ఓ స్త్రీ రేపురా!' గోడల మీద రాసుకున్న రాతల్లాగే రేపులు వచ్చిపోతున్నాయి ఆ ఊర్లోకి.

ఆశల ఎదురీతలో, రేపుల అబద్ధాలలో లక్ష్మి అయ్యా అమ్మ సంగతేమిటో కానీ, దాని వాలకం చూసి ఊరివాళ్ళంతా 'పిచ్చి పిల్లా', 'పిచ్చి పిల్లా' అనడం మొదలు పెట్టారు. 'పిచ్చి పిల్లా', 'పిచ్చి పిల్లా' అన్నపుడల్లా ఎక్కెక్కి ఏడవడం లేక బిత్తర చూపులు చూడటం తప్ప 'పిచ్చి' అంటే ఏమిటో తెలియదు లక్ష్మికి. తన అయ్యా అమ్మల మీద ధ్యాస తప్ప.



లక్ష్మి అనే పేరు పోయి పిచ్చిపిల్లా అనే పిలుపులకు అలవాటుపడి అపుడే నాలుగేళ్ళు గడిచి పోసాగాయి. రేపుల అబద్ధాల సృష్టి మెల్ల మెల్లగా తొలగి పోవడం అపుడపుడే మొదలవుతుంది. ఇంకా అయ్యా అమ్మ రారా, గాలిలో ఎక్కడికి పోయింద్రు, ఏమైంద్రు అని ఆలోచనలు రావడం జరుగుతుంది లక్ష్మికి.

ఉన్నట్టుండి ఒకరోజు గుంపు మేస్త్రి భద్రయ్య కొడుకు బహిరికి పోతున్న లక్ష్మిని అడ్డగించి ఏమే! పిచ్చిపిల్లా! నాతో వస్తావా నీ అయ్యా అమ్మను సూపిస్తా అని లక్ష్మి చేయి పట్టుకున్నాడు. ఏమయ్యా! గెట్లా ఉంది ఒళ్ళు మా అవ్వకు చెపుతా. రేపు నా అయ్య అమ్మోళ్ళు వస్తుంద్రు. అప్పుడు చెబుతాను నీ సంగతి అని లక్ష్మి వాడు పట్టుకున్న చేతిని దులిపిచ్చుకుంది.

పిచ్చిపిల్లా! నిజంగా నీవు పిచ్చిపిల్లవే. దేశం పోయి నీ అయ్యా అమ్మ ఎపుడో చచ్చిపోయింద్రు గదనే అన్నాడు భద్రయ్య కొడుకు. రాములమ్మ అబద్ధాల సృష్టిని బద్దలు కొడుతూ.

ఎవరో కళ్ళల్లో కారం చల్లినట్లు, గుండెలపై బాదుతున్నట్లు అనిపించింది లక్ష్మికి. అప్పటికి పరుగు పందెం పెట్టి ఉంటే లక్ష్మికి ఫస్టు ప్రైజు వచ్చి ఉండేది. పరుగెత్తుకుంటూ వచ్చిన లక్ష్మి ఒసే! ముసలిదానా! ఏడ సచ్చినావే! గిన్నాళ్ళు నా అయ్య అమ్మ సచ్చిపోయిన సంగతి ఎందుకు దాచిపెట్టినావే ముసలిముండా! అరవసాగింది. ఆ అరుపులకు ఒక్కసారి ఉలిక్కిపడ్డ రాములమ్మ గుడిసెలోంచి గుమ్మం దగ్గరికి వచ్చి చూసేసరికి ఇంకేముంది? ఎగిసిపడుతున్న ఎదలతో, ఎర్రబడ్డ కళ్ళతో అమ్మోరును చూసినట్లుంది రాములమ్మకు లక్ష్మిని చూసేసరికి. ఏమైంది! బిడ్డా! ఏమైందే నా తల్లికి అంటూ రాములమ్మ అడుగు ముందుకు వేసే లోపలనే ఒసేయ్! ముసలిముండా అని అరుస్తూ మట్టిని తీసుకుని నెత్తిమీద పోసుకుంటూ, రాములమ్మ మీద పోస్తూ క్రిందపడి స్పృహ తప్పిపోయింది లక్ష్మి.

ఏమైందే నా పిల్లకు నా బంగారు తల్లికి అంటూ ఎదలు బాదుకుంటూ ఎక్కెక్కి ఏడవసాగింది రాములమ్మ. దుఃఖసాగరంతోని ఆ రాత్రి గడిచిపోయింది. కోడికూయ లేదు గాని సూర్యుడు మాత్రం ఏదో తప్పిపోయిన వానిలా వచ్చిండు. లక్ష్మికి మాత్రం స్పృహ వచ్చింది కానీ బిత్తర చూపులు చూస్తూ పండ్లు పట పట కొరుకుతూ ఏవో పిచ్చి అరుపులు అరుస్తుంది. ఆ ఊరిలోని ఆర్ఎంపి డాక్టర్ వచ్చి పట్నానికి అర్జెంటుగా తీసుకుపొండి అని చెప్పడంతో రాములమ్మ ఆ ఊర్లోని వెంకటరెడ్డి దొర కాళ్ళమీద పడటంతో దొర దగ్గర ఉన్న ట్రాక్టరును కొంత డబ్బును ఏర్పాటు చేసిండు. ప్రామిసరీ నోటు మీద కొన్ని తెల్ల కాగితాల మీద వేలిముద్రలు వేయించుకున్నాడు దొర.

చదువుకున్న ఇద్దరు దుడ్డెగాళ్ళను బతిమిలాడి వారి తోడుతో లక్ష్మిని కర్నూలు ప్రభుత్వ ఆసుపత్రికి తీసుకుపోయింది రాములమ్మ. డాక్టర్లు లక్ష్మిని పరీక్షించి ఈ పిల్ల బాగా మెంటల్‌గా అప్‌సెట్ అయింది కొద్ది విశ్రాంతి కావాలి, తలకు కరెంట్ షాక్ కూడా ఇవ్వాలి, ఎందుకైనా మంచిది హైదరాబాద్‌కు తీసుకుపోండని చెప్పింద్రు. ఏముందీ! హైదరాబాద్ నీలోఫర్ ఆసుపత్రి వాళ్ళు ఎర్రగడ్డ ఆసుపత్రికి పేషెంట్‌ను రిఫర్ చేశారు. ఇంకేముంది ఎర్రగడ్డ ఆసుపత్రిలో లక్ష్మి 'పిచ్చిపిల్ల'గా, ఆవు, దూడ, బర్రె గుడిసె అమ్ముకుని అప్పు తీరని పాలమూరు పల్లె చెట్టు కింద రాములమ్మ కరువు బతుకులకు ప్రతినిధులుగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు.

# జీవన్మరణం

## పోలవరం గిరిఘోష



కవిత్వానికి మౌలికంగా చైతన్యం కావాలి. కథకు జీవితపు వివిధ కోణాలను చూడగల అంతర్ దృష్టి అవసరం. కవిత్వానికి కావలసినంత చైతన్యాన్ని, కథారచనకు కావల్సినంత జీవిత విభిన్న చిత్రాలను మేం వారి నుండి పొందాము. అంతా మేం తెలుసుకున్నదే వున్నది. వారి లయబద్ధ మాటల్లోని స్పష్టత, ధిక్కారము, ధైర్య సాహసాలు, మానవీయ ప్రాధేయతలు మమ్ములను కదిలించాయి.

**కె. ఆనందాచారి**

"మా బతుక్కి మీరేం జెస్తరు? ముందది చెప్పండి" వరరామ చంద్రాపురం మండలం (భద్రాచలం డివిజన్)లోని మారుమూల ప్రాంతపు పోచవరం ఆదివాసీలు మాకు వేసిన ప్రశ్నకు మేం కొంత ఆలోచించి చెప్పాల్సి వచ్చింది. "మీ బాధల్ని, 'పోలవరం' వల్ల మీకు జరిగే నష్టాన్ని అందరికీ చెప్పి, మీరు చేసే పోరాటానికి మా సాయంమూ అందిస్తామన్న తరువాత వాళ్ళు మాతో మాట్లాడారు.

జనవరి ఎనిమిది, తొమ్మిది తారీకుల్లో ఖమ్మంజిల్లా సాహితీ స్రవంతి ఆధ్వర్యాన ఇరవై మంది కవులూ, రచయితలం 'పోలవరం' వల్ల మునిగే ప్రాంతాలైన కుక్కునూరు, వేలేరుపాడు, భద్రాచలం, కూనవరం, వి.ఆర్. పురం, చింతూరు మండలాల లోని యిరవై గ్రామాలు పర్యటించాము. అక్కడి గిరిజనుల, గిరిజనేతరుల మనోభావాలను, ఆవేశాలను, ఉద్వేగాలను తెలుసుకున్నాము. బోలెడంత చైతన్యాన్ని నింపుకున్నాము.

పోలవరం ప్రాజెక్టు వల్ల మొత్తం ఏడు కొండు మండలాలు ముంపుకు గురవుతుండగా అందులో ఏడు మండలాలు ఖమ్మంజిల్లాలోనే. అవన్నీ ఏజెన్సీ ప్రాంతాలే. ఎనభై శాతం ప్రజలు ఆదివాసీలు. రెండు వందలకు పైగా గ్రామాలు, రెండు లక్షల మంది ప్రజలు, రెండు లక్షల ఎకరాల సాగుభూమి, తొంభైవేల ఎకరాలలోని అటవీ భూమి, అందులోని అటవీ సంపద మునిగిపోతున్నది. రాజ్యాంగం గిరిజనులకు రక్షణ కల్పించే ఐదవ షెడ్యూలు ప్రాంతంలో వున్న వీరు చెట్టు పుట్టలు వీడి ఎడారి మైదానాల్లోకి నెట్టబడతారు. ఆదివాసీల సంస్కృతి, సంప్రదాయాలు, వారి మధ్య వున్న సంబంధాలు విచ్ఛిన్నమవనున్నాయి. ప్రకృతి రమణీయ పాపికొండలు, రెండు వందలకు పైగా చారిత్రక కట్టడాలు, ప్రాచీన ఆలయాలు కనుమరుగు కానున్నాయి. ఇంత పెద్ద ఎత్తున నష్టానికి గురవుతున్న ప్రాంతాలు గల జిల్లాలోని కవులంగా, రచయితలంగా స్పందించాల్సిన కనీస బాధ్యతతో ఆయా ప్రాంతాలు సందర్శించాము.

కవిత్వానికి మౌలికంగా చైతన్యం కావాలి. కథకు జీవితపు వివిధ కోణాలను చూడగల అంతర్ దృష్టి అవసరం. కవిత్వానికి కావలసినంత చైతన్యాన్ని, కథారచనకు కావల్సినంత జీవిత విభిన్న చిత్రాలను మేం వారి నుండి పొందాము. అంతా మేం తెలుసుకున్నదే వున్నది. వారి లయబద్ధ మాటల్లోని స్పష్టత, ధిక్కారము, ధైర్య సాహసాలు, మానవీయ ప్రాధేయతలు మమ్ములను కదిలించాయి. నాగరికతలోని కాలుష్యపు వాయువులు వీస్తున్నప్పటికీ ఇంకా అడవితల్లి ఒడిలోనే సేద తీరుతూ ఆదిమానవుని పాద ముద్రికల ఆనవాలుగా మిగిలిన ఆదివాసీల ఆలోచనలు, జీవన పద్ధతులు నిజంగా ఎంతో చైతన్యపూరితంగా కొనసాగటాన్ని వీక్షించగలిగాము.

తిరిగిన అన్ని ప్రాంతాలలోని గిరిజనులు, గిరిజనేతరులు అందరూ ముక్తకంఠంతో ప్రాజెక్టును వ్యతిరేకిస్తున్నారు. వారు వ్యతిరేకించడానికి కారణాలనూ విశదపరుస్తున్నారు. అంతేకాదు మేము ప్రాజెక్టులకు వ్యతిరేకం కాదని, మమ్ము ముంచే ప్రాజెక్టు కన్నా మమ్ము పెంచే ప్రాజెక్టులు కట్టమని, మా బతుకులు ముంపుకు గురి కాకుండా వుండే మరో పద్ధతిని ఆలోచించండని వారు విన్నవిస్తున్న తీరు న్యాయంగా అనిపించింది.

ప్రాజెక్టును గురించిన, అడవితో వారికున్న బంధాన్ని గురించిన అభిప్రాయాలు వారి మాటల్లో చూద్దాము.

"ఇక్కడే పుట్టినం, ఇక్కడే పెరిగినం, ఇక్కడే చస్తం!" "చస్తే ఈ గోదావరిలోనే", "కోతులు కొండముచ్చులు ఈ చెట్లపై ఆకులు అలములు తిని బతకటం లేదా! అట్లనే బతుకుతం, ఈ అడవి వొదిలిపోం!" (రాజమ్మ - టేకూరు, వేలేరుపాడు), "బయటికెళితే ఒక్కరమూ బతకం, మా పిల్లలు ఇప్పుడిప్పుడే అభివృద్ధిలోకి వస్తాండ్రు, మా బతుకు బజార్లేయొద్దు" (కచ్చాల వెంకటరెడ్డి - కట్కూరు), "మా భూమి బంగారం, ఇత్తులు చల్లితే పంట చేతికొస్తది, ఇట్లాంటిది మాకెక్కడా దొరకదు, ప్రాజెక్టు కట్టొద్దు" నష్టపరిహారాల గురించి వారిలా అన్నారు.

"డబ్బులతో ఆశ లేదు - భూమి పైనే ఆశ (కెచ్చుల శాంతమ్మ, కోయిద), "నష్టపరిహారం ఇచ్చే పని కాదు", "ఎక్కడికి పోయినా బతకలేము, ఆశపెట్టి పంపేయాల చూస్తును, ఎన్ని ఎకరాలిచ్చినా ఈ భూమికి సాటి రాదు, వాళ్ళిచ్చే డబ్బులు మా చావుకే, గోదారి వరదలొచ్చినపుడు మంచిగనే వున్నాం,

ఇపుడు మా వూరంతా దిగులు పడుతోంది!" (నాగుల రామారావు, ముత్తిబోయిన కృష్ణ, వెంకటరెడ్డి).

"మా రాజ్యానికి మేమే రాజులం, ఎవ్వరిది వారికే కావాలి, పోరాటం చేస్తం, భూమికి భూమిచ్చినా మాకొద్దు! మా భూమి పోతే మా బతుకు పోదది. తాటిచెట్టు గీస్తే నెల బతుకుతం" అక్కడ ఏం దొరుకుతుంది? ఊరోళ్ళందరమూ ఒకే మాట, ప్రాజెక్టు వద్దంటున్నాము'' (కనక రాజేశ్వరి, కరకగూడెం). ఈ గ్రామంలో సర్వేకు నందిగాంకు వెళ్ళగానే మాకొక బోర్డు కనిపించింది. "హెచ్చరిక : పోలవరం ప్రాజెక్టు పనిపై వచ్చే అధికారులకు గ్రామంలోకి ప్రవేశం నిషేధించబడింది" – ఇట్లు గ్రామ రక్షణ కమిటీ" అని రాసి వుంది.

కొన్ని గ్రామాల్లో ప్రాధేయపడుతూ బాధలు చెప్పుకున్నారు. "మీ దండం పెడతా మమ్మల్ని కాపాడండి!", "ఈ ప్రాజెక్టు కట్టొద్దని చెప్పండి" అని పోచవరంలో ముర్ల కృష్ణారెడ్డి, కొట్ల కన్నంరెడ్డి వేడుకున్నారు. "పోటానికి మాకిష్టంలేదు. పోరాటం చేస్తాం! విల్లంబులతో ఎదురుపడతాం! మా ఇంటింటికీ ఒక్కొక్క విల్లు, ఐదు విల్లమ్ములున్నవి. ప్రాణాలు పోయినా ఇక్కడే పోవాలి. బయటికి పోయి రోజూ చచ్చుకుంట బతికే కంటే ఒక్క రోజేన చస్తం!" (కథలు కొండయ్యరెడ్డి, వెంకన్న, జీడిగుప్ప, కోయిద) అంటూ ధిక్కార స్వరాన్ని వినిపించారు.

"గిరిజనులతో కలసి మెలసి పోడుగొట్టి మేమూ బ్రతుకుతున్నాము. ఇక్కడి అడవిలో భూమితో కలిసి పోయాము. 1969 లోపువారికి తప్ప మా ఇండ్లకూ, భూమికీ పట్టాల్లేవు. మాకే నష్టపరిహారమూ రాదు. ఆదివాసీలతో కలిసి ఆయుధాలు పట్టుకుంటాము!" (బండమూరి రాంబాబు, కందుల శ్రీనివాసరావు) అంటూ నందిగామలోని గిరిజనేతరులూ పోరాటానికి సిద్ధమంటూ ప్రాజెక్టును వ్యతిరేకించారు. అయితే వేలేరుపాడు, కుక్కునూరు ప్రాంతాలలోని గిరిజనేతరులు సరైన నష్టపరిహారాన్ని ముందుగా ఇస్తే ఆలోచిస్తామని చెప్పారు. కూనవరం మండల ప్రజా పరిషత్ అధ్యక్షుడు పాయం వెంకయ్యను కలిశాము. ఆయన రాష్ట్ర ప్రాజెక్టు నిర్వాసితుల సంఘానికి అధ్యక్షుడు కూడా. అతనేమంటున్నాడంటే – కొన్ని వందల యేండ్ల నుండి మేం ఇక్కడ నివసిస్తున్నాము. ముంపుకు గురయ్యే ప్రజలు, గ్రామ పంచాయతీలు తీర్మానం చేసి రాష్ట్రపతికి పంపాము. చట్టానికి వ్యతిరేకంగా ప్రభుత్వం

----------★★★★----------

**ఈ పర్యటన మాకు సమాజం పట్ల బాధ్యతను మరోమారు గుర్తు చేస్తూ చైతన్యాన్ని అందించింది. కొండలు, లోయలు, ప్రకృతి అందాలు, గోదావరి శబరి సంగమ సోయగాలు అంతే అందంగా వున్న అక్కడి ప్రజల జీవన లయలు ఛిద్రం చేయబూనడం నేరమనిపించింది.**

----------★★★★----------

మా హక్కుల్ని కాలరాస్తోంది.

సంవత్సరంలో ఐదు నెలలు అటవీ సంపదలపైనే ఆధారపడి గిరిజనులు బ్రతుకుతారు. వేరేచోట ఇవేవీ దొరకవు. షెడ్యూలు ఏరియాకు రక్షణ లేదు. ఇపుడున్న సంస్కృతులు దెబ్బతింటాయి. సంవత్సరానికి ఐదుసార్లు పండుగ చేసుకుంటాము. పండగ చేసినపుడు అందరమూ కలుస్తాము. మంచీ చెడులు అందులో చర్చించుకుంటాము. ఎవరికి నష్టం జరిగినా ఊరువాళ్ళు ఇంటి కింత వేసుకుని ఆదుకుంటాము. మాది గుంపు సంస్కృతి. ఇది విచ్ఛిన్నమైతే మా సంస్కృతి అంతా నశిస్తుంది. మానవ సంబంధాలు, సంప్రదాయాలు మాలో ఏ విధంగా ఉన్నాయో ప్రభుత్వం పరిశీలించాలి. అందరికీ ఒకే చోట పునరావాసం ఇవ్వలేరు.

ప్రాజెక్టు కడతారో లేదో ఎప్పటి మాటోగానీ ఇప్పుడే దాని ప్రభావం మా సామాజిక జీవితంపై పడుతోంది. ముంపుకు గురయ్యే ప్రాంతాలలోని మగపిల్లలకు పెళ్ళిళ్ళు కావడం లేదు. పిల్లనిచ్చేందుకు ఎవరూ ముందుకు రావడం లేదు. కొన్ని పెళ్ళిళ్ళు రద్దయ్యాయి. ప్రభుత్వానికి అనుకూలురైన వారితో గోబెల్స్ ప్రచారం చేస్తున్నారు. ప్రజలను భయపెడుతున్నారు. నిర్బంధానికి పూనుకొంటున్నారు. గిరిజనుల అభివృద్ధి కోసం ఏర్పాటుచేసిన ఐ.టి.డి.ఎ.లు కూడా ద్రోహం తలపెడుతున్నాయి. గిరిజనులు ప్రాజెక్టులకు వ్యతిరేకం కాదు. ధవళేశ్వరంలాంటి పద్ధతిలో కట్టాలి. ఈ ప్రాంతం మునగకుండా ఇరవై మూడు లక్షల ఎకరాలకు నీరందించే విధంగా దుమ్ముగూడెం ప్రాజెక్టు నిర్మిస్తూ, పోలవరం ముంపులేని విధంగా ప్రత్యామ్నాయాన్ని ఆలోచించాలి. లేదంటే అడ్డుకోవడానికి సర్వశక్తులూ ఒడ్డుతామని సవివరంగా తెలిపారు.

గ్రామాలు తిరిగి వస్తూనే భద్రాచలంలో ముంపు ప్రాంతాల ప్రజల పోరాటానికి సంఘీభావం తెలుపుతూ సభ పెట్టాము. "పోలవరం – కవుల స్వరం" పేర కవితా గోష్ఠి నిర్వహించాము. ఇందులో పర్యటనలో పాల్గొన్న వారి స్పందన ఈ విధంగా వుంది. "తన పిల్లల్ని తానే తింటున్న పాములా ఒక్కొక్క పల్లెను కబళిస్తుంది. డ్యామ్, తుపాన్‌లో చిక్కుకున్న జీవుల్లా ముంపు గ్రామాలు గొంతెత్తి రోదిస్తుంటాయి", "వేణువైన వెదురు విల్లంబై లేస్తుంది!" గోచి పాతల ఆదివాసులు పాత గోచీలతో వింటినారి కడుతున్నారు" అని షకూర్ స్పందించగా "ప్రాజెక్టులంటరు, ఫలితమిస్తయంటరు ఎవరికయ్యా! ఎద్దు పుండు కాకికి ముద్దు కాక ఏమయితది?" అని వారి బాధల్ని పలకించాడ కటుకోజ్వల రమేశ్. ఊరికి నిప్పంటుకుంటే నీళ్ళు పోసే వాళ్ళం, ఇపుడు ఊళ్ళక నీరంటుకొంటోంది ఏం చేయాలి?" అని శేషగిరి ప్రశ్నించాడు.

"నది ఇపుడు ప్రకృతి కాదు సరిహద్దుల్ని చెరిపేసిన కన్నీమరుగూడు. కొండ చిలువ నెదిరించడం కొత్త కాదు మాక ప్రయత్నపూరిత ప్రళయాలకు ప్రతిఘట ఆనకట్ట!" అని నినదించారు ఆనందాచా దుఃఖాశ్రువులే దావానలమవుతాయని కోయిదా కోమలి పూనిక, విధ్వంసా ప్రతిఘటించే వివేక చూడామణి నాలుక, ఇ ఆదివాసీల హెచ్చరిక" (కాసర్ల రంగారావ "అడవిలో దొంగలు పడ్డారు" (హనీష్ "ఆనాడు రెడ్ ఇండియన్‌లు వేసిన ప్రశ్న ఇప ఆదివాసీలు చేస్తున్నారు" (విద్యాసాగ "పాపికొండల రమణీయ అందాల్ని మింగేస బహుళజాతి సంస్థలకు లాభాలు అందిస (జీవన్) బహుళార్థక సాధక ప్రాజెక్టు కా బహుళార్థ బాధక ప్రాజెక్టు" (సాధనాల), " ప్రభుత్వ సునామి" (రౌతు రవి) అం ప్రతిస్పందించారు. హనుమాన్, మం సుబ్బారావు, మాల్యశ్రీ, శిరంశెట్టి కాంతార దుర్గాచారి, సూర్యకుమారి, కవిత, పోత సత్యనారాయణ, ఐ.వి. బాలు, లె శ్రీనివాసరావు తమ తమ అనుభూతు కలబోసుకుంటూ ఆదివాసీలకు సం మద్దతు ప్రకటించారు.

ఈ పర్యటన మాకు సమాజం బాధ్యతను మరోమారు గుర్తు చేస్తూ చైతన అందించింది. కొండలు, లోయలు, ప్ర అందాలు, గోదావరి శబరి సం సోయగాలు అంతే అందంగా వున్న ప్రజల జీవన లయలు ఛిద్రం చేయబూ నేరమనిపించింది.

('ఆంధ్రజ్యోతి' వివిధ సౌజన్య

★ వ్యాస రచయిత ఖమ్మంజిల్లా సాహితీ స్రవంతి

# జనవరిలో ఢిల్లీలో

అద్దేపల్లి రామమోహనరావు

ంచు ఆకాశాన్ని కప్పుకుని
సూర్యుడు నిద్రపోతాడు
పన్నెండింటికో మాగన్నుగా
స్తే లేస్తాడు, లేకపోతే లేదు
ల్లాలు ఆరేసిన బట్టలు
న్నో రోజులుగా మంచు తింటూనే
రక్క అలా పండి ఉంటై
న్నెలో కరగబెట్టిన నెయ్యి
న్నంలో వేసుకునే లోపల
లి కౌగిట్లో గడ్డ కట్టి పోతుంది
లకు రాసుకునే నూనె
క్కలుగా పగలగొట్టమంటుంది
ద వేసుకునే పరుపుతీసి
పైన కప్పుకు పడుకున్నా
యోగంతో మండిపోయే మంచు
రాన్ని చేరడానికి
న్లలు వెతుకుతూనే ఉంటుంది
సుకి పదింటికి పోవలసినవాడు
మ్మిదింటినించి
ల్ని తలపైన కొట్టి ఆపుతూ
తొమ్మిదిన్నరకో క్షణాల
తోపులాటలకి లొంగిపోయి
చుకళ్ళతోనే
సగం సగం పనులు చేసుకుని
రికీ కనిపించే ఆకాశాన్ని మాత్రం
ంగా ముస్తాబు చేసుకుని
టికి అడుగు పెడతాడు
నడిచినా ఒళ్ళు వేడెక్కదు
కప్పుకున్నా చలి వదిలిపోదు
ని బీరులా తాగిన బీరెండ కూడా
వేడిని మరచిపోతుంది
ని గంజాయిలా పీల్చిన గాలి
న్ని కొరుక్కుతింటూ ఉంటుంది
బూటూ తొడిగిన బిచ్చగాడు కూడా
కారులోంచి దిగిన
రుడిలా కనిపిస్తాడు
ాద కోసం
నిండా రికామీగా కూర్చున్న జనం
కోవడమే ఉద్యోగంగా కనిపిస్తారు

కొందరు మంచు తాగి మత్తెక్కినట్లు
నేలపై అంగాలు రాల్చి
అలా పడి ఉండిపోతారు.
కొందరు ఎండపొడ మీద కళ్ళనతికించి
చూపుల్తో ఆకాశాన్ని చుట్టబెడుతూ
శూన్యంలో నిశ్చైతన్యాన్ని ఆరబెడతారు
సూర్యకిరణాల్ని పీల్చకపోవడం చేత
అందరూ
స్లోమోషన్‌లో కదుల్తూనే కనిపిస్తారు
పేద కూలీలకు కోట్లు లేవు
చెప్పులు కుట్టేవాళ్ళకు కోట్లు లేవు
రోడ్డు పక్క చాయ్ కాచే
కుర్రాళ్ళకు కోట్లు లేవు
వాళ్ళ బతుకులిచ్చే
వేడి మాత్రమే వాళ్ళకి సూర్యచర్మం
సూర్యుడికీ మంచుకీ పోరాటం
ఈనాటిదా?
చైతన్యాన్ని జడత్వం తుడిచిపెట్టడం
ఉష్ణ రక్తాన్ని వ్యాధి చల్లగా పీల్చడం
రుతువృక్షం చుట్టూ
వసంతం, హేమంతం
దాగుడుమూతలాడటం
బతుకుని మరణశైత్యం ఆక్రమించడం
సామాజిక సంఘర్షణలనిండా
ప్రతీకాత్మకంగా వ్యాపించి
గెలుపోటముల్ని పంచుకుంటూ
కొనసాగుతున్న నిరంతర
జిగీషా స్వరూపాలవి!
మంచు భాష సూర్యుడికి తెలుసు
సూర్యుడే మంచుకి
చల్లగా మాట్లాడే భాషనిచ్చాడు
సూర్యుడి భాష మంచుకి తెలియదు
మంచుకి వెచ్చదనం నాడి తెలియదు
నెత్తురులో ఇంకిన సూర్యుడు
శరీరపు అణువణువునా నిండినప్పుడు
దాడి చేసే మంచు, నీరు కారిపోతుంది
లోపలి ఎండమాత్రం
మనిషిని చుట్టే రక్షా కవచమౌతుంది

# కుడి ఎడమల కౌటిల్యం

అడిగోపుల వెంకటరత్నమ్

శాంతి రేపనే బోర్డు ప్రశాంతంగా
ఆయుధాల వర్తకుడి అంగట్లో
వేలాడుతుంది
అప్పు రేపును జ్ఞప్తిస్తుంది!
నరమేధం చేతులు
నెత్తుటి మరకలపై ధవళ వర్ణం కప్పి
నోబుల్ శాంతి బహుమతి
అందుకుంటాయి
ఉత్పత్తిదారుడే విక్రయదారుడైనప్పుడు
రిటైల్ టోకు ధరలు రాకెట్లను ఓడిస్తాయి
మరణించిన మానవ సంబంధాలు
వ్యాపార బీజాలై మొలకెత్తుతాయి
పరోక్షం ప్రత్యక్షమై
ఆయుధం నేపథ్యమై
భూగోళం ఖగోళం
నిట్ట నిలువునా దోపిడి!
శాంతంగా ప్రశాంతంగా
నల్లేరు మీద బండిలా సాగే
విదేశీ ఆంతరంగిక వ్యవహారాల్లో
వేయి పడగల వేర్పాటువాద
ఉద్యమ నిర్మాత అతడు!
ఒక జాతికి పత్తేదారై
ఒక జాతికి వత్తాసై
కొమ్ముకాచి అమ్ముపరచి
నటించే ఉత్తమ నటుడు అతడు!
మితవాదం అతివాదం
తెగలు జాతులు
సంస్కృతి సంప్రదాయాల నడుమ
రేఖలు సరిహద్దులు గీసి
రాజేసిన కుంపట్లు రగిలేంతవరకు
దర్శకత్వం వహించే దర్శకుడు అతడు!
ఆయుధం ఆత్మరక్షణై
అందలంపై నిద్రిస్తున్నాడు
నిద్రలేచిన వసుధైక కుటుంబం
నిద్రలేమిని వాడికి ప్రసాదిస్తుంది!

# 'వంటాట'

## అను వంటింటి రాజకీయ కథ



"నీకు వంటొచ్చా?" ఓ మగ గొంతుక అడిగింది.... ఎంతో రుచికరంగా, పరిమళభరితంగా, యిష్టంగా....

కె.ఎన్. మల్లీశ్వరి

ఓరగా తలెత్తి చూశాను. యాభై అయిదేళ్ళ వ్యక్తి ఆత్రంగా నావంకే చూస్తున్నాడు... బహుశా కాబోయే మావగారనుకుంటా... పెళ్ళి చూపుల్లో అలా ఓరగానయినా తలెత్తి చూడొచ్చో లేదోనన్న సందేహం రావడంతో గబుక్కున తలదించుకుని మా అమ్మ వంక చూశాను...

ఆమె ముఖం అప్పటికే విస్తరాకంత వికసించి వుంది.

"మీకు ఆ విషయంలో దిగులు అవసరం లేదు అన్నయ్యగారూ! అరగంటలో అరడజను మందికి అవలీలగా వండి వడ్డించేస్తుంది మా అమ్మాయి... గుత్తొంకాయ కూర వండి పప్పుచారు పెట్టిందంటే మీరు ఆ పూట నాలుగు ముద్దలు ఎక్కువ తిని లేవకపోతే నన్నడగండి..." మరి అమ్మ హుషారుగా వర్ణించుకుపోతుంటే అందరూ గంట కిందట భోజనాలు చేసి బయలుదేరి వచ్చినా మళ్ళీ గుటకలు మింగారు..."

ఈలోపు ఫలహారాల సరంజామా మగపెళ్ళివారికి చేరింది... "అన్నీ మా అమ్మాయే చేసింది..." మా అమ్మ గర్వంగా అంది...

మా కాబోయే అత్తగారికి నమ్మకం కుదరలేదనుకుంటా ఆ పిండి వంటలు ఎలా వండాలో నన్ను అడిగింది... నేనన్నీ వివరంగా చెప్పాను... చివరికి ఆమె సంతృప్తి చెంది...

"...వంటొచ్చిన పిల్లయితే మాకు సుఖం... సమయానికి యింత ముద్ద దొరుకుతుంది మాకు.... లేకపోతే కోడలికి నేర్పుకునే సరికే తలప్రాణం తోకకి వస్తుంది...." అందామె...

అట్లా వంటల గురించి మాటలయ్యాక కట్నాల ప్రసక్తి వచ్చింది.... "అమ్మాయిని లోపలికి తీసుకువెళ్ళండి..." అన్నారెవరో "యిక నీ అవసరం తీరిపోయిందన్నట్లుగా...." నేను లోపలికి వచ్చేశాను.

ఈ సంబంధం అందరికీ నచ్చింది. ఒక్కడే కొడుకు... యిద్దరు కూతుళ్ళు వున్నారు కానీ వాళ్ళకి పెళ్ళిళ్ళయి పోయాయని బాధ్యతలు ఏమీ లేవని... సంతోషంగా పెళ్ళి జరిపించేశారు.

మొదటి రాత్రి మావారు తీపిముచ్చట్లతో పాటు నా బాధ్యతలన్నీ విప్పి చెప్పారు...

"మా అమ్మని తల్చుకుంటే ఎంతో బాధగా వుంటుంది... యిన్నేళ్ళూ మా అందరికీ వండిపెట్టి... ఇల్లు దిద్దుకుని అలసిపోయింది... యిక వంటింటి బాధ్యత నీది... మా అమ్మ మిగతా పనులు చూసుకుంటుంది... అసలు నీలా యింత బాగా వంట చేయగలిగిన భార్య దొరకడం నా అదృష్టం..." మెరుస్తున్న కళ్ళతో నన్ను హృదయానికి హత్తుకుంటూ అన్నారు...

పరవశించి పోయాను నేను... 'పెళ్ళికి ముందు నా స్నేహితురాలు చెప్పిన మాట గుర్తొచ్చింది... 'భర్త హృదయానికి దారి అతని పొట్ట ద్వారానే' అని... వంట బాగా చేయడం' అనే భావాన్ని అంత అందంగా పాక్ చేసినందుకు ఆమె నైపుణ్యానికి అపుడు ఆశ్చర్యమనిపించింది. ఇపుడు... యిదుగో యితను యిలా కౌగిలించుకుంటూ అన్నాక నిజమేననిపిస్తోంది .

పెళ్ళయి అత్తవారింటికి కాపురానికి వెళ్ళాక నెలరోజులు నాకు అలవాటయ్యే వరకూ మా త్తగారే పనంతా చూసుకున్నారు... యిక యిలాగే నసాగుతుందని భయపడ్డారో ఏమో మావారు సాద్... నన్ను హెచ్చరించారు... అంతే! .... ఆ జే కదనరంగంలోకి దూకాను...

"అత్తయ్యా!... మీరిక పూర్తిగా విశ్రాంతి సుకోండి... నేనున్నానుగా వంట పనంతా నేను సుకుంటాను" అన్నాను...

నా మాటలకి ఆమె మురిసిపోయింది... రుగూ పొరుగూతో ఈ మాటలు చెప్పి 'మంచి డల్ని' తెచ్చుకున్నానని గర్వపడింది...



'స్వర్ణ మా కోడలు కావడం మా అదృష్టం' అనేదామె... త నిష్కల్మషంగా నా గురించి చెప్పుకోవడం చూసి మా పుట్టింటాళ్ళు డా ఎంతో సంతోషించారు...

ఇలా నా పాక శాస్త్ర నైపుణ్యం వాడవాడలా వ్యాపించడంతో ంటికి వచ్చిన బంధువులుగానీ, స్నేహితులు గానీ భోజనాల సమయం కూ వుండి భోజనం కానిచ్చే వెళ్ళేవారు... దీనితో స్వతహాగా క్కువగానే వుండేది... రోజులో అయిదారుగంటలు వంటింట్లోనే పాల్సి వచ్చేది...

నేను వండిన వంటలు తింటున్నపుడు మా మావగారు, వారు ఎంతో రుచిగా వున్నాయని పొగుడుతూ తినేవారు... మధ్య య ఎపుడన్నా కూరలోనో, చారులోనో ఎక్కువైన కారం గురించో, ైన ఉప్పు గురించో సున్నితంగా చెప్పేవారు... దాంతో మరింత దల వచ్చి ఏ వంకా పెట్టలేనంత పక్కాగా వండటం మీద అధికంగా పెట్టేదాన్ని...

రోజులిలా బాగానే గడిచిపోతున్నాయి... నేను మా వంటింటి రాజ్యానికి రాణిని కాగా మా అత్తగారు పూజగదికి రారాణి ంది... దాంతో మిగతా పనులూ నా మీదే పడ్డాయి... దానికి ప్రసాద్ కూడా తల్లి ఏ పని చేస్తూ కనపడినా ఒప్పుకునేవాడు ..

"అమ్మా! నువ్వు రెస్ట్ తీసుకో! స్వర్ణ వుందిగా!..." అనేవాడు... అలాంటపుడే ఈయన మీద కొంచెం కోపం వచ్చేది... నలుగురున్న యింట్లో పనిని కలిసి చేసుకోవడం బావుంటుంది... అలా చేస్తున్న ఆవిడని అనవసరంగా ప్రసాద్ చెడగొడుతున్నాడనిపించింది...

తన పూర్తి శక్తి సామర్థ్యాలు వంట మీదే పెట్టడం... దానిని అందరూ పొగడటం... అంతా బాగానే వుంది... కానీ ఎవరు మాత్రం ఎంతకాలం పొగుడుతారు??... పొగిడి.. పొగిడి... వాళ్ళకి మాటలు నిండుకున్నాయి... కానీ వండి వండి... నా వంటకి ముగింపు వుండదుగా... యిక జీవితాంతం యిలాగే వండుతూనే గడిపేయాలన్న వాస్తవం... తరచుగా నిరుత్సాహాన్ని కలిగిస్తోంది...

- - - - -

ఆ రోజు ఆదివారం...

మా వారి కొలీగ్స్ నలుగురు మా యింటికి వచ్చారు... వచ్చే ఆదివారం వెళ్ళాల్సిన పిక్నిక్ గురించి మాట్లాడుకుంటున్నారు... దాదాపు నలభై మంది ఉద్యోగులు... వాళ్ళ భార్యలు, పిల్లలూ కలిపి నూట పదిహేను మంది తేలారు... ఎక్కడికి వెళ్ళాలి?... ఎంత డబ్బు వేసుకోవాలీ అనుకున్నాక... అతి ముఖ్యమైన విషయం దగ్గర ఆగింది చర్చ..

"వంటలు వండించడం... అవీ పెట్టుకోవద్దు... కేటరింగ్‌కి యిచ్చేద్దాం..." అన్నాడు ఓ మంచాయన... ఎంత మంచాయనో!...

కానీ మా యింటాయనకి ఆ మంచాయన సలహా రుచించలేదు...

"ఎందుకండీ అలా!... అసలు పూర్వం వనభోజనాలంటే ఎంత బాగా జరిగేవి... స్వయంగా అక్కడే వండేవాళ్ళు... కొంచెం కష్టమైనా అదే బావుంటుంది... మీరేం వర్రీ అవ్వొద్దు... మా స్వర్ణ వుందిగా. ఎంత మందికైనా చిటికెలో వంట చేస్తుంది. అయినా అంతమంది ఆడవాళ్ళు వుంటారుగా!... తలో చెయ్యి వేస్తారు... వాళ్ళకో కాలక్షేపం అవ్వాలిగా! అక్కడే వండిద్దాం..." అంటుంటే నా గుండెల్లోంచి వస్తున్న నిట్టూర్పుని అణచుకోవడానికి చాలా ప్రయత్నించాల్సి వచ్చింది...

మా వారు చెప్పింది వినగానే అంతటి మంచాయన... ప్రసాద్... కొలీగ్... అతనిలోనూ ఉత్సాహం పొంగి పొర్లింది...

"అయితే యింకేంటి అభ్యంతరం?... చెల్లెమ్మ చేతి వంట తినే భాగ్యం దొరికితే వద్దంటామా?..." అన్నాడు...

పిక్నిక్ రోజు వచ్చింది... ఎలాగూ వంట పనే కదాని నేను కాటన్ చీర తీసి కట్టుకున్నాను... ప్రసాద్ చూసి మొహం చిట్లించాడు...

"యిదేంటీ ఈ చీర కట్టుకున్నావూ?..."

"వంట చేసేపుడు కన్వీనియెంట్‌గా వుంటుందని..." అన్నాను...

"అంటే పిక్నిక్ అంటే వంట చేయడమేనా?... అసహనంగా అన్నాడు.

"మరి??...."

నివ్వెరపోయాడు.... ఏం తోచిందో ఏమో!... చెయ్యిపట్టి దగ్గర కూర్చోపెట్టుకుని... 'వంట పనీ... యింటి పనీ చాకచక్యంగా చేసేస్తూ ఎల్లప్పుడూ చిరునవ్వు మాయని మొహంతో... లక్ష్మీదేవుల్లా కళకళలాడుతూ కన్పించే నారీ శిరోమణుల గురించి వుపన్యాసం యిచ్చాడు...

నేను పట్టుచీర కట్టుకుని... వంట చేయడానికి... అదే... పిక్నిక్‌కి బయలుదేరాను...

రెండు బస్సుల్లో అందరం తోటల్లోకి చేరుకున్నాం... వెంటనే పిల్లలు ఆటల్లో పడ్డారు.. మగాళ్ళు పేకాటలో పడ్డారు... మేం వంటాటలో పడ్డాం...

నాకపుడు ఓ వాస్తవం తెలిసింది. అక్కడున్న ఆడవాళ్ళల్లో చాలామంది నాకన్నా బ్రహ్మాండంగా వంటలు చేయగలరని... నాలాగే. చకచకా వంట పని చేసేస్తున్నారు... అందరం పోటీలు పడి వండేసాం...



ఎంత శీతాకాలం అయినా ఎండేం తక్కువ లేదు... దానికి తోడు పొయ్యి వేడి... అందరి మొహాలూ కమిలిపోయాయి. చీరలు చెమటకి ఒంటికి అతుక్కుపోయి చిరాకుని కలగజేస్తున్నాయి... అందులోనూ... సౌకర్యంగా లేని 'ఖరీదైన' చీరలు కట్టుకోవడం వల్ల మరింత యిబ్బందిగా వుంది...

మధ్యాహ్నం ఒంటి గంటయింది... ఆడవాళ్ళందరం గబగబ మొహాలు కడిగేసుకుని... కాస్తంత చాటుగా కొంచెం క్రీములూ, పౌడర్లూ దట్టించేసి... తలలు దువ్వేసుకుని, చీరలు సరిచేసుకుని... హాయిగా ఎంజాయ్ చేస్తున్న వాళ్ళలా మొహాలు కళకళలాడేలా జాగ్రత్త పడ్డాం...

వంటల ఘుమఘుమలకి తట్టుకోలేక పేకాటని వాయిదా వేసి మగాళ్ళు వచ్చారు... పిల్లలు వచ్చారు...

ఒళ్ళు విరుచుకుంటూ... కాళ్ళూ చేతులూ జాడించుకుంటూ వచ్చి కింద పరచిన చాపల మీద కూర్చుని "ఆఁ... వడ్డించండి..." అన్నారు... మేం పొలోమనుకుంటూ వడ్డించి వాళ్ళు తింటుంటే ఆత్రంగా వాళ్ళ వంకే చూడసాగాం...

అపుడు ఓ అద్భుతం జరిగింది...

ఎప్పటిలా మావారు నా వంటని కాకుండా పచ్చ చీర కట్టుకున్నావిడ వండిన పదార్థాలను పొగిడారు...

ఆమె భర్త మంచాయన భార్య వంటని పొగిడారు...

మంచాయన నా వంటని మెచ్చుకున్నారు... యిట్లా... పొరుగింటి పుల్లకూర రుచులు పొగిడి పొగిడి... భోజనాలు ముగించి మళ్ళీ పేకాటలోకి వెళ్ళిపోయారు...

తర్వాత మేం ఎవరికి వాళ్ళం.. ప్లేట్లలో పెట్టుకుని పిచ్చాపాటీగా మాట్లాడుకుంటూ తిన్నాం... నాకు మాత్రం వాళ్ళ మాటలేవీ తలకెక్కడం లేదు... భోజనాల సంఘటనే గుర్తొస్తోంది. అదే వెంటాడుతోంది... మామూలుగా తీసుకోలేకపోయాను... యిందులో ఏదో వుంది... కానీ అందులో తప్పేంటో తెలియడం లేదు... గింజుకుని... గింజుకుని... అర్థం కాక వదిలేశాను.

- - - - -

ఈ మధ్య మా అత్తగారు చీటికీ మాటికీ నన్ను కసరడం... నామీద అధికారం చెలాయించడం చేయసాగింది. నన్ను ఎవరైనా ప్రశంసిస్తుంటే పుల్లవిరుపుగా ఏదో అంటూ పదవి కోల్పోయిన రాజకీయ నాయకురాలిలా అసహనంగా వుంటోందామె...

నెమ్మదిగా వంట గదిలోకీ వస్తున్నారామె... నాకూ కాస్తంత వెసులుబాటుగా అన్పించి సంతోషించాను... చివరికి ఉదయం టిఫిన్, మధ్యాహ్నం భోజనం నేను వండేట్లు రాత్రి వంట ఆమె వండేట్లు అనధికారమైన ఒప్పందం కుదిరిపోయింది.

పిక్నిక్‌లోని ఆశ్చర్యకర సంఘటనలే మా యింట్లోనూ ప్రారంభమయ్యాయి. నా వంటని తినేటపుడు మా మామగారు మెచ్చుకుంటూ...

"ఇన్నేళ్ళ నుంచీ వండుతున్నా మీ అత్తమ్మ నీ అంత బాగా వండలేదు" అనేవారు...

మా అత్తగారు వండిన వంటని తింటూ మా ఆయన...

"ఏమాట కామాట చెప్పుకోవాలి... మా అమ్మ చేతి వంట రుచి ఎవరికీ రాదు..." అనేవారు...

రెండు సందర్భాల్లోనూ తండ్రీ కొడుకులిద్దరూ ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ వుండేవారు...

మా అత్తగారి కన్నా నేను బాగా వంట చేస్తానన్న పేరు గడించాలని పట్టుదల హెచ్చింది. సరిగ్గా యిలాగే మా అత్తగారికీ అన్పించినట్లుంది... ఆమె తరచుగా టి.వి.లో ఘుమఘుమలు మొదలైన వంట కార్యక్రమాలు చూసి కొత్త కొత్త వెరైటీలు వండేసి వాళ్ళకి పెడుతుంటే... నాకు టెన్షన్ ఎక్కువై మార్కెట్‌లో వచ్చిన వంట పుస్తకాలు కొనీ, చదివీ నేను వండేదాన్ని.

ఇద్దరి వంటనీ హాయిగా లొట్టలు వేసుకుంటూ తినేవార తండ్రీ కొడుకులు... కానీ నాకూ, మా అత్తగారికీ మధ్య ఏదో పోటీ వాతావరణం ఏర్పడినట్లు అన్పిస్తోంది...

క్రమేణా దానిమీద యుద్ధ మేఘాలు ముసురుతాయేమోన భయం... నన్ను మా మామగారు పొగిడినపుడు ఆమె ముఖం తారట్లాడే అసూయను, అసంతృప్తిని చూస్తుంటే ఆ భయం అర్థరహిత కాదనిపిస్తోంది.

చివరికి నేను వంటింట్లో వున్నపుడు నేను ఏమేం వెరైటీ ఎలా వండుతున్నానో అటొచ్చీ, ఇటొచ్చీ చూస్తూ వుండేదామె... పైపెచ్చ కూరల రుచిని చెడగొట్టే సలహాలు... 'కూరల రుచి కోసం' అన్న చెప్పేదామె... నేనేదో అనేదాన్ని... ఆమేదో అనేది... చివరికి ఆ వాద తగువై కూర్చునేది...

చివరికి ఒక ఒరలో యిమడని రెండు కత్తు తయారయ్యాం. మా తగవులు విని "రెండు కొప్పులు కలిస్తే యింతే!..." భార్య వంక నిరసనగా చూసి అనేవారు మావగారు...

"ఆడదానికి ఆడదే శత్రువు" నావంక చులకనగా చూసి అనేవారు మావారు...

ఇలా ఎంతకాలం గడిచేదో కానీ ఆ రోజు జరిగిన సంఘటనతో నా కళ్ళు తెరిపిన పడ్డాయి...

ఉదయాన్నే చపాతీలు చేసి హాట్‌పాక్‌లో పెట్టి బంగాళా దుంపకూర ఉడుకుతుంటే పొయ్యి సిమ్‌లో వుంచి నేను స్నానానికి వెళ్ళాను... బాత్‌రూంలో మావారి బనీన్లు పడేసి వుంటే అవి వుతికి స్నానం చేయబోతుండగా సున్నిపిండి అయిపోయిన విషయం గుర్తొచ్చి వంట గదివైపు నడిచి లోపలి దృశ్యం చూసి కొయ్యబారిపోయాను...

మా అత్తగారు కూర మూత తీసి స్పూన్ నిండా ఉప్పుతీసి ఆదరా బాదరా కూరలో కలుపుతోంది... ఆ స్థితిలో ఆమెకి ఎదురు పడటానికి నాకు సిగ్గనిపించి బాత్‌రూంలోకి వచ్చాను...

తలంతా దిమ్ముగా మారిపోయింది...

ఆవిడ చేసిన ఆ పనికి ఆమెని పురికొల్పిన కారణాలేంటి?... మరీ ముఖ్యంగా ఒకపుడు తను అదే పని చేయబోయి సంస్కారం అడ్డొచ్చి ఆగిపోయింది... ఇపుడు ఆ సంస్కారాన్ని కూడా మరచిపోయేలా ఆమెను తయారుచేసిన పరిస్థితులేంటి? మేమిద్దరం యిలా ఎందుకున్నాం...?

ఈ వంటాటలో ఎలా ప్రత్యర్థులుగా మారాం..???

'స్వర్ణ మా కోడలు కావడం మా అదృష్టం' అన్న అత్తగారూ...

'మా అత్తమ్మకి అసలు కల్మషం వుండదు...' అన్న స్వర్ణా...

ఏ లౌక్యాలకు... ఏ రాజకీయాలకు బలయ్యారు?....

తండ్రీ కొడుకులు డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు... మా అత్తగారు జరగబోయే దాని కోసం కుతూహలంగా ఎదురు చూస్తున్నారు.

మా ఆయన చపాతీ ముక్క తుంచి కూరలో నుంచి కొంచెం కలుపుకుని నోట్లో పెట్టుకున్నారు... ముఖభావాలు మారిపోయాయి....' ఛీ యింత ఉప్పు ఎక్కువైందేంటి?.... కూరగిన్నె తోసేస్తూ అన్నారు...

మా అత్తగారి మొహంలో సంతృప్తి...

కానీ నా దృష్టి మా మామగారి మీదే వుంది... ఆయన తిని... గుటకమింగి... ఓర్చుకుని... "ఏం లేదే?.... బాగానే వుంది... ఈ మాత్రం ఉప్పు లేకపోతే రుచి ఉండదు..." అన్నారు.

నా ఆవేశం హద్దులు మరిచింది.

"ఉప్పు బాగా ఎక్కువైందిగా మావయ్యా!... ఆ మాట ప్పకుండా దాచిపెట్టి ఎందుకు పొగుడుతున్నారు?...." సూటిగా డిగాను...

నేనలా అడిగినందుకు అందరూ నివ్వెరపోయారు...

"అదీ... అదీ... నిజంగానే బావుంది..." మా మావగారు న్నారు....

"లేదు ఉప్పు ఎక్కువైంది..." పంతంగా అన్నాను...

నా మాటల్లో చురుకు చూసి మా ఆయనకి చురుకొచ్చింది...

"స్వర్ణ! ఏంటా మాటలు?... ఉప్పు ఎక్కువైందని తెలిస్తే... మరి అంత ఎక్కువ ఎందుకు వేశావ్?..." కోపంగా అన్నారు...

నేను మా అత్తగారి వంక చూశాను... ఆమె బిక్కమొహం వేసింది.

"ఇపుడు అది కాదు సమస్య... మావయ్యగారు నిజాన్ని ఎందుకు కప్పిపుచ్చుతున్నారో తెలియాలి..." అన్నాను...

మావగారి మొహం మాడిపోయింది... మా ఆయన నా జబ్బ గుచ్చి పట్టుకుని.." ఎందుకా?... వంటకి వంకలు పెడితే నువ్వు ఏడుపు మొహం పెడతావని... నువ్వు ఎలా వండినా ఆయన నిన్ను ప్రోత్సహించారు... వంటల పట్ల నీ ఆసక్తి పోకూడదని నిరంతరం, నిన్ను ప్రశంసించేవారు... అందరిలాగా నువ్వొండిన వంటలకి వంకలు పెడుతూ వుంటే ఈపాటికి నువ్వు ఈసురోమనుకుంటూ ఎందుకొచ్చిన పనిరా బాబూ! అనుకుంటూ వుండేదానివి..." మావగారి త్యాగగుణాన్ని, తద్వారా నేను పొందిన మేలుని చెప్పారు... ఒకవేళ... వంటకి ఆయన నన్ను ప్రోత్సహించకపోతే...

ఎవరికి నష్టం???...

"ఎవరికి నష్టం?..." మనసులో సుడి తిరిగిన మంట పైకే వచ్చింది...

"ఏంటీ?..." నా జబ్బని మరింత గుచ్చి పట్టుకుని వూపుతూ అన్నారు మావారు...

"నేను ఈసురోమనుకుంటూ వంటచేస్తే ఎవరికి నష్టమో వాళ్ళు ప్రోత్సహిస్తారు... మీరైనా అంతే!..." చెయ్యి విడిపించుకుని లోపలికి నడిచాను...

- - - - -

జ్ఞానోదయమయ్యాక ఆట నుంచి నేను తప్పుకున్నాను... మా అత్తగారూ తప్పుకుంటారు... నాకు తెలుసు... ఎందుకంటే ప్రత్యర్థిలేని ఆట రంజుగా సాగదు... మేమిద్దరం యిన్నాళ్ళూ పోటీలు పడి వంటాట ఆడితే మిగతా యిద్దరూ చప్పట్లతో ప్రోత్సహించి లబ్దిపొందారు.

ఇక యిపుడు వంట అంటే ఒక అవసరం అంతే!... అదే జీవితం కాదు... ఇప్పటికీ వంట మేమిద్దరమే వండుతున్నాం... ఖాళీగా వున్నాం కాబట్టి.. యిలాగే జీవితమంతా ఖాళీగా వుండగలనా?... వూహూ...

భవిష్యత్తులో యిలాగే కొనసాగకపోవచ్చు... ఎందుకంటే యింకా నా జీవితంలో చాలా పార్శ్వాలున్నాయి... మధ్యలో ఆపేసిన చదువుని కొనసాగించాలి... ఉద్యోగం చెయ్యాలి... యింకా తన చేతులు సాగినంత వరకూ ఎవరికైనా సాయం చెయ్యొచ్చు...

అందుకే అందరం కలిసి ఆనందంగా వంట చేసుకునే రోజు కోసం పోరాడటానికి ఈ క్షణం నుంచే ఆత్మ విశ్వాసాన్ని కూడగట్టుకుంటున్నాను.

*

# కవులు, రచయితలకు....

- సాహిత్య ప్రస్థానం పత్రికకు అవసరమైన కవితలు, కథలు, వ్యాసాలు వగైరా చాలా విస్తృతంగా అందు తున్నాయి. ఎప్పుడూ రెండు సంచిక లకు సరిపడా మిగులు వుంటుంది.
- వీటిని పరిశీలించి ప్రచురించడానికి కనీసం రెండు నెలలు పట్టవచ్చు. ఉన్న పేజీలలో వాటిని సర్దుబాటు చేయడం కూడా సమయం తీసుకునే విషయం. సామాన్యంగా ఒకే రచయిత రచనను వరుసగా రెండు సంచికలలో ప్రచురించడం సాధ్యం కాదు. కొత్తవారికి అవకాశం ఇవ్వవలసి వుంటుంది. రచయితలు ఈ సంగతి గుర్తుంచుకోవాలని కోరుతున్నాం.
- త్రైమాస పత్రిక గనక ఈ లోపున ఒత్తిడి చేసినా సమాధానం ఇవ్వలేకపోవచ్చు. వీలైనంత వరకూ అందరికీ అవకాశాలు ఇవ్వడానికి చిత్తశుద్ధితో ప్రయత్నించ గలము.
- తమ కవితలు, రచనల ప్రచురణ గురించే గాక సాధారణంగా సాహిత్యం తీరుతెన్నులను గురించి కూడా చర్చ జరగాలన్నది మా ఆకాంక్ష. అందుకు అనుగుణమైన రచనలకు ప్రత్యేక ప్రాధాన్యత వుంటుంది.
- ఇతర భాషల సాహిత్యాలను పరిచయం చేసే వ్యాసాలు, పరిశోధనాత్మక, విశ్లేషణాత్మక వ్యాసాలను కూడా ఆహ్వానిస్తున్నాం. లోగడ మీరు ఏదైనా రూపంలో రాసి వున్నప్పటికీ ప్రస్తుతం ఉపయోగకరంగా వుందనుకుంటే మరో రూపంలో రాయవచ్చు. ప్రస్తుత వేగంలో గతంలో ఎప్పుడో రాసినవి అందరికీ గుర్తుండవు. ఉన్నా గుర్తు చేయడంలో తప్పు లేదు. ఏ పరిస్థితులలోనూ మరొకరి రచనలు యథాతథంగా అనుకరించడం మాత్రం చేయకూడదు.
- నూతన రచయితలకు, విశ్లేషకులకు ప్రత్యేక ప్రోత్సాహం వుంటుంది.
- నచ్చిన రచన, నచ్చని రచన వంటి శీర్షికలను ఇంకా మెరుగ్గా ఉపయోగించుకోవచ్చు.
- మీ ప్రాంతాలకు సంబంధించిన సాహిత్య విశేషాలు, విలక్షణ కార్యక్రమాలపై సమీక్షలు, నివేదికలు పంపినా పరిశీలించి ప్రచురించగలం.
- సమీక్షకులుగా కొత్తవారిని ఆహ్వానించి అవకాశం ఇస్తున్నాం. ఇంకా ఈ విషయంలో ఆసక్తి గల వారు వివరాలు పంపవచ్చు.
- అరుదైన ఛాయా చిత్రాలు కూడా పంపొచ్చు.
- వెబ్‌సైట్లు, ఇంగ్లీషు పత్రికలలో వచ్చే ప్రత్యేక సమాచారాలు వంటివి సేకరించి పంపొచ్చు.
- కథలు మరీ పొడవైతే ప్రచురించలేము. పత్రికలో నాలుగు పేజీలకు మించకుండా వుంటే చాలా మంచిది. మరీ అరుదైన సందర్భాలలో తప్ప భవిష్యత్తులో అయిదు పేజీలకు పై బడిన వాటిని ప్రచురించలేము.
- కవితలు పంపేవారు వైవిధ్యాన్ని, భాషను పరిశీలించు కోవాలని మనవి.

ఈ సూచనలు గమనంలో వుంచుకుని మరింత ప్రయోజనకరంగా వెలువడటానికి సహకరించాలని కోరుతున్నాం.

**- ఎడిటర్**

పాఠకులకు, సాహితీ మిత్రులకు

## సాహిత్య ప్రస్థానం చందాదారులుగా చేరండి!

సాహిత్య ప్రస్థానం మీ అందరి ఆదరాభిమానా లతో మూడేళ్లు జయప్రదంగా పూర్తి చేసుకుంది. రాష్ట్ర వ్యాపితం గానే గాక ఇతర రాష్ట్రాలలోనూ తెలుగు సాహిత్యాభిమానులు అనేక విధాల అభినందిస్తూ సహకరిస్తున్నారు. విదేశాలలోని తెలుగు మిత్రులు కూడా ఆసక్తి కనపరుస్తున్నారు.

కొన్ని సాంకేతిక కారణాల రీత్యా ఇప్పటివరకూ ప్రస్థానం చందాలు స్వీకరించలేదు. పాఠకుల కోరికపై ఇకనుంచి రెగ్యులర్‌గా ప్రస్థానం చందాలు తీసుకోవాలని నిర్ణయించాము. స్థానికంగా సాహితీ స్రవంతి కార్యకర్తల ద్వారా గాని, లేక ప్రజాశక్తి బుక్‌హౌస్ బ్రాంచీలలోనూ చందా చెల్లించవచ్చు. లేదా నేరుగా ప్రస్థానం కార్యాలయానికి మనిఆర్డర్ చేయొచ్చు. ప్రజాశక్తి దినపత్రిక ఏజంట్లు కూడా మీ కోరికపై ప్రస్థానం సరఫరా చేయగలరు. అయితే ఆ విషయం మా కార్యాలయానికి కూడా తెలియపరిస్తే తగు చర్యలు తీసుకోవడం జరుగుతుంది. ఇప్పటివరకూ చందా దారులు కావడం ద్వారా ప్రస్థానం క్రమబద్ధంగా అందుకునే అవకాశం వుండాలని పదే పదే ఆకాంక్ష వెలిబుచ్చిన పాఠకులు సముచిత స్పందనతో సాహిత్య ప్రస్థానం మరింత పురోగమించడానికి సహకరించగలరని, మీ మిత్రులను కూడా చేర్పించగలరని ఆశిస్తున్నాం.

**సంవత్సర చందా - యాభై రూపాయలు (పోస్టేజి కలిపి)**
**రెండేళ్లకు - వంద రూపాయలు**

**మనిఆర్డర్ మేనేజర్, ప్రస్థానం పేరుతో పంపించాలి**

**- మేనేజర్, సాహితీ స్రవంతి.**
డోర్ నెం. 1-1-189/19/ఎ
వివేక్‌నగర్, చిక్కడపల్లి, హైదరాబాద్-20
సెల్: 9849987038, 9849987006

# వీరబ్రహ్మం ఆత్మగౌరవ ఉద్యమం - చారిత్రక నేపథ్యం



వీరబ్రహ్మం కూడా సంస్కర్తల..దరిలాగే కులభేదాలను తిరస్కరించాడు. హిందూ మహమ్మదీయ సమైక్యతను బోధించాడు. అందుకోసం కడప, కర్నూలు, సిద్ధవటం నవాబులను దర్శించాడు. అక్కడి వారిలో తన బోధనల ద్వారా మనం పరివర్తన కలిగించాడు. అస్పృశ్యతను కేవలం శాస్త్రాల్లో వ్యతిరేకించడమే కాకుండా వాటిని ఆచరణలో పెట్టి, సాంఘిక సంస్కరణలకు ఎనలేని కృషి చేశాడు. బ్రాహ్మణుల నుండి చండాలుర దాకా అన్ని కులాల శిష్యులను స్వీకరించాడు. మహమ్మదీయుడైన దూదేకుల సిద్ధయ్య బ్రాహ్మణుడైన అన్నాజయ్య, ఏలుగురాళ్ళ పల్లె ..రణం గోవిందయ్య, మాదిగ కులస్థుడైన కక్కయ్య, గరిమిరెడ్డి అచ్చమ్మ వీళ్ళంతా ..హ్మం శిష్యులే.

**డాక్టర్ వి. వీరాచారి**

"పరస్పర సంఘర్షణ మూలం ..నే చరిత్ర పుడుతుందంటారు" శ్రీశ్రీ. ప్రతి ..రిత్రక ఘటన వెనుక వైరుధ్య భావాల ..ఘర్షణ ఉంటుంది. తత్ఫలితంగా సామాజిక ..గతి జరుగుతుంది. ఈ ప్రగతికి దోహదం ..న ఉత్పత్తి శక్తులను ఉత్పత్తి సంబంధాలను .. తార్కిక భౌతికవాద దృక్పథంతో చరిత్ర ..హదు చేస్తే, సాహిత్యం ఈ వాస్తవానికి ..నను జోడించి, ఏ వర్గ దృక్పథ పునాదిగా .. ఆవిర్భవించిందో, ఆ వర్గానికి ఆ భావాన్ని .., గీతం, పద్యం, కథ, నాటకం - ఇత్యాది ..నాత్మక ప్రక్రియల ద్వారా చేరవేస్తుంది. ..ట్టి ఒక కవి సాహిత్యాన్ని అంచనా వేయా ..టే ఆ కవి జీవించిన కాలం నాటి ..జిక, ఆర్థిక, రాజకీయ, చారిత్రక అంశా .. కూడా పరిగణనలోనికి తీసుకోవాలి.

ఈ దృష్ట్యా పరిశీలిస్తే నిమ్న వర్గాల్లో ..ర్యాన్ని కలిగించే దిశగా ఆత్మగౌరవ ..మానికి బీజ వ్యాపనం చేసిన తత్వవేత్తగా ..హ్మం మనకు కన్పిస్తాడు. ఆ తరువాత ..క యుగంలో పెరియార్ రామస్వామి ..ద్యమాన్ని విస్తృత పరిచారు. అయితే వీరబ్రహ్మం ఉద్యమం వర్గ వర్ణ స్పృహ కలిగిన సామాజిక ఉద్యమం. పెరియార్ రామస్వామి ప్రారంభించిన ఆత్మగౌరవ ఉద్యమం ఆర్య - ద్రావిడ జాతికి సంబంధించినది. మత పరమైంది. వీరబ్రహ్మం మధ్యయుగం సంధికాలంలో రాయలసీమ ప్రాంతం నుంచి ఈ ఉద్యమాన్ని ప్రారంభించి ఇతర ప్రాంతాలకు కూడా విస్తరింపచేశారు.

ఆంధ్ర దేశ చరిత్రలో వీరబ్రహ్మం జీవించి వున్న కాలం అంధయుగం. సాంఘిక, మత రాజకీయ పరిస్థితులు ఆనాడు అస్తవ్యస్తంగా ఉన్నాయి. విజయనగర సామ్రాజ్యం పతనమైన తరువాత చిల్లర మల్లర రాజ్యాలు పుట్టగొడుగుల్లా పుట్టుకొచ్చాయి. తిని తాగి తిరగా మరిగిన నిరంకుశ పాలకులు, గోళ్ళూడగొట్టి ప్రజల వద్ద నుండి బలవంతంగా పీడించి పన్నులు వసూలు చేసేవారు. రాయలసీమ ప్రాంతంలో ఈ పరిస్థితులు ఇంకా భయంకరంగా ఉండేవి. మొగల్ ప్రభువుల నిరంతర దాడులతో, పాలెగాళ్ళ అంతఃకలహాలతో ఈ ప్రాంతం అతలాకుతల మైంది. శ్రీపాద సుబ్రహ్మణ్య వర్మ 'బంకోలా' అనే చారిత్రక నవలలో ఆనాటి చారిత్రక, రాజకీయ పరిస్థితులను ఈ విధంగా పేర్కొన్నారు. "విలువైన వస్తువులు యోధుల పాలు, అందమైన స్త్రీలు యోధుల పాలు. ఎదురు నిల్చిన వీరులు చిత్రవధల పాలు. జాగరూకులైన మానవతులు ఆత్మహత్యలపాలు, మోసుకుపోలేని అనర్ఘ స్థిరాస్తులు అగ్నిపాలు."

ఇక ఆనాటి సాంఘిక పరిస్థితులు కూడా అధ్వానంగా ఉన్నాయి. వృత్తి విద్యలు, కుల విద్యలైనాయి. కుమ్మరం, కమ్మరం, వడ్రంగం, సాలె వంటి కులాల వారంతా ఎవరి కుల వృత్తిని వారు చేసుకుంటూ జీవన భృతిని పొందాలి తప్ప, ఒకరి కుల విద్యను మరొకరు నేర్చుకోరాదు. "కులవృత్తిని అతిక్రమించడం నరకయాతనానికి మూలమనీ, కుల కట్టుబాట్లపై తిరగబడటం అరాచకమనీ, రాజద్రోహమనీ, పూర్వజన్మలో చేసిన పాప ఫలితాన్ని అనుభవించడానికే ఈ జన్మ కలిగిందని పురోహితవర్గం మాయమాటలు చెబుతూ దేవుని పేరుతో, మతం పేరుతో, ధర్మం పేరుతో కులవృత్తుల వారిని నమ్మిస్తూ అందుకు సంబంధించిన వేదాంతాన్ని తయారుచేసింది."

ఈ దృష్ట్యానే 'స్వధర్మవే శ్రేయోదాయకం, పరధర్మం భయావహం" అనీ "కుల విద్యకు సాటిరాదు గువ్వల చెన్న" అనే మాటలు వ్యాప్తిలోనికి వచ్చాయి. "ఫలితంగా వృత్తి నైపుణ్యం ఒక తరం నుంచి మరొక తరానికి సంక్రమించింది. ఈ అదనపు సంపద బ్రాహ్మణ, క్షత్రియుల సంపదగా మారి, వారి భోగభాగ్యాలకీ, విందులూ, వినోదాలు, యుద్ధాలు, దండయాత్రలకీ వినియోగ పడింది." కులవృత్తులు వారి జీవితాల్లో మాత్రం ఎదుగు బొదుగు లేకుండా పోయింది.

అయితే 16వ శతాబ్దం నుండి మన దేశానికి పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషు వర్తక సంఘాలు రావడంతో కులవృత్తుల కట్టుబాట్లు అంచెలంచెలుగా తెగుతూ వచ్చాయి. ఒకవైపు దేశీయులైన పాలెగాళ్ళు, దేశ్‌ముఖ్‌లు, మరోవైపు ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన మహమ్మదీయులు, పాశ్చాత్య వర్తక సంఘాల వాళ్ళ దోపిడీ, పీడన ఎక్కువైపోయింది. సమాజంలో ఎటు చూసినా నైరాశ్యం చోటుచేసుకుంది. ఈ నైరాశ్య

స్థితిలోనే వీరబ్రహ్మం ఆత్మగౌరవ ఉద్యమం ద్వారా వృత్తి పనివాళ్ళనందరిని ఒక గొడుగు కిందకు తెచ్చి వారిలో ఆత్మస్థైర్యాన్ని కలిగించాడు.

'నడి వీధియందున నాటింతురా కొల్మి
నడి మండలం బందు నాటింతురా..
శివ గోవింద గోవింద
ఏడు తిత్తుల బట్టి పూరింతురా...
కోపమను బొగ్గులన్ కొల్మిలో బోయించి
చాపనూనె యినుము బెట్టింతురా...
శివ గోవింద గోవింద'

అంటూ వీరబ్రహ్మం రాసిన గోవింద పదాల్లోనూ "మగ్గం బెట్టి నేసెటందుకు మోక్షమిదిగో వినరయ్య భర్గో దేవస్సాయని మగ్గం పదిలపరచి తానేయవలెను" అనే కీర్తనల్లోనూ వీరబ్రహ్మం కార్మిక మనస్తత్వాన్ని వ్యక్తం చేశారు. వీటిల్లో ఏ వేదాంత విషయమైనా ఉండనివ్వండి, చేతివృత్తులు చతికిలబడిపోతున్న కాలంలో ఆయా వృత్తి పనివాళ్ళ పనిముట్లను తీసుకొని వీరబ్రహ్మం కవిత్వీకరించడం, ఎంతటి సిద్ధపురుషుడైనా తన పని తాను విడవరాదంటూ చెప్పడమే కాకుండా, తన కులవృత్తి అయిన వడ్రంగం, కుమ్మరం పనులు చేస్తూ ఆదర్శ కుటుంబ జీవితాన్ని గడపడం – ఇత్యాది అంశాలను చూస్తుంటే వీరబ్రహ్మం తన జీవితాన్నే సందేశంగా చూపించాడనిపిస్తుంది. సోమరులై పనిపాట చేయకుండా మెట్ట వేదాంతాలు చెబుతూ సంసార జీవితాన్ని వదిలి సన్యసించే నాటి దొంగ యోగులకు కనువిప్పును, ఆనాటి వృత్తి పని వాళ్ళలో ఆత్మస్థైర్యాన్ని కలిగించడానికి వీరబ్రహ్మం కృషి చేశాడు. మహారాష్ట్ర సంత్ సంప్రదాయంలోని 'హాత్‌కామ్ ముఖిరామ్' అనే నినాదానికి దగ్గరగా వీరబ్రహ్మం జీవితం కన్పిస్తుంది.

మధ్యయుగాల్లో భారతీయ సమాజంలో ప్రధాన భూమికను పోషించిన అంశాలు రెండు. ఒకటి సామాజిక కట్టుబాటును నిర్దేశించిన కులం. రెండవది మానసిక నియంత్రణకు ఉద్దేశించిన మతం. అంటే ఆధ్యాత్మిక చింతన. ఈ రెండు అంశాలు నిబద్ధమైన సామాజిక నిర్మాణంలోనూ, నియంత్రణలోనూ ప్రముఖ పాత్ర పోషించి

---------★★★★---------

**సామాజిక అవసరాల దృష్ట్యా ఈ నాల్గు వృత్తులు సమానమైనవే. ఉచ్చ నీచ భావాలకు తావులేదు. కులం అలాకాదు. ఇది సామాజిక కట్టుబాటు నుంచి వచ్చింది. దీనికి వంశ పారంపర్య లక్షణం ఉంటుంది. వ్యక్తుల ఇష్టానిష్టాలతో సంబంధం లేదు. పుట్టుకతోనే 'కులం' వ్యక్తులకు ఆపాదింపబడుతుంది.**

---------★★★★---------

సామాజిక ప్రగతికి ఎంత దోహదం చేశాయో, స్వార్థపరుల వక్రీకరణల ఫలితంగా అంతే నష్టాన్ని కూడా కలిగించాయి. ఋగ్వేదంలోని పదవ మండలంలోనిదిగా చెప్పబడుతున్న పురుష సూక్తం అందులో తార్కాణం.

బ్రాహ్మణో ఆస్యముఖ మాసీద్
బాహూ రాజన్య కృతః
ఊరూ తదస్యయద్ వైశ్యః
పద్భ్యాశూద్రో అజాయతః

ఈ పురుష సూక్తమే చాతుర్వర్ణ్య వ్యవస్థను నిర్వచించింది. చాలామంది పరిశోధకులు దీన్ని ప్రక్షిప్తంగా పేర్కొన్నారు. ఋగ్వేద భాషను పరిశీలించిన డాక్టర్ బదే కృష్ణ ఘోషు గారు "ఋగ్వేదంలోని తొమ్మిది మండలాల్లోని భాష సమంగా ఉంది. అక్కడక్కడ 'ర, ల' భేదం మాత్రమే కనిపిస్తుంది. పదవ మండలం భాషా దృష్టిలోనూ, ఇతర విషయాల్లోనూ యిటీవలిదని విద్వాంసుల అభిప్రాయం. మొదటి తొమ్మిది మండలాల్లో ఈ నాలుగు వర్ణాల పేర్లు లేవు" అని పేర్కొన్నారు.

నిజానికి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనేవి మొదటి కులాలుగా కాకుండా నాలుగు సామాజిక వృత్తులుగా ఏర్పడి, ఆ తరువాత కులాలుగా రూపాంతరం చెంది ఉంటాయి. వృత్తి అనేది జీవన భృతికి సంబంధించినది. ఐచ్ఛికమైంది. ఇందులో హోదాలకు, గౌరవాలకు స్థానం లేదు. వ్యక్తి యొక్క శారీరక, బౌద్ధిక దారుఢ్యంపై ఈ వృత్తుల స్వీకరణ ఆధారపడి ఉండేది. సామాజిక అవసరాల దృష్ట్యా ఈ నాల్గు వృత్తులు సమానమైనవే. ఉచ్చ నీచ భావాలకు తావులేదు. కులం అలాకాదు. ఇది సామాజిక కట్టుబాటు నుంచి వచ్చింది. దీనికి వంశ పారంపర్య లక్షణం ఉంటుంది. వ్యక్తుల ఇష్టానిష్టాలతో సంబంధం లేదు. పుట్టుకతోనే 'కులం' వ్యక్తులకు ఆపాదింపబడుతుంది. ఇందులో సామాజిక హోదా, గౌరవం, పరువు – ప్రతిష్ఠ వంటి అంశాలు ప్రధాన భూమికను నిర్వర్తిస్తాయి. కాబట్టి కుల కట్టుబాట్లలో మానవీయ విలువలకు స్థానం ఉండదు. వృత్తి జీవితాన్ని ప్రతీకాత్మకంగా నిర్వచించిన పురుష సూక్తాన్ని కులపరంగా భావవాద దృక్పథంతో నిర్వచించడం మూలంగా భారతీయ సంస్కృతిలో నన్ను ముట్టుకోకు నామాల కాకి అనే ధోరణి చోటు చేసుకుంది. ఈ ధోరణికి స్వామి వివేకానంద లాంటి తత్వవేత్తలు ఖండించారు.

తెలుగునాట ఆధునిక యుగంలో గురజాడ అప్పారావు కూడా ఈ సామాజిక శాసనాన్ని సున్నితంగా ధిక్కరిస్తూ విద్యనేర్చినవాడే విప్రుడు. వీరత్వం వున్నవాడే క్షత్రియుడు అన్నాడు. అంటే అవి కులాలు కాదు. జీవన భృతి కోసం చేసే వృత్తులు మాత్రమే అన్నది ఇక్కడ స్పష్టం. విద్యను నేర్చినవాడు ఎవడైనా సరే బ్రాహ్మణుడు అవుతాడని, పౌరుషం, ధైర్యం సాహసం వున్న ఎవరైనా సరే రాజు అవుతాడని గురజాడ తేల్చి పారేశాడు. అందుకే గురజాడ అంటే చాతుర్వర్ణ్య వ్యవస్థలో సుఖంగా బతికే వాళ్ళకు గిట్టదు. ఆయనకు చరిత్రే తెలియదంటూ ఒక ముద్ర వేసి ఆయన చెప్పిన వాస్తవాన్ని కొట్టి పారేస్తారు.

మన పురాణ ఇతిహాసాలను నిష్పాక్షిక దృష్టితో ఒక్కసారి తిరగేస్తే గురజాడ మాటల్లోని వాస్తవం తెలియకపోదు. ఇంద్రసభలో నాట్యం చేసే ఊర్వశికి పుట్టి వశిష్ఠుడు, క్షత్రియుడైనా విశ్వామిత్రుడు బ్రాహ్మణులు ఎలా అయ్యారు. బ్రాహ్మణుడై వ్యాసుని పుట్టుక ఎలాంటిది. మరి వ్యాసునికి పుట్టిన ధృతరాష్ట్రుడు, పాండురా[illegible] పితృస్వామ్య వ్యవస్థ భావజాలం ప్రకా[illegible] బ్రాహ్మణులు కావాలి. మరి క్షత్రియులు ఎ[illegible] అయ్యారు. ''రాజ్యం వీరభోజ్యం అ[illegible] బ్రహ్మజ్ఞానం సంపాదించిన వారెవరైనా

బ్రాహ్మణుడు అవుతాడన్న అంశాలు మన పురాణ యితిహాసాల్లో కూడా పేర్కొన్నారు కాబట్టే అది సాధ్యమైంది.

ఇక్కడ ఇంకో విషయాన్ని గమనించాలి. ఒక అందమైన భవనం పటిష్టంగా ఉండాలంటే కనిపించని పునాది రాళ్ళే కారణం. ప్రతీకాత్మకంగా పురుష సూక్తం కూడా ఇదే చెబుతుంది. బ్రాహ్మణుడు వేదాలు వల్లించాలన్నా, క్షత్రియుడు రాజ్యం ఏలాలన్నా, వర్తకుడు వాణిజ్యం చేయాలన్నా, ఉత్పత్తి కారకులైన శూద్రులే కారణం. కాబట్టి సామాజిక నిర్మాణానికి పునాదిరాళ్ళు ఈ శ్రామిక వర్గమే అన్న వాస్తవాన్ని గుర్తించాలి. అందరికి ఈ వాస్తవాలు తెలిసినా తమ పాదులు ఎక్కడ కదలిపోతాయో అన్న భయంతో మెట్ట వేదాంతాలు చెబుతూ మోకాలుకు బోడి గుండుకు ముడివేస్తుంటారు. ఈ సంప్రదాయం ఈనాటికీ కొనసాగుతుంది. మధ్యయుగాల్లోనే ఈ సంప్రదాయంపై తిరుగుబాటు చేసిన భక్తి ఉద్యమ కవులు ఆ నాటి చాలామంది ఉన్నారు. వీరిలో వీరబ్రహ్మం మార్గం ప్రత్యేకమైంది.

"తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్లు పురోహిత వర్గం రూపొందించిన మాయావాద వేదాంతం ఫలితంగా ఆనాటి కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. అందుకు కారణం సుఖదుఃఖాలతో కూడిన సంసార జీవితం కన్నా, ముక్తికి మార్గాన్ని నిర్దేశించే సన్యాస జీవితమే మేలనే భావన ప్రబలంగా ఉండటమే. ఈ భావాన్ని వీరబ్రహ్మం తన తత్వాల ద్వారా, తన జీవిత విధానం ద్వారా గృహస్థాశ్రమలోనే భగవంతుడున్నాడు, కుటుంబ జీవితంలోనే ముక్తి ఉందని బోధించాడు.

"చిల్లర రాళ్ళకు మొక్కుతుంటే
చెడురా ఒరే ఒరే చిత్తము నందున
రూపిని జూచుచునుండుట సరే సరే.
ఎద్దులని ఎండుతు ఉంటే ఓనరు
పురా ఒరే ఒరే ఏకమైన యా వైభవ
చూచుచుండుట సరే సరే.

వీరబ్రహ్మం ఇలాంటి తత్వాల ద్వారా విగ్రహారాధనను, ఆచరించడానికి వీలు కాని సంప్రదాయాలను ఖండించి

---★★★★---

**ఈయనలో చెప్పుకోదగ్గ మరొక గొప్ప సంస్కరణ విషయం, స్త్రీ పురుష భేదాలను పాటించకుండా స్త్రీల పట్ల గౌరవభావాన్ని కలిగి ఉండటం. అదే విధంగా ఆయన వివాహ సంస్కరణలు ప్రతిపాదించి, బాలబాలికలకు యుక్త వయస్సు వచ్చాకనే పెండ్లి చేయాలన్నాడు.**

---★★★★---

భగవంతుని మనస్సులో స్మరించుకుంటే చాలు అని బోధించినట్లు తెలుస్తుంది.

ఈయనలో చెప్పుకోదగ్గ మరొక గొప్ప సంస్కరణ విషయం, స్త్రీ పురుష భేదాలను పాటించకుండా స్త్రీల పట్ల గౌరవభావాన్ని కలిగి ఉండటం. అదే విధంగా ఆయన వివాహ సంస్కరణలు ప్రతిపాదించి, బాలబాలికలకు యుక్త వయస్సు వచ్చాకనే పెండ్లి చేయాలన్నాడు. స్త్రీలకు కూడా శిష్యరికం ఇచ్చి పురుషులతో పాటు సన్యాసార్హత కలిగించాడు. వేదజ్ఞానం స్త్రీ పురుష బేధం లేకుండా అందరు పొందవచ్చని నమ్మాడు. కాబట్టి తన తర్వాత తన మనుమరాలు ఈశ్వరమ్మను తన ఆధ్యాత్మిక సంస్కరణ వారసురాలిగా ప్రకటించాడు. ఆమె జీవితాంతం అవివాహితగా ఉండి తన తాతగారి సంస్కరణ ఉద్యమాన్ని ఎన్ని విఘ్నాలు వచ్చినప్పటికి వెరవకుండా కొనసాగించింది.

వీరబ్రహ్మం జీవసమాధి అయ్యాక సౌభాగ్య చిహ్నాలు తియ్యకూడదని తన భార్య గోవిందమ్మను బోధించాడు. గోవిందమ్మ భర్త ఆజ్ఞ మేరకు ఎన్ని సాంఘిక నిందలు వచ్చినా సౌభాగ్య చిహ్నాలను అలాగే ధరించింది. వీటన్నింటిని పరిశీలిస్తే, ఆనాటి మూఢాచారాల పట్ల ఆయన తిరుగుబాటు దృక్పథం, స్త్రీల పట్ల ఆయనకున్న గౌరవభావం వ్యక్తమౌతుంది.

ఈ విధంగా వీరబ్రహ్మం ఏదో ఒక భావస్ఫూర్తితో ప్రజలను కూడగట్టే ప్రయత్నం చేశాడు. ఒక రకమైన కార్మిక మనస్తత్వంతో కూడిన సాంస్కృతిక జాగృతిని వారిలో కలిగించాడు. వృత్తి ప్రాతిపదికపై శూద్రులను ఏకం చేసి, వారిలోని ఆత్మన్యూనతా భావాన్ని తొలగించి మొట్టమొదటిసారిగా వారికి వేదాంతం నేర్పి బ్రాహ్మణులకు తాము తీసిపోము అనే ఆత్మవిశ్వాసాన్ని, ధీమాను కలిగించాడు. అందుకోసం బ్రాహ్మణ మఠాలకు సమాంతరంగా మఠాలను స్థాపించడానికి ఎనలేని కృషి చేశాడు.

"ఏ కులమని నను వివరంబడిగితే
యేమని దెలుపుదు లోకులకు, పలుగాకులకూ, దుర్మార్గులకూ, యీ దుష్టులకూ యింటి లోపలను నిల్లుగట్టుకొని మంటలోపల రాట్నం బెట్టుక కంటిలోపల కుదురుబెట్టుకొని ముక్కు లోపల యేమీ బెట్టుకొని చెవులో బారా చేతికి తీసుగా పారాయణమును నరము తీసుకొని అష్టాక్షరియను ఆడిక వేసుకొని పంచాక్షరియను పంచ దీసుకొని తకధిమి తకధిమి గుబదె గుబదెల ఏకిన కులమే నా కులము –"

అంటూ వీరబ్రహ్మం ప్రియశిష్యుడు దూదేకుల సిద్ధయ్య కూడా తన గురువు మార్గంలోనే కార్మిక మనస్తత్వంతో తత్వాలు రచించి, కులవృత్తిని అనుసరిస్తూనే సంస్కరణ భావాలను ప్రచారం చేశాడు. కాబట్టే "వీరబ్రహ్మం వంటి గురువు లేడు. సిద్ధయ్యలాంటి శిష్యుడు లేడు" అనే లోకోక్తి వ్యాప్తిలోనికి వచ్చింది.

"చదువులన్నీ చదివి సన్యాస మార్గమున
సంచరించగా నేల మనసా
చదువులలో తత్వసారంబు తీసుకొని
సందేహములు మాను మనసా"

అంటూ ఆత్మ బోధన చేస్తూ, మధ్య యుగపు ఉత్తరార్థంలో ఆత్మగౌరవ ఉద్యమాన్ని నడిపి, వృత్తి పని వాళ్ళను చైతన్య పరచి 'గురువు' అనే పదానికి నమూనాగా నిల్చిన వీరబ్రహ్మం – ఆయన మార్గంలోనే నడచి శిష్యుడనే పదాన్ని సార్థక్యం చేసిన సిద్ధయ్య నాటికి నేటికి సామాజిక మార్గదర్శకులు, సామాజిక చరిత్ర నిర్మాతలు అని చెప్పవచ్చును.

**(2005 జనవరి 28, 28 తేదీల్లో** కాకతీయ విశ్వవిద్యాలయం చరిత్ర విభాగంవారు 'సామాజిక చరిత్ర – సాహిత్యం' అనే అంశంపై రెండు రోజుల పాటు నిర్వహించిన జాతీయ సదస్సు (నేషనల్ సెమినార్)లో చదివిన వ్యాసం.)

# ఆకాశం మెట్లెక్కి

డాక్టర్ మానేపల్లి

ఆకాశం నల్లగా ఉన్నప్పుడు
నువ్వు నిద్రపోతున్నావు

ఆకాశం నీలంగా మారినపుడు
నేను రెప్ప విప్పి చూశాను
నా కనురెప్పలు ఎక్కడెక్కడికో
పక్షి రెక్కల్లా విహారం బయల్దేరాయి

ఆకాశం తెల్లగా ఉన్నప్పుడు
నువ్వు నాకు మెరుపు తీగలా కనిపించావు
ఎవరో ఎక్కడో మతాబులు వెలిగించినట్టయింది
శతఘ్నుల కాంతి ఏమో అని కూడా అనిపించింది

ఆకాశం తెల్లగా ఉన్నప్పుడే
ఆకాశమంత పువ్వులు ఆకాశంలో వేలాడుతున్నాయి
పట్టుకుని ఉయ్యాలలూగుదామని చేతులు చాపాను
తల వెంట్రుకవాసిలో తప్పించుకున్నాయి
ఆకాశంలో మెట్లు కట్టినట్టు గీతలు
నీరెండిపోయిన నేలలా పగుళ్ళు
ఆకాశంలో నల్లరేగడి మన్ను కనిపించి నవ్వుకున్నాను
ఆ పక్కనే ముళ్ళ కంపలు కనిపించాయి
కంపల మీద ఆరేసిన బట్టలు...
మెట్లెక్కి ఆకాశం మీదికి వెళ్ళి చూస్తే
ఆఫ్రికా ఆకలి కేకలు వినిపించాయి
ఆ పక్కనే నా దేశం కూడా వుండే వుంటుంది

ఆకాశం ఎర్రగా వేడిగా మారిందని
మందార పువ్వులు పూశాయి

ఆకాశంలో సమస్త వర్ణాలు కనిపించాయి
అవి సూర్యుడి ఏడు గుర్రాలు కావట
ఏడుపులట! నవ్వులట! కక్షలట! హత్యలట!

ఆకాశాన్ని రెండు చేతులా కావలించుకుంటే
భూగోళం చేతుల్లోకొచ్చింది

ఆకాశం నల్లగా ఉన్నప్పుడు
నువ్వు ఏ లోకంలో ఉన్నావు
ఏ రంగు రంగుల నీళ్ళు తాగుతున్నావు?
ఆకాశం తెలతెల్లగా మారుతుంటే
నేను మెల్లిగా రెప్పలు విప్పాను
కళ్ళ నిండా తెల్లని పావురాలు ఎగురుతున్నాయి
అవి ఆఫ్రికా వేపు వెళ్తే బాగుణ్ణు

# నాతో రా...

విప్లవ్‌దత్ శుక్లా

తెల్లని గోడమీద నల్లని నిరాశా బిందువును విశ్లేషించేందుకు,
నీలో నిద్రాణమై యున్న నిజమైన నిన్ను... అన్వేషించు -

చేతుల్ని కట్టేసుకుని అసహాయుడవైంది నువ్వే,
గుండెకు "ఆత్మవిశ్వాస" రెక్కల్ని కడితే
అ'సా'మాన్యుడవు నువ్వే -

నత్త గుల్లలా కవచంతో, గిరిగీసుకొని బ్రతకడం కాదు,
స్వేచ్ఛా విహంగమై విహరిస్తే ప్రపంచం కుగ్రామం కాగలదు -

ఆనంగపు దిన ప్రయాణం చేరేది కష్టాల చీకటికి,
కష్టాల నిశి దాటితే రేపు చేరేది జీవన నవోదయానికి -
లోపం నీలో కాదు, నీ ఆలోచనలో ఉంది,
విజయం నీ చరణంలో "కొత్త ఆచరణ"లో దాగుంది -

ఒంటరిగా అడుగు వేసేటప్పుడు నీ నీడ కూడా నీతో రాద
నిరంతరం రగులుతూ, అందరితో కదిలితే
జనం ప్రభంజనమై నీతో రాకపోదు

ఇక్కడ, ఇప్పుడు నీకు కావలసింది,
నిన్ను నీవే నియంత్రించుకొనే "ఉక్కు క్రమశిక్షణ"-
విజేతల ప్రపంచంలో విజేత కావాలనే "వజ్ర సంకల్పం"
కష్టాలను కౌగిలించుకొని కార్యసాధన చేసే "ఆత్మవిశ్వాస
ఇప్పుడు నీముందు కన్నీటి మహాసముద్రం
కనబడుతుంది కదూ...
అక్కడే వెనక్కి తిరిగితే సువిశాల సుసంపన్న భారతదేశం
నాతోరా... కలలు సాధనలో మమేకమై కదిలితే
భవిష్యత్తు మ

# ద్రౌపది స్వయంవరం



నెగ్గినవారిలో, అందమైనవారిలో, ఒకనిని తన కిష్టమైన వారిని ద్రౌపది వరిస్తుంది! ఎవరూ ఆమెకు నచ్చని పక్షంలో నిరాకరిస్తుంది. కనుక ఎన్నిక అనేది పూర్తిగా ద్రౌపది ఇష్టాయిష్టాల పైనే అసె ఆధారపడి వుంది. కనుక ద్రౌపదిది స్వయంవరమే! దీనిని బట్టి, భారతం విషయాన్ని గూర్చి, మనకున్న నమ్మకంపైనా, విశ్వాసంపైనా ఆధారపడకూడదనీ, జాగ్రత్తగా చదవాలని బోధపడుతుంది.

**ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు**

మహాభారత కథపై ఎన్నో సందేహాలు, ప్రశ్నలు. పాండవులకు రాజ్యంలో హక్కుందా, ధర్మారాజు మళ్ళీ జూదం ఎందుకు ఆడాలి, దుష్యంతుడు శకుంతలను మోసం చేశాడు, ఏకలవ్యుని ద్రోణుడు బొటనవ్రేలును గురుదక్షిణగా అడగడం తప్పు కాదా – ఇలాంటివి చాలా వున్నాయి. అయితే ద్రౌపది స్వయంవరాన్ని గూర్చి అలాంటి సందేహంగాని, ప్రశ్నగాని జనంలో వున్నట్లు దాఖలా లేదు. స్వయంవరం అంటే, తనంతతానుగా వరుని వరించడం లేదా ఎన్నుకోవడం గదా! కాని ద్రుపదుడు – అంటే ద్రౌపది తండ్రి, మత్స్యయంత్రాన్ని కొట్టిన వాడికి తన కూతుర్ని ఇచ్చి వివాహం చేస్తానన్నాడు గదా! అంటే, ఆ యంత్రాన్ని ఎవరు కొడితే, అతనికి ఆమెనిచ్చి వివాహం చేయాలి గదా! కనుక అందులో ద్రౌపది ప్రమేయమేముంది? ఆమె తానుగా వరించే దానికి అక్కడ అవకాశం లేదు గదా! అయినపుడు అది స్వయంవరం ఎలా అవుతుంది? ఎందుకో గాని, భారతంపైన ఎన్నో సందేహాలున్నా, జనంలో ఇలాంటి సందేహం వచ్చినట్లు కనిపించదు. దానికి కారణం, భారత కథ మనకు బాగా తెలిసివుండటం, ఎలాగూ మత్స్యయంత్రాన్ని అర్జునుడే కొడతాడు అనే భావం దృఢంగా నాటుకొని వుండటం వలన, సందేహమంటూ కలగలేదు. కాని పై విధంగా ఆలోచించినపుడు అది సందేహమే గదా! కాని, ద్రౌపదిది స్వయంవరమే! ఎలాగంటారా? చదవండి.

ద్రౌపదికి, ద్రుపదుడు స్వయంవరం చాటించాడనే సంగతి పాండవులకు మొదట తెలిసింది, వారు ఏకచక్రపురంలో వున్నపుడు, వారి దగ్గరకు దేశ దేశాలు తిరిగిన బ్రాహ్మణుడు ఒకడు వచ్చి, ఆ విషయం చెప్పాడు. దేశదేశాల రాకుమారులు ఆమెను పొందాలనే కుతూహలంతో వచ్చారు. పాండవులూ వచ్చారు. ముహుర్తం రోజున అందరూ ఒకచోట సమావేశమయ్యారు. వారిలో పాండవులున్నారా అని పరకాయించి చూశాడు ద్రుపదుడు. బ్రాహ్మణ వేషాల్లో వున్న పాండవులను గుర్తించలేకపోయాడు ఆయన. అలా ఎందుకంటే, ద్రౌపదిని అర్జునునికే ఇచ్చి వివాహం చేయాలని ఆయన కోరిక. దానికి కారణం, అర్జునుడే గదా ఆయన్ని బంధించి ద్రోణునికి గురుదక్షిణగా ఇచ్చింది. కనుక ద్రోణుని పరాభవించాలి. పరాభవించాలంటే, దానికి సమర్థుడు అర్జునుడే. కనుక అతన్ని అల్లునిగా చేసుకోవాలి. ఆ కోరికతోనే ఆయన యజ్ఞం చేసి ద్రౌపదిని పొందారు. కాని సమయం వచ్చేటప్పటికి, పాండవులు లక్క యింటిలో కాలిపోయారని సమాచారం. ఆ దిగులుతో ఆయన వున్నపుడు ఆయన పురోహితుడు పాండవులు మరణించలేదనే విషయాన్ని తాను ఉపశ్రుతి అనే విద్య ద్వారా తెలుసుకున్నానని, కనుక స్వయంవరం చాటిస్తే, పాండవులు ఎక్కడ వున్నా, దానికి వస్తారని చెప్పాడు. అందువల్లనే ద్రుపదుడు స్వయంవరం చాటించాడు. అంటే ఆయన లోపలి కోరిక, ద్రౌపదిని అర్జుననికిచ్చి వివాహం చేయడం, పురోహితుడు చెప్పినట్లుగానే పాండవులు వచ్చారు. కాని ఆయన గుర్తించలేదు. ఇక ఆయన తన కుమార్తె వివాహానికి గల షరతును చెప్పాడు. అదేమంటే, ఆకాశంలో ఎత్తున తిరుగుతున్న మత్స్యయంత్రాన్ని కొట్టినవాడు తన కుమార్తెకు వరుడవుతాడు అని. అదేమాట ఆయన కుమారుడు, ద్రౌపది అన్న అయిన దుష్టద్యుమ్నుడు కూడా చెప్పాడు. వచ్చిన రాజులందర్నీ ద్రౌపదికి పరిచయం చేస్తూ కూడా, మత్స్యయంత్రాన్ని కొట్టినవారిని, నీవు వరించాల్సి వుంటుంది అని ఆమెతో కూడా చెప్పాడు. పరీక్ష మొదలైంది. ఒకరొకరుగా చాలామంది ప్రయత్నించారు. ఎవరూ నెగ్గలేదు. చివరకు అర్జునుడు ఆ యంత్రాన్ని కొట్టాడు. ద్రౌపది అతని మెడలో వరమాల వేసింది. ఆ తరువాత కథలో ప్రస్తుతం మనకు నిమిత్తం లేదు. ఇప్పటికి కావలసింది ఇంతవరకే.

మనకు తెలిసిన కథ – అంటే పౌరాణికులు చెప్పనివ్వండి లేదా మరోవిధంగా తెలియరానివ్వండి – తెలిసింది ఇలాగే. ఇక్కడ ఒక ప్రశ్న. వచ్చినవారు మత్స్యయంత్రాన్ని కొట్టడానికి ప్రయత్నిస్తున్నారు గదా! కొంచెంసేపు ఒక మాట అనుకుందాము. అది మొట్టమొదటివాడు ఆ యంత్రాన్ని కొట్టాడనుకుందాము. అంటే, అతనికి ద్రౌపదినిచ్చి పెండ్లి చేయాలి గదా! పోనీ, మొదటివాడు కాదు. ఎవడో ఒకడు. కొట్టిన వాడికి ద్రౌపదిని ఇవ్వాలా, వద్దా? షరతు ప్రకారం ఇచ్చి తీరాల్సిందే గదా! కాని అర్జునునికిచ్చి చేద్దామని గదా ద్రుపదుని ఆలోచన. ఆయన గుర్తించలేదు. తాను గుర్తించినంత మాత్రం

చేత, వారు రాలేదని ఆయన భావించే అవకాశం లేదు గదా! అలా అయినపుడు, మొదటివాడు కాని, మరొకడు గాని ఆ యంత్రాన్ని కొట్టి వుంటే, అర్జునుని దాకా అవకాశం వచ్చే వీలు ఎక్కడుంది? యంత్రాన్ని కొట్టడానికి ప్రయత్నించే వారిలో మొదటివాడు అర్జునుడే కావాలని, అవుతాడని ద్రుపదుడు ఎలా భావించాడు? ఇంతమాత్రం ఆలోచించ కుండా, అర్జునునికి ద్రౌపదిని ఇద్దామని భావించిన వాడు, మత్స్యయంత్రాన్ని కొట్టిన వాడికి కూతుర్ని ఇస్తానన్నాడేమిటి? చూడండి ఎన్ని ప్రశ్నలున్నాయో! కానీ జనానీకానికి సందేహాలే కలుగలేదు! అయితే, నిజానికి ఈ ప్రశ్నలకు ఆస్కారమే లేదు. ద్రౌపదిది నూటికి నూరుపాళ్ళూ స్వయంవరమే!

ద్రుపదుడు గాని, దృష్టద్యుమ్నుడు గాని, మత్స్యయంత్రాన్ని కొట్టినవాడు ద్రౌపదికి వరుడు అవుతాడని ప్రకటించినంతవరకే మనం గ్రహిస్తున్నాము. కాని భారతంలో ఆ మాటేగాక, మరో మాట కూడా ఉంది. అదేమిటంటే, మత్స్యయంత్రాన్ని కొట్టినవాడు, మన్మథ సమానుడైనవాడు, ద్రౌపదికి వరుడవుతాడు అనేది. అంటే వరుడు కాగలవాడు సామర్థ్యం కలిగినవాడు, అందగాడు అయివుండాలి. పోనీ, అలాగే అనుకున్నా. అర్జునునికి ముందే, ఆ రెండు లక్షణాలు కలిగిన ఒకరు నెగ్గివుంటే, అర్జునుని దాకా అవకాశం రాదు గదా! అంటే సమస్య మళ్ళీ మొదటికే వచ్చింది అని అనిపిస్తుంది.

కాని నిజం అది కాదు. ద్రుపదుని మాట జాగ్రత్తగా గమనించాలి. ఆయన అన్నది, మత్స్యయంత్రాన్ని కొట్టినవాడు ద్రౌపదికి వరుడవుతాడని మాత్రమే. మగడవుతాడని కాదు! ఎవరు ఆమెకు మగడవుతాడనేది ద్రౌపది ఇష్టం మీదనే ఆధారపడి వుంది. అంటే మత్స్యయంత్రాన్ని కొట్టడం ఒక షరతు. అంటే – అది కన్యాశుల్కం. అందగాడు కావడమనేది ద్రౌపది వరించడానికి ఉపయోగించే విషయం కన్యాశుల్కం వధువు తలిదండ్రులకు వరుడు చెల్లించేది. వధువుకు కావలసింది వరుని యొక్క అందచందాలు. ఫలితార్థం ఏమిటంటే మత్స్యయంత్రం కొట్టడమనేది మొదటి పరీక్ష (ప్రిలిమినరీ) పరీక్ష. చివరివాని వరకూ కొనసాగుతుంది.

---

# అవర్గీకరణ

**రాచపాళెం**

లడాయి బతుకుల
బడాయి సీమా!
కొడవళ్ళు కాదు
పిడికిళ్ళు బిగించు

గట్టి మనుషులే
పిట్టల్లా రాలిపోయారు
తగిలింది
కరువు దెబ్బ కదా!

భూస్వామి బిడ్డే ఎస్.టి.
విముక్తి పోరాటంలో
అవర్గీకరణకు
నిర్వచనం

వెంకన్న హుండీలో
రోజుకో కోటి
భక్తులడిపోను
దొంగ గొడ్ల పోటీ

ఆస్పరి టొమాటోలు
నల్లని రేగడిలో
ఎర్రని వడగళ్ళు
రాలంది ధరలే

(ఆస్పరి : కర్నూలు జిల్లా
ఆదోని దగ్గర గ్రామం)

కంచులాగా
కనకం మోగదా?
వేమన్నా!
ఇవాళదే తెగ మోగిపోతోంది

తట్టండా తలుపు
ముసలిదాని దగ్గు
వలస దాకా
వినిపిస్తుంది

ఇన్నాళ్ళకు అనంతలో
పచ్చని పచ్చిక
మేయడానికి
పశువేదీ?

గజ్జెల మల్ల
శంఖారావం
ఆఖరికి
గుడిగంటగా మారింది

అందరి పేర్లూ
సూర్యుళ్ళే ఇక్కడ
అలముకొనేది మాత్రం
అంతటా చీకటే

అన్నమయ్య!
కొండ దిగి వేమన్నను కలువు
భక్తి సరే
ఆర్తి తెలుస్తుంది

నీళ్ళే సంస్కృతి
అన్నారు సింగమనేని
నదీమ తల్లులూ
మారి మా సంగతేంటి?

మిట్టూరు చిన్నబ్బా
పచ్చ నాకు సాక్ష్యానికి
అనంతలో
ఆకేదీ?

అదే అదే
జమ్ముల మడుగు
ఇవాళది
అమ్ములపడుగు

రోళ్ళూ రోకళ్ళు
దిగబడ్డాయా?
కరువు
కడుపులో దేవిందేమో!

# దృశ్యాదృశ్యం




"నమో
వెంకటేశా
నమో
తిరుమలేశా
మహా
నందమాయే
ఓ మహాదేవ
దేవా"

**వి. ప్రతిమ**

గదిలో నిండుకుపోతూన్న చీకట్లను చీలుస్తూ శ్రావ్యంగా విన్పిస్తోన్న ఆ పాట నా గుండెల్లోపలి అట్టడుగు పొరలను కెలుకుతోంది. అప్రయత్నంగా వరండాలోకి పడ్డాయి నా అడుగులు... ఆ పాట విన్పించగానే ఈ చుట్టు ప్రక్కవాళ్ళంతా సినిమాకి టైమైపోయిందంటూ పన్లు ముగించుకుని పరుగెత్తడం గుర్తుంది నాకు... ఈ పాట అప్పుడు గాంధీమందిరం దాకా విన్పించేది... ఇప్పుడు ఎదురుగా ఉన్న ఈ యింట్లోకే స్పష్టంగా లేదు...

వరండాలో నుండి సినిమా హాల్లోకి నిక్కి నిక్కి చూశాను... బుకింగుల దగ్గర రాజన్న ఒక్కడే నిలబడి వీధిలోకి చూస్తున్నాడు... ఇప్పుడు హాలు మొత్తానికి ఈ బుకింగొకటే... అప్పుడు ఆడోళ్ళ బుకింగ్ వేరేగా... మాస్ బుకింగ్ వేరేగా... క్లాస్ బుకింగ్ వేరేగా మొత్తం మూడు బుకింగులుండేవి. మూడూ కూడా కిక్కిరిసిపోయి జనాలు ఒకరి మీద మరొకరు పడి కొట్టుకోవడం, అరచుకోవడం... తమ మనుషుల కోసం బిగ్గరగా పేర్లు పెట్టి పిలుస్తూ ఆ రష్‌లో వెతుక్కోవడం అంతా నానా కంగాళీగా ఉండేది...

ఆ తర్వాత కొన్నాళ్ళకి ఆడోళ్ళకీ, మాస్ బుకింగ్‌కీ రెండు పొడవాటి 'క్యూ'లు ఏర్పరచి నేరుగా వాళ్ళ తరగతిలోకి వెళ్ళేట్లుగా ఏర్పాటు చేశాడు నాన్న... హాలు మెయింటెనెన్స్ వద్ద ఎదురుగుండా చక్కటి డైమండ్ షేప్ ఫౌంటెన్... దాని చుట్టూ గట్టు మీద అందమైన పూలమొక్కలు నిండిన మట్టి కుండీలు పేర్చబడి వుండేవి... ఫౌంటెన్ మధ్యలో ఎత్తయిన స్తంభానికి అమర్చబడిన గుండ్రటి మెర్క్యూరీ బల్బ్.. హాలంతా కాంతులు వెదజల్లుతూ వుండేది... ఎడమవైపున మూలగా వున్న మల్లెపొదలో నుండి వెలువడే పరిమళం ప్రాంగణమంతా పరచుకునేది... గేటుకి రెండువైపులా ప్రహరీ గోడ నానుకుని వరుసగా వున్న జినియా మొక్కలు విరగబూసి ప్రేక్షకుల నాహ్వానిస్తున్నట్లుగా వుండేవి...

ఫౌంటెన్‌కీ, బాల్కనీ ఎంట్రన్స్‌కీ మధ్య నుండే ఎర్రగచ్చు వరండాలో చేతులున్న ఒక పెద్ద నల్లమాను కుర్చీలో తెల్లటి పంచె, చొక్కా ధరించి నాన్న కూర్చుని ఉండేవాడు...

బాల్కనీలో కొచ్చే వాళ్ళంతా ఆయనకి నమస్కారం చెబుతూ పైకి వెళ్ళేవాళ్ళు... ఆరుకాకముందే కాంపౌండంతా పని పాటల జనాలతో, మాటలతో, అరుపులతో నిండి పోయి వుండేది... ఆ పల్లెటూరి మాటలు రకరకాల యాసలతో వినడం

నాకెంతో యిష్టంగా వుండి అనుకరిస్తూ వుండేదాన్ని... ఆ మాటలు విని అమ్మా, నాన్నా... అన్నలూ పకపకా నవ్వుతూ గొప్ప ఆనందాన్ని పొందేవారు...

ప్రేక్షకుల్ని అలరించడం కోసం రాసోయే సినిమా పాటల్ని వేసి ఆకర్షిస్తూ వుండేవాడు ఆపరేటరు... ఇవ్వాళ ఉదయం వచ్చింది మొదలూ వూహ వచ్చిన్నాటి నుండీ హాలుతో నాకున్న అనుబంధం తాలూకూ సంఘటనలు మనోఫలకం మీద ఒక్కటొక్కటిగా ముద్రితమవుతూనే వున్నాయి...

ఇప్పుడీ నిర్మానుష్య నిశ్శబ్దాన్ని భరించడం... చాలా కష్టంగా వుంది. నాలుక పిడచగట్టుకుపోయి గొంతెండుక పోతున్నట్లుగా వుంది. ఆ నిశ్శబ్దం అశోక చెట్ల గాలితో కలసి శోక సంగీతాన్ని మోసుకొస్తున్నట్లుగా వుంది...




"రోజూ యింతే శివాఁ... ఒక్కరు రావడం లేదు... నువ్వు నమ్మవు... రెండో ఆటకయితే మరీ నూరు... నూట యాభై కంటే ఎక్కువుండటం లేదు... కరెంట్ ఖర్చులకన్నా రావాల గదా... రెండు కుటుంబాలు దాని మీద నడవాలంటే చిన్నమాటలా..." వదిన రెండు గ్లాసుల్లో కాఫీ పైకీ కిందకీ కలబోస్తూ నాకు సంజాయిషీ చెప్తున్నట్లుగా అంది... వదిన కలబోస్తున్న కాఫీ ఎందుకో ఎర్రగా వుంది...

ఉద్వేగాన్ని అణచుకుంటూ మెల్లిగా మరో రెండడుగులు ముందుకేసి హాలుకీ, యింటికీ మధ్యనున్న గేటు దాకా వెళ్ళి తొంగి చూశాను.. రాజన్న ఫౌంటెన్‌కు పక్కగా నిలబడి ఎవరితోనో మాట్లాడుతున్నాడు.... అన్నను చూస్తుంటే ఎందుకో గుండెల్లో నీళ్ళూరాయి...

యువ రాకుమారుడిలా ఎంత ధీమాగా వుండేవాడు... ఆ రోజుల్లోనే సూటూ, బూటువేసుకుని ఆ వయసు వాళ్ళందరిలోకి ఎంతో ప్రత్యేకంగా కన్పించేవాడు... ఎదిగిన తల, మాసిన గడ్డం... పాతకాలపు గళ్ళలుంగీ, చొక్కా పీక్కుపోయిన ముఖం... ఏమాత్రం వెలుగులేని కళ్ళతో దీనంగా వున్న రాజన్నకీ... చిన్నప్పటి రాజుకీ ఏమాత్రం పోలికే లేదు...

బయటేదో స్కూటర్ శబ్దం విన్పిస్తే సినిమా కొస్తున్నారేమో అనుకున్నా... చిన్నన్న విజయుడ్ని ఎవరో స్నేహితులు తీసుకొచ్చి ఒదిలిపెట్టి పోయారు.

రాజన్నతో మాట్లాడకుండా దాటుకుని యింటి వైపుగా వస్తున్నాడు విజయుడు... రాజన్న కూడా చిన్నన్నని పలకరించలేదు... విస్తుపోయాన్నేను...

'రాజశేఖర్, విజయశేఖర్... వినోద అని ఎంత మంచి పేర్లు పెట్టాడే మీ నాన్న' అంటూ బళ్ళో అంతా మమ్మల్ని చూసి మురిసిపోయేవాళ్ళు... కలిసి బడికి వెళ్తామనీ... కలిసే యింటి కొస్తామనీ మా ఐకమత్యానికి ఆశ్చర్యపోయే వాళ్ళు... రాజన్నని ఎవరైనా పల్లెత్తు మాటంటే వారి మీదకి యుద్ధానికి వెళ్ళేవాడు విజయుడు... ఇక చెల్లెలంటే యిద్దరికీ పంచప్రాణాలు.

... మా పెళ్ళిళ్ళయి పిల్లలు పుట్టాక కూడా మేమెంతో అన్యోన్యంగా వుండేవాళ్ళం.

... మా ఆయన ఎక్కువగా పుట్టింటికి పంపడనీ, ఎంతసేపూ డబ్బు రంధేననీ ఆయన పరోక్షంలో మేమంతా సరదాగా జోకులు వేసుకుని ఆనందిస్తూండే వాళ్ళం...

అమ్మ శివభక్తురాలు... శివుడి మీద నమ్మకంతో, ప్రేమతో నాకు 'శివలక్ష్మి' అని పెట్టుకుంది... రిజిష్టర్లో వినోద అని వున్నప్పటికీ... ఇంట్లో అంతా 'శివా' అనే పిలిచేవాళ్ళు... అదంతా ఒక తీపి యిల్లు... స్వర్ణయుగం.

అటువంటిది అన్నలిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకోకపోవడం... ముభావంగా వుండటం... ఆస్తి పంపకాలు అనుబంధాలని యింతగా తెంపేస్తాయా?

"ఏరా శివా... ఎప్పుడొచ్చావు?" చిన్నన్న నన్ను కూడా పలకరించకుండా పోతాడనుకున్నానేమో... తడబడ్డాను...

"పొద్దున చార్మినార్ కొచ్చాననన్నా... నేనొచ్చే టప్పటికే నువ్వు లేవు."

"చెనిగ పెట్నామురా... అక్కడికి పోయినా... అన్న జాబు రాసినాడా?"

"లేదన్నాఁ ఫోను చేసి రమ్మంటే వొచ్చినా... సంతకాలు పెట్టాలంట కదా..." మాట గొంతులో వుండలా చుట్టుకుని అడ్డుపడింది... పెగిలి రాలేదు...

"అవునా... హాలు అమ్మేస్తుండాం" చిన్నన్న గొంతుక్కూడా ఏదో అడ్డం పడ్డట్టే వుంది... అప్రయత్నంగా యిద్దరమూ చిన్నన్న వుంటోన్న యింటి వైపుగా నడవసాగాం...

"ఏందో యిట్టాటి పరిస్థితి వస్తోందని ఎవరమూ అనుకోల్యా ... ఈ ఊళ్ళో మొదటి కుటుంబం మనది... ఎట్టంతా వైభవంగా బతికినాం... ఎంతమంది ఈ యింట్లో బతికి పోయినారు... ఎంతెంతమందికి నాయిన యిళ్ళ స్థలాలిప్పించి వుంటాడు.. ఎంతమందికి ఉద్యోగాలిప్పించి వుంటాడు?... ఈ చుట్టుపక్కల.. యింకా ఈ ఊళ్ళో ఎవరికీ ఆపదొచ్చినా హాలుకాడికి పరుగెత్తేవాళ్ళు.. మన హాల్‌రెడ్డి వుండాడు మనకేం లెమ్మని ధైర్యంగా వుండేవాళ్ళు... చిన్నన్న తాగొచ్చినట్టున్నాడు... వాసనొస్తోంది.

కడుపులో తిప్పినట్టయింది నాకు... వాసనకి కాదు... నాన వుండగా సిగరెట్టు కాల్చడానికి మూడు వీధులవతలికెళ్ళే చిన్నన్న తా నిర్భయంగా యింట్లోకి వచ్చినందుకు... ఇద్దరం మెల్లగా వెళ్ళి వరండా వున్న కుర్చీల్లో కూర్చున్నాం...

'ఆఁ... అట్ట బతికినాం... యిట్ట బతికినాం అని నాయ గొప్ప చెప్పుకునేదే... ఆయన సంపాదించినాడు నిజమే... ఎలక్షన్ల యాపారాలనీ... గుళ్ళనీ, గోపురాలనీ అంతా తగలబెట్టిపోయినాడ ఆఖరాకి యిదిగో ఒక్కగానొక్క పిలగాడు... ఎట్నో నాలుగక్షరమ్ము లొచ్చాయి... వాడికి ఉద్యోగ మిప్పించుకోల్యాకుండా వుండాం "చిన్నొదిన నిష్టురపడుతూ, ఎవరి మీదో తెలీని ద్వేషంతో అసహ్యం మొహం పెట్టి మంచినీళ్ళ గ్లాసులు తెచ్చి టీపాయి మీద శబ్దమొచ్చే పెట్టింది.

డిగ్రీ చదవగానే ఉద్యోగమొచ్చే పరిస్థితి బయట ప్రపంచం లేదని వదినకి తెలీదు... కొడుకుని గొప్ప పొజిషన్లో పెట్టలేదని అం మీదా కోపం...

స్వర్ణముఖీ నదీ తీరాన ఉన్న శివాలయం నాన్న కట్టించిందే నాన్న పంచాయతీ సర్పంచ్‌గా, సమితి ప్రెసిడెంట్‌గా, జిల్లా పరిషత్ ఛైర్మన్‌గా రాజకీయాల్లో చాలా లోతుగా పనిచేశారు. అయితే చాలామంది రాజకీయనాయకుల్లాగా డబ్బు సంపాదించడం కోసం రాజకీయాల్లో చేరలేదాయన... సొంత డబ్బు పెట్టి రాజకీయం చేసిన వ్యక్తి... చివరి క్షణందాకా అవినీతిని దరి చేరనివ్వని గాంధేయవాది... ప్రజల మనిషి... అందుకే వదినలిద్దరి దృష్టిలో ఆయన చేతకానివాడి కింద లెక్క...

వదినకేసి వింతగా చూస్తున్నాన్నేను... ఆస్తులుండటం... లేకుండా పోవడం అన్న కారణంగా మనుషుల్లో యింత నాటకీయమైన మార్పులొస్తాయా? యిదే చిన్నొదిన యిదివరకు ఎంత సౌమ్యంగా, ఎంత మృదువుగా మాట్లాడేది? మనుషుల పట్ల ఎంత అభిమానంగా, ప్రేమగా, గౌరవంగా వుండేది...

చిన్నన్న ఏదో చెప్పుకు పోతున్నా వినకుండా ఆలోచనలో పడ్డాను.

"శివా... నువ్వు కూడా యిక్కడే భోంచేయి..." పెద్దగా అరిచింది చిన్నొదిన వంటింట్లో నుండి...

"వద్దొదినా... రాజన్న, వదిన చూస్తుంటారు..." చెప్పాన్నేను...

"హాలు నడవడమే లేదు శివా... చాలా దగ్గిర్లో సినిమాహాళ్ళు కల్యాణమండపాలు చేసేశారు..." పెగులుబ్బుకున్నట్లుగా అన్నాడు చిన్నన్న...

"అవునన్నా.... అట్ట చేస్తే ఏమి మనం కూడా..." సినిమా హాలు అమ్మకూడదన్న ఆతృత నాలో... ఎలాగైనా అన్నలిద్దరూ ఈ ఉపద్రవం నుండి బయటపడాలన్న ఆలోచన కూడా కావొచ్చు...




నవ్వాడు చిన్నన్న.

"శివా మనకి తెలిసినప్పట్నుండీ మన హాల్లో ఎన్నివేల పెళ్ళిళ్ళు జరిగుంటాయి... ఏనాడైనా మనం ఒక్క పైసా తీసుకుని వుంటాముగుదుమా? కరెంట్, నీళ్ళు కూడా వూరికే యిచ్చి పెళ్ళిళ్ళు జరిపించా... ఈ రోజు మనం కల్యాణ మండపం చేసినా కూడా అదే పరిస్థితి... పైగా యిప్పటికే యిక్కడ మూడు కల్యాణ మండపాలుంటాయి... జరిగేది కష్టం... ప్చ్..."

"ఏదైనా గోడౌన్ గానీ, షాపింగ్ కాంప్లెక్స్ కానీ అయితేనో?"

"గోడౌన్లు అవసరమైనంత పెద్ద ఊరేం కాదు గదా... షాపింగ్ కాంప్లెక్స్‌కి యిది బజారు సెంటరు కాదు... అయినా కొనేవాళ్ళు అట్ల అమ్మాల్సిందే..."

"ప్చ్" నిట్టూర్చాన్నేను...

ఎవరొచ్చినా, రాకున్నా సినిమా మొదలైనట్టుంది... ఏదో మ్యూజిక్ రింగ్ వినిపిస్తోంది... మరికొంతసేపటికి ఒక పాట గందరగోళంగా నా చెవులను తాకసాగింది...

"ప్చ్ సినిమాలు కూడా అట్టనే వున్నాయి ఘోరంగా.... కుటుంబాలతో కలిసి చూడగలిగేట్టుగా వుండామూ?..." ఏదో ఒకటి మాట్లాడాలన్నట్లుగా అన్నాన్నేను...

"ఏం చేస్తారమ్మా... ప్రేక్షకులు అట్టాటి సినిమాలు చూసుకుంటుంటారు... అందుకని తీశామంటారు నిర్మాతలు... వాళ్ళు తీస్తుండారు కాబట్టి మేం చూస్తుండాం అంటారు ప్రేక్షకులు... అంతంత డబ్బు పెట్టి సినిమాలు తీసేప్పుడు తమ డబ్బు తమకి రావాలనుకుంటారు నిర్మాతలు... ఎవర్ని తప్పుపడతాం చెప్పు...?"

చిన్నన్న మాటల్ని అడ్డుపోకుండా మౌనంగా వుండిపోయానే కానీ ముప్ఫై, నలభయ్యేళ్ల నాడు తీసిన సినిమాల్లోని పాటలు యివాల్టికీ మన నోళ్ళల్లో ఆడుతున్నాయి... అప్పట్లో ఒక పాట తీయడానికి పదిరోజులు పట్టేదట - ఇప్పుడు ఒకే రోజు పది పాటలు రికార్డ్ చేసేస్తున్నారు... కేవలం టెక్నాలజీ పెరగడం మూలంగానే యిది సాధ్యమైందా?... సాంకేతిక అభివృద్ధితో ఒక్కసారిగా డబ్బు చేసుకోవాలన్న ఆరాటమే యిది... సాహిత్యానికీ... సంగీతానికే యివ్వాల్టి సినిమాల్లో చోటే వుండటం లేదు... ఇవ్వాళ చూసిన సినిమా రేపటికి గుర్తుండదు... ప్చ్... చూడాలన్పించదు...

"ఒక పక్క డిస్ట్రిబ్యూటర్లేమో హైర్లు పెంచేస్తుంటిరి... ఒక్క సినిమా కన్నా పెట్టిన హైరు తిరిగొస్తుండాదా,,, ఇప్పుడు హైర్లు గూడ కాదు... యం.జి.... మినిమమ్ గ్యారంటీ... తక్కువొస్తే ఎగ్జిబిటర్ భరించుకోవాలి... ఎక్కువొస్తే డిస్ట్రిబ్యూటర్‌కి కట్టాలి... ఈ పద్ధతులేందో, ఈ శ్లాబ్ సిస్టాలేందో... అసలేమీ అర్థంకావడం లేదు... కరెంట్ బిల్లులు పెరిగిపాయ... టాక్సులు పెంచేస్తిరి... అన్నీ పెరిగిపోయాయి... నీ జనాలు మాత్రం సినిమా హాళ్ళకు రావడం మానేశారు... ఏందోలే శివా..." విజయన్న మాట్లాడుతూ మాట్లాడుతూ మౌనంగా వుండిపోయాడు...

చాలాసేపు యిద్దరి మధ్యా నిశ్శబ్దం.... ఆ నిశ్శబ్దం యిద్దరిలోనూ దుఃఖాన్ని పెంచుతున్నట్లుగా అన్పించి చటుక్కున లేచాన్నేను....

"వదినా సినిమాకి పోదాం, రెండో ఆటకి... తొందరగా అన్నాలు తినేయండి" అరిచినట్లుగా వదినకి చెప్పి... చిన్నన్న కేసి చూసి నవ్వి వరండా మెట్లు దిగి మొక్కల్లో నుండి రాజన్న యింటి వైపుగా నడిచాన్నేను. యింటి లోపలికి మెట్లెక్కబోయి గతుక్కుమన్నాను...

ఆ మెట్ల మీద అమ్మ కూర్చుని వున్నట్టే వుంది... అమ్మ యేనాడూ హాలు లోపలికి వెళ్ళి సినిమా చూసి ఎరగదు... హాలుకీ, యింటికీ నడుమనున్న గేట్లో నుండి... హాలు సింహద్వారంలో నుండి నేరుగా సినిమా తెర కన్పిస్తుంది... మాటలు కూడా స్పష్టంగా వినిపించేవి... బహుశా ఆంధ్రదేశంలోని మరే యితర సినిమా హాలులోనూ ఈ విధంగా యింట్లో కూర్చుని హాల్లో సినిమా చూసే వీలూ, అవకాశమూ వుండవేమో... చటుక్కున ఆ మెట్ల మీద కూర్చుని మెట్లని తడిమాను... అమ్మ కూర్చుని 'సంపూర్ణ రామాయణం' చూస్తున్నట్లే వుంది...

"ఏందిరా శివా... యిక్కడ కూచున్నావు... పద భోంచేద్దాం" బుకింగులైపోయినట్టున్నాయి... రాజన్న యింట్లోకి వస్తూ అన్నాడు... లోపలికి పోయిన కళ్ళూ, పీక్కుపోయిన బుగ్గలూ, పుల్లల్లా వేలాడుతోన్న చేతులూ... పలచబారిపోయిన పాదాలూ... రాజన్న రంగు కూడ ఎట్ట పోయిందో...

నేను లేవకపోయేటప్పటికి తనూ వచ్చి నా పక్కనే మెట్ల మీద కూచున్నాడు... ఇద్దరి మనసులూ బరువుగా, మూగగా ఏదో మాట్లాడుకుంటున్నాయి...

"ఇక్కడికే తెచ్చేదా మీ యిద్దరికీ..." మనవరాల్ని నిద్రపుచ్చినట్టుంది వదిన కూడా తీరిగ్గా వచ్చి మా పక్కనే కూర్చుంది...

"నాకు మాత్రం హాలు అమ్మేది యిష్టమంటరా శివా "నా మనసులో మాటని గ్రహించినట్లుగా అన్నాడు రాజన్న... ఈ సినిమా హాలు కట్టేప్పుడు రాజన్న పనివాళ్ళతో పాటు రాళ్ళు కొట్టేవాడు... సిమెంటందించే వాడు... చిట్టి చిట్టి చేతులతో నీళ్ళు కూడా పట్టేవాడు... యిద్దరి మనసుల్లోనూ అవే మెదులుతున్నాయి...

"అది కాదన్నా... యిట్టంతా... హాలు అమ్ముకోవలసిన పరిస్థితి ఎందుకొచ్చింది?..." అన్నాను తడబడుతూ... నిజానికి రాజన్న నిలదీయాలని లేదు... అలాగని దీని వెనుకనున్నదేమిటి?... ఎందుకిలా జరిగిందో తెలుసుకోకుండా వుండాలనీ లేదు...

రాజన్న మౌనంగా వుండిపోయాడు... వదిన కల్పించుకుంది.

"ఎందుకొచ్చిందంటే ఏం చెప్తాం... అంతా మా ఖర్మ... లక్షణంగా చదువుకొన్నాడు కదా మీ అన్న... ఆద్యుడయినా ఒక ఉద్యోగం చూసుకోనున్నా బతికి పొయ్యుణ్ణు..." మా ఆయన ఉద్యోగస్తుడు కాబట్టి మేము హైదరాబాద్ వంటి మహానగరంలో సకల సౌకర్యాలతో జీవించేస్తున్నామని వదిన ఆలోచనా, ఆరోపణా...

"ఇంత పెద్ద ఫర్మ్‌ని వొదిలిపెట్టి ఎవరికిందనో పోయి ఉద్యోగం చేసేది నాయిన కిష్టం ల్యాకపాయ... సినిమాహాళ్ళు మరీ యింత దిగనాస్తయి పోతాయని నాయినేమయినా కలగన్నాడా?... యిదే హాల్లోనే కదా ఒకప్పుడు మనమంతా సుఖంగా బతికినాం..." కసురుకున్నాడు రాజన్న...

"బతికినప్పుడు జాగర్తపడుండాల... నన్ను కసిరేది గాదు... పెద్ద బిడ్డకింకా కట్నకానుకలు చాల్లేదని అత్త మండిపడిపోతా వుంది. చిన్నదానికి హాస్టల్ ఫీజులు పంపాల..." విసురుగా లేచి లోపలికెళ్ళిపోయింది వదిన... జాలిగా చూశాన్నేను వదిన కేసి... ఆమె అభద్రతా భావం ఆమెది...

చిన్నది నిత్య నెల్లూరు హాస్టల్లో ఉంది. దాన్ని చదివించడం ఒక ఎత్తయితే రేపు పెళ్ళి చేయడం మరో ఎత్తు... అందునా నెల్లూరు రెడ్ల కుటుంబాల్లో అది చిన్న విషయమేమీ కాదు... ఆలోచనలో పడ్డాన్నేను....

అయిదు నిమిషాలు చీకటితో పోటీ పడింది నిశ్శబ్దం... ఆ తర్వాత చెప్పాడు రాజన్న నన్ను అనునయించదాని క్కాబోలు...

"శివా! అప్పుడు సినిమాలు తప్ప మరే వినోదమూ లేని స్థితి వుండేది... అప్పటికి వీధి నాటికలూ, తోలు బొమ్మలాటలూ మరుగున పడిపోయి స్టేజి నాటకాలు, అక్కడక్కడా వుండేవి... మరీ మూకీలు పోయి టాకీలొచ్చాక సినిమా అంటే అంత యిష్టమైన వినోదమైపోయింది ప్రేక్షకుడికి...

మన థియేటర్ కట్టక ముందు ఈ వూళ్ళో టూరింగ్ టాకీస్ వుండేది... అంతా దాన్ని 'టెంట్' అని పిలిచేవాళ్ళు... ఆ టెంట్ అప్పుడప్పుడూ సంవత్సరానికి రెండు మూడుసార్లు ఎత్తేయడం... మళ్ళీ పెట్టడం చేస్తుండేవాళ్ళు... యింక వర్షమొస్తే చాలు అంతా గందరగోళమైపోయేది... ఆ తర్వాత్తర్వాత జనాలు టెంటుకెళ్ళడం కన్నా థియేటర్లో సినిమా చూడ్డానికే యిష్టపడేవాళ్ళు... ఈ వూళ్ళో మొదటి పర్మినెంట్ థియేటర్ మనదే కావడంతో బాగా జరిగేది...

ఈ వూళ్ళో మొదటి పర్మినెంట్ థియేటర్ మనదైతే ఆంధ్ర దేశానికంతా మొదటి సినిమాహాలు విజయవాడలో కట్టడం జరిగింది..." నవ్వాడు రాజన్న... రాజన్నకి గాలీ, నీళ్ళూ... అన్నమూ, ఆహారమూ అన్నీ ఆ హాలే... అది తప్ప మరో రంగమూ... ప్రపంచమూ తెలీదు...

ఒకప్పుడు అంటే సుమారు అరవైల నుండి ఎనభై అయిదు దాకా కావొచ్చు జనం సినిమాలు విపరీతంగా చూసేవాళ్ళు... ఆడవాళ్ళు మరీ నూన్‌షోలు వచ్చాక చాలా ఎక్కువగా గుంపులు గుంపులుగా పక్కింటివాళ్ళు... ఎదురింటి వాళ్ళు అందరూ కలసి మెలసి సినిమాలకెళ్ళేవాళ్ళు... నేను స్కూలుకెళ్తూ వుంటే చాలామంది ఆడవాళ్ళు.

'మీ హాల్లో ఏం సినిమా అమ్మాయ్?' అని అడుగుతుండేవాళ్ళు.

అదే అన్నాను రాజన్నతో.

'నిజమే అప్పుడు సినిమా వ్యాపారం మూడు పువ్వులు, ఆరు కాయలుగా వుండేది... ఈ చుట్టుపక్కల పల్లెటూర్ల నుండి జనమంతా బండ్లు కట్టించుకుని మరీ సినిమాల కొచ్చేవాళ్ళు... ఆ తర్వాత వూరూరికీ బస్సులు పడ్డ తర్వాతయితే... ఫ్లోటింగ్ చాలా ఎక్కువగా వుండేది... ఒక్కో సినిమా రెండు, మూడుసార్లు చూసేవాళ్ళు జనం..."

వదిన మళ్ళీ వచ్చింది... ప్లేట్లలో చపాతీలు పెట్టుకుని వేడిగా...

"ఈ టివిలొచ్చి పడి ఆడోళ్ళందరూ ఎవరిళ్ళల్లో వాళ్ళు దినం తప్పకుండా సీరియల్స్ చూస్తుండిరి... అచ్చం సినిమాల మాదిరే వుండె.. అదీగాక ఈ లోకల్ ఛానల్ కొత్త కొత్త సినిమాలేసేస్తుండె... ఇం సినిమాలకెందుకొస్తారు జనం..." నా చేతికి ప్లేటందించి రాజన్న వైపుగ వెళ్ళింది వదిన...

సినిమా వ్యాపారం పూర్తిగా దెబ్బతినిపోవడంతో టి.వి.ల ప్రముఖ పాత్ర వహించాయనడంలో అనుమానమేమీ లేకపోయిన కేవలం టి.వి.ల వల్లేనా?... అయితే నగరాల్లో సినిమా హాళ్ళు అం బాగా ఎట్లా జరుగుతున్నాయి...? నా ఆలోచన గ్రహించినట్లుగా.

"టి.వి.లు రావడం తప్పు కాదు... దూరదర్శన్ ఒక వున్నపుడు బాగానే వుండేది... కానీ ప్రభుత్వం ఈ ప్రైవేట్ ఛానళ్ళ అనుమతినివ్వడంతోనే యిదంతా ఒక ఉప్పెన మాదిరి సినిమాల ముంచేసింది దినానికి మూడు నాలుగు సినిమాలు, ఎన్నో సీరియల్ పాటలూ, వార్తలూ, ఎక్కడో జరిగిన నిజమైన నేరాలు – ఘోరాలు. యివన్నీ కూడా మరెక్కడికీ పోకుండా మనింట్లో మనం ప చేసుకుంటూనో, అన్నం తింటూనో, పిల్లల్ని నిద్రపుచ్చుతూనో చూసేయగలుగుతుంటే రిక్షాలేసుకుని, ఆటో లేసుకుని సినిమా పరుగెత్తాల్సిన అవసరం ఎవరికుంది?.... నీగ్గుర్తుందా...? ఆదివారమై ఈ ఊళ్ళో వైశ్యులంతా తప్పనిసరిగా సినిమాకొచ్చేవాళ

కుటుంబాలతో... ఇప్పుడు చూద్దామంటే కూడా ఒక్కరు కన్పడ్డం లేదు... ఊళ్ళో అందరికంటే ముందు వాళ్ళే టి.వి.లు కొనుక్కున్నది.... కేబుల్ టి.వి.లు పెట్టించుకున్నదీ... ఈ కేబుల్ టి.వి.లు కూడా మరో వ్యాపారమైపోయింది జనాలకి...

చపాతీ ముక్కలు చేస్తూ రాజన్న వంకే చూస్తున్నాన్నేను... అన్న కూడా తింటున్నట్టుగా లేదు... ముక్కని కూరలో అద్దుతూనే వున్నాడు.

"ఈ వ్యాపారస్తులు పల్లెల్లో కూడా అంగళ్ళు పెట్టేసి... ఇప్పుడే వస్తువు కావాలన్నా టౌన్‌కొచ్చే పనే ల్యాకపాయ... అప్పుడంటే సామాను కొనుక్కోవడానికి టౌన్‌కొచ్చి పనిలో పనిగా సినిమాలు చూసి పోతుండే వాళ్ళు..." చెప్పింది వదిన నా ప్లేట్లో కూర వడ్డించి తినమని హెచ్చరిస్తూ –

"ఇటీవల పదిహేనేళ్ళ లోపల చాలా మార్పులొచ్చాయి శివా... ఆ మార్పుల మూలంగా పేదోళ్ళు మరింత పేదోళ్ళయిపోయి... వాళ్ళకి సినిమాలకొచ్చే వెసులుబాటు లేదు... పెద్దోళ్ళకేమో యిళ్ళల్లోనే ముప్పయి ముప్పయ్యయిదించిల టి.వి.లు పెట్టుకుంటున్నారు... యింక సినిమాలకొచ్చే వాళ్ళెవరు...?"




నాకేదో అర్థమయి, కానట్లుగా... ఏదో అర్థం చేసుకోవడానికి ప్రయత్నించి విఫలమవుతున్నట్లుగా వుంది...

"మరి శ్లాబ్ పద్ధతి ఎత్తేయడం వల్ల సినిమా పరిశ్రమ పుంజుకుంటుందనీ... అంతా హర్షం వెలిబుచ్చుతున్నారు కదా... యిప్పుడు మన థియేటర్..." అనుమానంగా అడిగాను...

"ప్చ్ అదంతా మున్సిపాలిటీలకూ... కార్పొరేషన్ల థియేటర్స్‌కి మాత్రమే... నిర్మాతలకీ... డిస్ట్రిబ్యూటర్స్‌కీ ఆనందం... మనకి కాదు...

రామారావు ముఖ్యమంత్రి అయిన కొద్ది కాలానికి అంటే ందొమ్మిది వందల ఎనభై నాలుగులో అనుకుంటాను ఈ శ్లాబ్ పద్ధతి ంచి ఉద్దేశ్యంతోనే ప్రవేశపెట్టాడు... కానీ శ్లాబ్ వల్ల చిన్న నిర్మాతలు రింత చిన్న నిర్మాతలుగానూ పెద్ద నిర్మాతలు మరింత పెద్ద ర్మాతలుగానూ రూపొందారు... శ్లాబ్ పద్ధతిలో పన్ను కట్టలేక రాష్ట్రంలో ల 28వేల థియేటర్లలో ఐదారు వందల థియేటర్లు మూతపడిపోయాయి... శ్లాబ్ చివరికి ఫ్లాప్ అయింది... అప్పట్నుంచీ ్లబ్‌ని రద్దు చేయాలని సినీ ప్రపంచం ఆందోళన చేస్తూనే వుంది కానీ ది యిప్పటికి సాధ్యపడింది... అది కూడా ఈ గ్రామీణ ప్రాంతాల యేటర్లకి వర్తించవు..." ప్రశాంతంగా చెప్పాడు రాజన్న.

* * *

ఆ రాత్రి వదినలిద్దరూ, నేనూ సినిమాకెళ్ళాం రెండో ఆటకి...

ఆ ఎర్రగచ్చు వరండాలో నుండి బాల్కనీలోకి వెళ్ళబోతూ సు రూములోకి తొంగి చూశాన్నేను... అదే టేబిల్, అదే కుర్చీ, ే వేంకటేశ్వర స్వామి, అలివేలు మంగమ్మ ఫోటోలు... ఇప్పుడు టి పక్కగా నాన్న ఫోటో పెద్దది... ఆ ఫోటోకి ఎండిపోయిన పూలమాల ళ్ళాడుతూ నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది... ఆ వైరు కుర్చీలో నాన్న ర్చుని డి.సి.ఆర్. వ్రాస్తున్నట్లే వుంది...

"శివా... శివోడా" అంటూ నన్ను పిలుస్తున్నట్టే వుంది...

ఆఫీసు రూము వైపుగా రెండడుగులు వేసి తలుపు నానుకుని నిల్చుండి పోయాన్నేను... అప్పటికే వదినలిద్దరూ బాల్కనీ మెట్లు ఎక్కుతున్నారు... అప్పటిదాకా పాడుబడిన ఫౌంటెన్‌కి ఆ పక్కగా నిల్చుని వుండిన చిన్నన్న మెల్లిగా నా వెనుగ్గా వచ్చి భుజం మీద చెయ్యేసి మెట్ల వైపుగా నడిపించాడు...

అందరి గుండెల్లోనూ ఏదో పెద్ద బండ దిగేసినట్టుగా వుంది... ఆ బండల్ని మీటుతూ మళ్ళీ.

"నమో వెంకటేశా... నమో తిరుమలేశా" అన్న పాట మొదలైంది.

అప్పట్లో మా కుటుంబ సభ్యులెవరమూ బాల్కనీలోకెళ్ళి సినిమా చూసేవాళ్ళం కాదు... బాల్కనీ అంతా క్రిక్కిరిసినట్టుగా వుండేది. ఇదిగో ఈ ఎర్రగచ్చు మీద కుర్చీలు వేయించుకుని ప్రత్యేకంగా చూసే వాళ్ళం... ఇప్పుడు బాల్కనీ అంతా ప్రత్యేకంగానే వుంది... ఖాళీగా...

పైకెళ్ళి ఆ కుర్చీల్లో కూర్చుంటుంటే సుదీర్ఘమైన ఎడబాటు తర్వాత బాల్యమిత్రుణ్ణి ఆలింగనం చేసుకుంటున్నట్లుగా అన్పించింది...

ఈ కుర్చీల్లో సినిమా చూస్తూ చూస్తూ నేను నిద్రపోతే నాన్న కానీ, రాజన్న కానీ, గేట్లో వున్న మనిషో నన్ను ఎత్తుకుని తీసుకెళ్ళి యింట్లో పడుకోబెట్టడం గుర్తుంది... నా స్నేహితులందర్నీ తీసుకొచ్చి యిదే కుర్చీల్లో కూర్చోబెట్టి ప్రతీ సినిమా చూపించేసేదాన్ని...

ఎప్పటెప్పటివో జ్ఞాపకాలు కదలబారుతున్నాయి...

నన్ను చదివించిందీ, నాకు నాగరికత నేర్పిందీ... ఎన్నెన్నో మంచి సినిమాలు చూపించి, నాకు జీవితాన్ని తెలియజెప్పిందీ ఈ సినిమాహాలే.

... నన్నొక విశాల ప్రపంచంలోకి లక్షల కట్నంతో పంపించింది కూడా ఈ హాలే... చుట్టూ కలియజూశాన్నేను...

బెంచీల్లో ఒక నలుగురైదుగురు... కింద కుర్చీల్లో ఒక పదిమందీ... పైన బాల్కనీలో యిద్దరు మనుషులూ మాత్రమే వున్నారు.. మొత్తం మీద ఒక పాతిక ముప్పయిమందుండొచ్చు. ఈ విధంగా లోటు బడ్జెట్‌తో రాజన్న మాత్రం ఎంత కాలము హాలు నడపగలడు...?

ఈ గోడల మీద, ఈ కుర్చీల మీద, ఈ బొమ్మలాడే తెర మీద... హాలు చుట్టూ వున్న అశోక చెట్ల మీద యింతింత భ్రమలెందుకో?.... మనుషులే ఒకరికొకరు కాకుండా పోతుంటే ఈ రాతిగోడల మీద ప్రేమెందుకు?... అందరిలాగే హాలుని ఆస్తిలా చూస్తే యింత వేదన వుండకపోవునేమో... ట్రెండ్ మార్తుతుందనుకున్నపుడే అమ్మేశారు చాలామంది... అప్పుడే అయితే అన్నలిద్దరూ యింత నష్టపోయి కూడా వుండరు.

...ప్చ్ దీర్ఘంగా నిట్టూర్చాన్నేను...

తెర మీద గుంపులు గుంపులుగా యువతీ యువకులు అవయవాలన్నీ కన్పించేలా పీలికల్లాంటి దుస్తులేసుకుని ఆడుతూ, పాడుతూ... ఏవేవో రకరకాల సీసాలు చేత్తో పట్టుకుని పరస్పరాలింగనాలు చేసుకుంటూ... విడిపోతూ....

"అడ్వర్టయిజ్‌మెంట్లు కాదు... ఇది సినిమానే" చెప్పింది పెద్దాదిన అమాయకంగా... వదిన కేసి జాలిగా చూశాన్నేను... ఇప్పటిదాకా స్థిరం లేని మనసులతో మొహాలు మాడ్చుకున్న వదినలిద్దరూ స్థిమితంగా సినిమా చూడ్డం ఆశ్చర్యాన్ని కల్గిస్తోంది. వదినలిద్దరికీ హాలుని సొమ్ము చేసుకోవడం యిష్టంగానే వున్నట్టుంది...

నా కళ్ళు సినిమా మీద కాకుండా హాలంతా, బయటకీ కలియతిరుగుతున్నాయి... బయట టీ అంగట్లో చిన్న లైటు వెలుతురులో పిండి కలుపుతున్నాడు నారాయణ... సమోసాలకి కాబోలు...

* * *

"పాప్‌కార్న్... మామూల్దికాదు... మీగడతో వేయించింది..."

గుండ్రటి బల్ల చుట్టూ వేసిన మూడు కుర్చీల్లో ఖాళీగా వున్నదాంట్లో కూర్చుంటూ ఎత్తయిన కాగితపు పెట్టెలో నింపిన పాప్‌కార్న్‌ని తండ్రి ముందుంచాడు సునీల్...

"మమ్మీ చికెన్ కబాబ్ తీసుకురానా ?"

"వద్దొద్దు సన్నీ... యిప్పుడే కదా కాఫీ తాగొచ్చాను"

"పిచ్చి మమ్మీ... మనం యింటి నుండి యిక్కడికి రావడానికి ముప్పావు గంట పట్టింది" హుషారుగా వున్నాడు వాడు...

"అయినా వొద్దు! సినిమా అయ్యాక హోటల్ కెళ్దాం" చెప్పాన్నేను.

ఇది కూడా వాడి సూచనే... మధ్యాహ్నమే శాసించాడు రాత్రికి వంట చేయొద్దని...

"డాడీ... యిది తింటూ మీరు అలా వెళ్ళి షాపింగ్ చేస్తుండండి. మమ్మీకి యిదంతా చూపించండి... వచ్చేస్తాను... టికెట్లు కన్‌ఫర్మ్ చేసుకుని తీసుకొస్తాను...." హడావిడిగా వెళ్ళిపోయాడు సన్నీ.

"పద" అన్నారీయన కళ్ళెగరేస్తూ... ఆ కళ్ళు చాలా చురుగ్గా వున్నాయి...

కళ్ళు, పెదవులూ కూడా నవ్వుతున్నాయి... చాలాకాలం తర్వాత ఆ నవ్వు సన్నిహితంగా కూడా వుంది... కొడుకింత వాడయ్యాడన్న గర్వమూ... నిశ్చింతా కన్పిస్తున్నాయి... ఎప్పుడూ డబ్బు సంపాదనలోనూ, కొడుకుని నిలబెట్టడంలోనూ తీవ్ర ఒత్తిడిలో వుండే వ్యక్తి స్థిమితంగా వున్నారు...

"ఎక్కడున్నాం మనం?" ప్రశ్నించాన్నేను అనాలోచితంగా... ఆయన వెంట అడుగేస్తూ...

వరుసగా షాపులు... గుడ్డలంగళ్ళు... ఫ్యాన్సీ సామాను... బ్యాగులు యింక హాట్ ఫుడ్స్ సరేసరి... ఆ ప్రాంగణమంతా కాంతులు విరజిమ్ముతున్న నియాన్ లైట్లతో మిరుమిట్లు గొల్పుతోంది...

"సినిమా హాల్లో షాపులేమిటండీ?" తెరిచిన నా నోట్లో నుండి ఆశ్చర్యం పెల్లుబుకుతూనే వుంది...

"ప్చ్.... వీటిని షాపులనరు... మాల్స్... మాల్" అంటారు...

"ఓహో మాయమంత్రవేసి మనతో ఏదో ఒకటి కొన్పిస్తారన్నమాట... అబ్బో బ్యాంకు కూడా వుందే... అవునవున్లే వీళ్ళు దోపిడీ చేసేస్తే మళ్ళీ మళ్ళీ మనం డబ్బుల కోసం బయటికి పరుగెత్తకుండా యిక్కడికిక్కడే అన్నీ సౌకర్యాలు" నుండుకొస్తోంది నాకు...

"ష్... అరవొద్దు"




"ఏందండీ... మూడు గుప్పిళ్ళ పాప్‌కార్న్ షోగ్గా వుండే కాగితప్పెట్టెలో పోసి అది యాభై రూపాయలా?... ఒక్క సినిమా టికెట్ రెండు వందల రూపాయలా?... దోపిడీ కాక మరేందిది?" విసుక్కున్నాను ఎవరైనా వినిపోతారేమో అనుకోకుండా...

నవ్వాడాయన..

"ఇక్కడ రెండు వందలే... అదే బెంగుళూర్లో ఫోరమ్ థియేటర్స్ అని... అక్కడయితే అయిదు వందలు ఒక టికెట్టు... అయితే మనకు టిఫిన్, టీ, కూల్‌డ్రింక్స్ అన్నీ యిస్తారు..."

నాకెందుకో మాట్లాడబుద్ధి కాలేదు... నా చిన్నప్పటిలా దారి దొంగలంటూ ప్రత్యేకంగా లేరిప్పుడన్పించింది... తేరుకుని చుట్టూ చూసేటప్పటికి దూరంగా ఒక షాపు ముందు నిలబడి చిన్న పాప డ్రస్ ఒకటి బేరం చేస్తున్నాడీయన... పక్కింటావిడికి మనవరాలు పుట్టింది... ఆ పాపకయి వుంటుంది...

వడి వడిగా అడుగులేసుకుంటూ వెళ్ళి ఆయన వెనకే నిల్చున్నాన్నేను...

"ఫోర్ నైన్టీనైన్ సర్" చెప్తోందా కోకిల.

మా ఆయన ఆ రేట్లు చూసి బెదిరిపోయి మొహమాటంగా మెల్లిగా మరో షాపులోకి జారుకుంటున్నాడు... లోలోపలే నవ్వుకుంటూ అనుసరిస్తుండగా సన్నీ వచ్చి రక్షించాడ మమ్మల్ని....

"రండి డాడీ టయిమయింది" అంటూ న భుజం చుట్టూ తన కుడి చెయ్యాన్చి... లోపలి నడిపిస్తూ...

"ఎలా వుంది మమ్మీ... స్టేట్స్‌లో కూడా యిలా వుంటుంది... ఒకే చోట ఎన్నో థియేటర్స్. అక్కడే మాల్స్, హోటల్స్, బ్యాంక్స్... ఎక్కడికి వెళ్ళాల్సి అవసరముండదు..." డబ్బులో మునిగి తేలుతోన్న ఒక గొ ఆనందమేదో ఆవహించినట్టుగా వున్నాడు సన్నీ...

లోపలికి ప్రవేశించడంతో మాటలాపి టిక్కెట్లిచ్చి మూ కళ్ళద్దాలు చేతిలోకి తీసుకున్నాడు...

"కళ్ళజోడు పెట్టుకుని సినిమా చూడ్డమేంట్రా... నా కళ్ళిం బాగానే వున్నాయి..." విసుక్కున్నాన్నేను వాడినేడిపిస్తూ...

"మమ్మీ... డోన్ట్ బీ ఫూలిష్... ఇది త్రీడి మూవీ... కళ్ళజో పెట్టుకుంటేనే పిక్చర్ క్లియర్‌గా వుంటుంది... లేదంటే గ్లేజిం కన్పిస్తుంది. ఆ ఎఫెక్ట్స్ అన్నీ ఈ కళ్ళజోడు పెట్టుకుంటేనే తెలుస్తాం

"వెల్‌కం టు ఐమాక్స్ థియేటర్" అన్న మాటలతో మే లోపలి కడుగుపెట్టాము... కళ్ళు తిరిగినట్టయి నిలదొక్కుకున్నాన్నే వెయ్యి, పదిహేను వందల మంది ఒక్కసారిగా చూడ్డానికి వీ అలా ఒకదానిపైన మరొకటి సీట్లు స్టెప్స్ స్టెప్స్‌గా ఒక పెద్ద స్టేడియ వుందా సినిమా హాలు... విస్తుపోయి చూస్తున్నాన్నేను...

" 'క' రోలో లెవన్, ట్వెల్వ్, థర్టీన్" చెప్పాడు గేట్‌కీప గేట్ కీపర్‌ను క. నదేమో... పెద్ద ఆఫీసర్లా వున్నాడు... అతడికి పేరేదయినా వుండే వుంటుంది.

ఆ మెట్లన్నింటికీ రెండు వైపులా చిన్న చిన్న బల్బులు అ వున్నారు... గనుల్లో పనిచేసే వారి టోపీల కున్నట్లుగా... ఆ మీద తడుముకుంటూ వెళ్ళి మాకు కేటాయించబడ్డ కుర్చీల్లో కూలబ మామూలు సినిమా హాళ్ళలోలా కాకుండా ఆ కుర్చీలు సౌకర్యవంతంగా సుఖంగా వున్నాయి... ఒక తేలికైన పరిమళ

గాలిలో తేలివచ్చి ఘ్రాణశక్తుల నావహిస్తోంది...

నేనా త్రీడి సినిమా చూసి ఎక్కడ దదుచుకుంటానోనని తండ్రీ కొడుకులిద్దరూ బాడీ గార్డుల్లా చెరోవైపూ కూర్చున్నారు...

"మమ్మీ... స్టేట్స్‌లో టి.వి.లొచ్చి సినిమాలని ముంచేస్తోన్న సమయంలో ఐమాక్స్ థియేటర్స్, ఫోరమ్ థియేటర్స్... 3డి సినిమాలు... యానిమేషన్ పిక్చరైజేషన్... యివన్నీ ప్రవేశపెట్టారు... ఈ ఎఫెక్ట్స్ కోసం యింత గొప్ప సాంకేతిక నిపుణత్వంతో తీసిన సినిమాల కోసం ప్రేక్షకులు తప్పనిసరిగా థియేటర్లకు రావల్సిన స్థితి..." ఈ 'త్రిడి' సినిమాలు ఏ సందర్భంలో కనిపెట్టారో చెప్తున్నాడు సన్నీ...

"అవున్రా, మరి సినిమాల్ని నిలబెట్టడం కోసం ఈ ఐమాక్స్, త్రిడి నువ్వు చెప్తోన్న ఈ ఎఫెక్ట్స్ అన్నీ వచ్చాయి బాగానే వుంది... మరి వీటివల్ల మావూలు థియేటర్స్ దెబ్బతినవా" కరెంట్ మగ్గాల వల్ల చేనేత దెబ్బ తినిపోయినంత తేలిగ్గా అడిగాను...




"కావొచ్చు... కాకపోవచ్చు... కానీ తప్పదు మమ్మీ... పడిపోతూన్న వ్యాపారాన్ని నిలబెట్టుకోవడం కోసం కొత్త కొత్త టెక్నిక్స్ ఉపయోగించాలి. సీట్లు మార్చాలి... రంగులు వేయించాలి... లైటింగ్, సౌండ్ సిస్టమ్ అన్నీ మార్చాలి ఎప్పటికప్పుడు... రాజు మామలా అలాగే వుంచుకుంటే థియేటర్స్ నడవవు..."

"మా థియేటర్లోలా సౌండ్ సిస్టమ్ మరెక్కడా వుండదు... ఎంత థ్రిల్‌గా వుంటుందో తెలుసా?... గుంటూరు నుండి వస్తాడు సౌండ్ ఇంజనీర్ నెల నెలా..." ఉడుక్కున్నాన్నేను...

నేను నిన్నగాక మొన్న కన్న సన్నీ... కొత్త ప్రపంచాన్ని పరిచయం చేస్తూ రాజు మామకి తెలీని వ్యాపార విలువల్ని బోధిస్తున్నాడు... వేలెడు లేడు వీడు... విసుగ్గా తెరకేసి తలతిప్పాను.

పట్టాల మీద దట్టంగా పేరుకుపోయిన మంచుని రెండు వైపులకీ చెదరగొడుతూ దూసుకుంటూ నా ముఖం మీదికి వచ్చేసింది రైలు... "పోలార్ ఎక్స్‌ప్రెస్"

కెవ్వుమంటూ కేకేసి... చప్పున సిగ్గుతో నా ఒళ్ళో నేనే తలదాచుకున్నాను... త్రిడి కళ్ళజోడు కిందపడకుండా చప్పున చేతికి చిక్కించుకున్నాడు సన్నీ...

"ప్చ్ అమ్మా ఏంటమ్మా నువ్వు... ఇది పగిలిపోతే లేదా చిన్న స్క్రాచ్ పడినా కూడా అయిదొందలు కట్టాలి మనం..."

"అదొకటా మళ్ళీ..." ఈసారి ధైర్యాన్ని అరువు తెచ్చుకుని సన్నీ చేతిని గట్టిగా పట్టుకుని కళ్ళద్దాలు తగిలించుకుని సినిమాలో లీనమయ్యాన్నేను...

అప్పటికి బాల కథానాయకుడు తటపటాయిస్తూనే పోలార్ రైలెక్కాడు.

* * *

నారాయణ చేస్తోన్న సమోసాలని యాభై రూపాయలు పాప్‌కార్న్‌తో పోల్చి చూద్దం కాదు గానీ... సన్నీ చెప్పిన (కు) యుక్తులు నిజమేనా? సీట్లు మార్చి... రంగు వేయించి... షోకులు చేసి సౌండ్ సిస్టమ్ మార్చేస్తే హాలుకి జనాకర్షణ పెరుగుతుందా?... అప్పుల బెదదతో రోజురోజుకి కుంగిపోతున్న రాజన్న యిప్పుడివన్నీ చేయించగలడా?... కొత్త అప్పులు తీసుకురావడం ఎంతవరకూ సమంజసం...?... అయోమయమైన ఆలోచనలతో బుర్రగిర్రున తిరిగిపోతుంది...

* * *

సంతకం మీద నీటి బొట్టు పడి అలుముకుపోయింది...

మొత్తం ప్రపంచమే మసక మసగ్గా వుంది...

రాజన్న చెయ్యి కూడా వొణుకుతోంది...

మా కుటుంబ జీవితానికి అర్ధ శతాబ్దపు సాక్షీభూతమైన సినిమా హాలు యిక మాది కాదు... దాంతో మాకెటువంటి సంబంధమూ లేదిక... హాలుకీ, యింటికీ నడుమనున్న పెద్ద పెద్ద గేట్లు శాశ్వతంగా మూతపడిపోయాయి...

నాన్న మరణించిన నాటి దుఃఖం మళ్ళీ అందర్నీ ఆవహించింది...

కింకర్తవ్య విమూఢుల్లా, ఏమీ తోచనట్లు మౌనంగా వుండిపోయాం అందరం...

విజయన్న మాత్రం ఏదో నిర్ధారించుకున్నవాడిలా గంభీరంగా వున్నాడు...

నేను కూడా మూడు నిర్ణయాలు తీసుకున్నాను దుఃఖాన్ని అధిగమించడం కోసం...

మా ఆయన చెప్పి పంపినట్లుగా హాల్లో భాగమడక్కపోవడం...

విజయన్న కొడుకుని నాతో పాటు తీసుకెళ్ళి ఎం.బి.ఎ.లో చేర్చడం.

రాజన్న చిన్న కూతురు నిత్యని కోడలు చేసుకోవడం...

వీటన్నింటికీ నేను చెల్లించాల్సిన మూల్యాన్ని పక్కన పెడితే ఇప్పటికి మనసు కుదుటపడవచ్చునన్న ఆశ ఒకటి గుండెల్ని తొలుస్తోంది.

# పాలమూరు పల్లె



ఇంకా తెల్లవారలేదు. చెట్లపైన పిట్టలు కిచకిచమంటున్నాయి. సడక్‌ల పోంటి ఎవరో మాట్లాడుకుంటాపోతున్న సప్పుడు. కొందరు పర్రపర్ర వాకిండ్లు ఊడుస్తున్నరు. "ఇంత రాతటిల ఈల్లకేం వొచ్చిందల్ల వాకిండ్లు ఇప్పుడే ఊడుస్తుర్రు' అనుకుంటూ ఎల్లవ్వ తన గుడిసెలకెల్లి బయటకొచ్చింది.

## గోర్ల బుచ్చయ్య

చలికి గజగజ వణుకుంటూ ముందుకు కదిలింది. ఒక సారి వెనక్కి తిరిగి తలుపును గట్టిగా మూసింది. కప్పుపూసి పోయిన సెప్పున కాలుకేసుకోని పోవట్టింది. చెవులకు చల్లగాలి తగలకుండా ఉండేందుకు కొంగును బిగ్గరగా కప్పుకున్నది. చేతులో రెండు చీపుర్లు పట్టుకున్నది. పెద్ద మూలమలుపు దాటి పెద్ద వేప చెట్టు వద్దకు వచ్చింది. కాళ్లు గుంజినట్లయి అట్లనే కూసున్నది. వారం దినాల సంది ఎడమకాలు తీపులుతీస్తోంది. బలంగా రెండుడగులు ముందుకేసింది. సత్తువ చాలక అట్లనే అడ్డం పడిపోయింది. కుక్కలు బోయ్.... మంటూ అరుస్తున్నాయి. కదలాలని ప్రయత్నించింది. శక్తి చాలలేదు. పై నిండా చెమటలు కారుతున్నాయి. కండ్లు బైర్లు కమ్మినట్లయి అట్లనే పడిపోయింది.

. . .

పిట్టల అరుపులు చుట్టూ కొండలు. పెద్ద పెద్దచెట్లు. వాటి పక్కనే ఏరు సన్నగా పారుతోంది. నిశబ్ద వాతావరణం. కొండ దిగువ విన్పిస్తున్నాయి. మంచు కురిసి వెలిసింది. చెట్ల ఆకులపై నీళ్లు కారుతున్నాయి. అడవి మత్తుగా నిద్ర లేస్తోంది. ఇంకా భాగంలో పాలమూరు కూలీల గుడిసెలున్నాయి. ఆరోజు మానుకం.(సెలవు) ఉదయం ఏడుగంటలైనా గుడిసెల్లోనుండి ఇంగా ఎవ్వరూ లేవలేదు. "ఏంరా ఇంకా పండుకున్నారా లేవండి." "పొద్దుగాల్ల కోళ్లు కూసినప్పుడు లేసోటోళ్లు...లబ్డికొడుకుల్లారా బట్టలుతుక్కోవడానికి పడుతరారా" మేస్త్రీ స్వరం విన్నవారు ఒక్క సారిగా ఉల్కిపడి లేచారు. తొందరతొందరగా బయటకొచ్చారు. "అయ్యా" చెరువుగట్టుకు బయల్దేరారు. పేరుకుమానుకమేగాని రోజంతా పనే ఉంటుంది. "అరే నారిగా" గట్టిగా పిలిచాడు మేస్త్రీ. గుడిసెల్లో అంటూ ఉరుకొచ్చాడు నారి. తొందరగా నీపనన్నీ అయిపోయినాంక ఊర్లెకు పోదాం చెప్పాడు. మేస్త్రీ చంద్రారెడ్డి. మూలుగుతూ పండుకున్న అందర్నీ కసురుకుంటూ లేపుతున్నాడు మేస్త్రీ. "ఏం రా వీరిగా ఇంకా లేవలేదా" అని పెద్దగా అరిచాడు. నాకు లేచాడు వీరయ్య. "నీకు ఇంకా జెరం తగ్గలేదారా?", ఇట్లయితే ఎట్లరా అని కస్సుమన్నాడు మేస్త్రీ. "అయ్యా నికాళ్లుమొక్కుతా మేస్త్రీ లెవడానికి సత్తువ సాల్త లేదు. నీబాంచెన్ నన్ను దావఖానకుతీస్కపో" అని వేడుకున్నాడు వీరయ్య. ఇవేమీ పట్టించుకోకుండా పైసలు తీస్కునేటప్పుడు తనదైనశైలీలో తిట్టడం ప్రారంభించాడు. "పని తప్పించుకోవడానికి ఎందుకు రండమాటలుజెప్పుతవు, చలిజ్వరంతో గుర్తులేదారా నీకు?. జెరమొస్తేసావు. గుడిసెలకెల్లి లేచిమాట్లాడు అంటూ చేయిపట్టి బయటకు గుంజాడు. తీవ్ర పండితే గజగజ వణుక్కుంటూ వీరయ్య బయటకొచ్చాడు. "నీపెండ్లం లేవలేదా, దాన్ని కూడా బయటకు గుంజు". "ఇద్దరు ఇట్ల

పనులెవ్వరు జేస్తురు. జల్దిజల్దిబోయి పొయిలకట్టెలు తీసుకురాండ్రి." అని తీవ్ర స్వరంతోచెప్పి ముందుకెళ్లాడు మేస్త్రీ. వాగుగట్టుకు పోయిన వాళ్లు కట్టెల మొపులు కట్టుకుని గుడిసెల వద్దకొస్తున్నారు. సత్తువ నంతా కూడగట్టుకుని లేచి కూచుకున్నది మశమ్మ. కొంగుకు నడుముకు గట్టిగా చుట్టుకుని లేచింది. చలికి గజగజ వణుకుతున్న తన భర్తను కాస్త ఎండకు జరిగి పండుకోమని చెప్పింది. మేస్త్రమ్మను కాళ్లవెళ్లాపడి వేడుకుని కాసిన్ని వేడినీళ్లు తెచ్చి తన భర్తకిచ్చింది. వాటితో ముఖం కడుకున్నాడు వీరయ్య. సగం చిరిగిపోయిన పంచెను కాళ్లకు కప్పుకుంటూ మూలుగుతూ ఎండలో పడుకున్నాడు. కాళ్లు, చేతులు ఒకటే గుంజుతున్నాయి. మూడు రోజులైంది తిండిలేక. జ్వరంలనే నూకలన్నం తినడంతో రెండు దినాలు వాంతులు, బేదులు అయ్యాయి. చెమటలు ధారగా కారుతున్నాయి. మేస్త్రీ అటుగా వస్తున్న చప్పుడు వినపడటంతో గుడిసెలో ఉన్న గొడ్డలి తీసి భుజానవేసుకుని అడవిలోకి వెళ్లారు.



. . .

"అరే రంగా" ఏడున్నవురా గాడ్దికొడుకా పిలుస్తుంటే సెవులు ఇనపడవా అంటూ రంకెలేశాడు పటేల్ ప్రతాప్. వొస్తున్న దొర అంటూ ఊడిపోతున్న చెడ్డిని పైకి ఎగన్నూకుంటూ వచ్చాడు రంగడు. ఏందయ్యా అంటూ గజగజ వణుకుంటూ పటేల్ ముందు నిలబడ్డాడు. "ఇంతపొద్దయింది బర్లను ఇంకా ఎందుకు ఇడవలేదు లమ్డికొడుకా" అని ముళ్లుగర్రతో రెండిచ్చాడు పటేల్. దెబ్బల దాటికి తాళలేక పదేళ్ల పసి ప్రాణం విలవిలాడింది. ొందుకేడుస్తున్నవురా, నిన్నుకొట్టినాన్నార్రా అంటూ మరో నాలుగిచ్చాడు. 'పటేలమ్మ బోరుకాడికి బోయిరమ్మంటే పోయిన దొరా" అంటూ ెప్పబోయాడు రంగడు. మల్లనాకే ఎదురు చెప్తాతావురా అని కడుపుపై న్నాడు పటేల్. ఎగిరి అంతదూరాన పడ్డాడు రంగడు. "ఉర్కు కొడుకా ర్లను ఇడుసుకపో" అంటూ కసురుకున్నాడు. బోరున ఏడూస్తూ ర్లను మేతకు తీసుకెళ్లాడు రంగడు. కిందికి మీదికి ధారగా వాన రుస్తోంది. చినిగిపోయిన అంగిని సరి చేసుకుంటూ గోనే సంచి త్తిన వేసుకుని బర్లను అనుసరిస్తున్నాడు. వర్షపు నీరు పొల్లాల్లోకి రడంతో బర్లు మేయకుండా చెట్ల కిందకు ఉరుకుతున్నయి. డ్చుకుంటూ రంగడు వాటి వెంట ఉర్కుతున్నడు. కాలుజారీ వాగొడ్డున ిదపడ్డడు. అమ్మా అంటూ అరిచాడు. వాన సప్పుడకు అది ఆశబ్దం నపడలేదు. బర్లు ఎటూ పోయాయో తెల్వదు. నీటి ప్రవాహం ఎక్కువ సాగింది. రంగడు నీటిలో కొట్టుకు పోతున్నాడు. రంగడు అరుస్తూనే న్నాడు...... వాని అరుపులు ఎవ్వరికీ వినపడటం లేదు. అట్లా కొద్ది రం పోయాడు. ప్రవాహంలో కొట్టుకొస్తున్న ఓ మొద్దును ్గాపట్టుకున్నాడు. అది ఒక దగ్గర చెట్టుకు తట్టుకున్నది. దాని యంతో ఒడ్డున ఉన్న ఓకొమ్మను పట్టుకున్నాడు. వణుక్కుంటూ ొడ్డుపైన ఉన్న కానుగ చెట్టుపైకి ఎక్కికూర్చున్నడు. కనుచూపు తెల్లగా వర్షం కురుస్తోంది. ఏమీ కన్పించడం లేదు. చీకటి ్తున్నది. రంగని కన్నీళ్లుకూడా ప్రవాహం అయ్యాయి. తన కోసం ఎక్కడ వెతుకుతుందోనని అనుకుంటున్నాడు. బర్లు ఎవరి చేన్ల ియోనవే దిగులు ఎక్కువ కాసాగింది. పై మీద పడిన దెబ్బలు ్క మంటున్నయి. సాయంత్రం కాసాగింది. వాన ఆగడం లేదు.

రాత్రి కావస్తోంది. వాగు ఉధృతంగా పారుతూనే ఉంది. ఎలాగైనా వెళ్లాలని చెట్టుదిగేందుకు కొమ్మను పట్టుకోనికే వోయిండు చేతులు మొద్దుబారిపోయినవి. కాళ్లు ఆడటం లేదు. పిట్టలా వణుకుతున్నాడు. ఏ మధ్యరాత్రో వాన కొంచెం తగ్గినట్లయింది. కానీ ఏమీ కన్పిస్తలేదు. రంగడు చెట్లకొమ్మల మధ్యనే ఉన్నాడు. "నాయినా రంగన్నా" అంటూ అమ్మపిలిచినట్లనిపించింది. "అమ్మా" అంటూ అరవాలనుకున్నాడు. నోరు పెగలడం లేదు. చలికి దవడలు బిగుసుకు పోయాయి. వేడికన్నీటిబొట్లు చెంపలపై నుండి కారుతున్నాయి. అలా ఎంతసేపు ఏడ్చాడో తెల్వదు. తెలతెలవారుతుండగా చెట్టుదిగాడు.

. . .

పొద్దుగాల్ల సడాక్ పై పడిన ఎల్లవ్వ ఇంకా లేవలేదు. పన్ల తొందర్ల పడి ఎవ్వరూ అంతగా పట్టిచ్చుకోలేదు. పగటీల నుండి వాన షురూ కావడంతో గొడుగులు పట్టుకుని కొందరు. గొనెసంచులు కప్పుకుని మరి కొందరు తమతమ ఇండ్లళ్లకు బోయిండ్రు. బజార్లపొంటి నీళ్లు పారుతూనే ఉన్నయి. చేతిలో చీపురుకట్టలు, నెత్తిన పాతచీర అట్లనే ఉన్నయి. ఎల్లవ్వ ప్రాణం మాత్రం లేదు. కొందరు ముందుకొచ్చి ఎల్లవ్వను కదిపి చూశారు. కాళ్లు, చేతులు బిగుసుకుపోయి ఉన్నవి. చేతిలోఉన్న చీపురు కట్టలను పక్కకు పెట్టారు. "అయ్యో పాపం" అంటూ అందరూ జాలిచూపిస్తున్నారు. "నీళ్లల్లకెల్లి బయటకు తీయండి" అంటున్నారు కొందరు. సరాసరి ఆమె ఇంటికి తీసుకెళ్లండని ఇంకొందరంటున్నారు. ఈమాట ఆనోటా ఈనోటా ఊరంతా పాకింది. గుంపులు గుంపులుగా జనం పెద్దబజార్లకొచ్చిండ్రు. "ఎల్లవ్వ సచ్చిపోయింది". అంటూ కొందరు కళ్లుఒత్తుకున్నారు. ఎల్లవ్వ మృతదేహాన్ని గుడిసె ముందుకు తీసుకొచ్చారు. రాత్రి కురిసిన గాలి వానకు గుడిసె కూడా కూలిపోయింది. ఇంటి ముందు మట్టిపెడ్డలున్నాయి. వాటిని కొంచెంపక్కకేసి ఎల్లవ్వ మృతదేహాన్ని అక్కడ పెట్టారు. "కష్టజీవి. ఎవ్వరితోనూ మాటపడేదికాదు." బతుకంతా ఎట్టిజేసింది." ఇలా ఆమె కష్టం గురించి మాట్లాడుకుంటున్నారు. "గుండ్లపెల్లి సెర్వుకట్టినప్పుడు ఎల్లి పెద్దపెద్ద బండలు మోసింది. శానాగట్టిది" అంటూ డెబ్బై సంవత్సరాల బాలమ్మ గతం గుర్తు చేసుకుంటూ పక్కోళ్లకు చెప్తున్నది. ఊరి పెద్దపటేల్ ప్రతాప్ కూడా అక్కడికొచ్చాడు. తనవంతు జాలి చూపిస్తున్నాడు. ఓనాడు జరమెచ్చిందంటే నేను సర్కారు దవాఖానకు పోమని చెప్పిన అని పక్కనున్నోల్లకు జెప్తుతున్నడు. "అయ్యో ఈ నింటి ముంగటపన్జేచేసిచేసి ముసల్ది సచ్చే" అని కొందరు లోలోఫల గొణుకుంటున్నరు. ఎల్లవ్వ మరణ వార్త విన్న చింతకింద చిన్నయ్య పరుగునా అక్కడికొచ్చాడు. ఎల్లవ్వ శవాన్ని చూసి చలించిపోయాడు. గంగావతి ప్రాజెక్టు వద్ద బ్లాస్టింగ్ జరుగుతున్నప్పుడు ఎల్లవ్వ తప్పించకుంటే తన కథ అంతటితో ముగిసేదని, శ్రమకు పర్యాయపదం ఎల్లవ్వని చెప్పసాగాడు. కష్టజీవని, కష్టానికి మారుపేరని చెప్పుకుంటున్నారు. పొద్దుపోతోంది. కొడుకు, కోడలుకు కబురు జేయండ్రి. కడసారి చూసుకోని అంటూ సాయమ్మ పెద్దగా ఏడూస్తూ చెబుతోంది. సుట్టాలకు కూడా చెప్పండుటున్నారు ఇంకొందరు. బత్కుదెరువుకు ఊరి నుండి శానా మంది దేశం (వలస) పోవడంతో వయస్సోల్లు పెద్దగా కన్పించడం లేదు. తడికాళ్లకు అంటిన

బురదను భూమికేసి పర్రపర్ర రాస్తున్నారు కొందరు. ఎల్లవ్వ గుడిసె వద్ద ముసలి ముతకా జమయ్యారు. దేశాలు పోయిన తమ బిడ్డలొస్తే ముసల్దాన్ని కడసారి చూసేటోళ్లు కాదా ఎంతకాలమొచ్చెగదా దేవుడా అంటూ సాయమ్మ మళ్లీ ఏడ్వడం ప్రారంభించింది. వాన ఎక్కువయ్యేటట్లుంది తొందరగా పన్లు కానియ్యండి అంటూ పటేల్ ప్రతాప్ ముక్కుకు రుమాలు అడ్డుపెట్టుకుని చెబుతూ వెళ్లిపోయాడు.

. . .

వణుక్కుంటూ వీరయ్య ముందుసదుస్తున్నాడు. వెనుక మశమ్మ. ఒక్కసారిగా వీరయ్యకు ఇంటి వద్ద ఉన్న తన తల్లి, కొడుకు గుర్తుకొచ్చారు. గుండె బరువెక్కింది. "ఏందయ్యా పానం బాగాలేదంటే గూడా ఈ మేస్త్రీ మనలను సంపుతున్నడు. ఏంజేయాలే దేవుడా" అని మశమ్మ తన మనస్సులో అనుకుంటోంది. ఈ యేదన్నా పూర్తి సీజన్‌జేస్తే అప్పుతీర్తదని దేశం వచ్చారు. పురుగలన్నం నీళ్లచారు తిని చిక్కిశల్యమై పోయారు. దేశం కాని దేశం, భాషకాని భాష అడవిలో జంతువుల మాదిరి జీవనం వెళ్లదీస్తున్నరు. "అమ్మా" గట్టిగా మూలిగాడు వీరయ్య. ఏందయ్య జెరం ఎక్కువైందా అని వెనిక్కి తిరిగి భర్తను అడిగింది మశమ్మ. ఏంలేదని చేయి సైగ చేశాడు. తనకు నీరసమని చెప్తే తాను కూడా ఏడుస్తుందని ఆయన భయం. భార్యకు ధైర్యం చెప్పి లేవబోయాడు. సాధ్యం అయితలేదు. నడుముకు రుమాలు బిగ్గరగా కట్టుకుని లేచాడు. ఐదేండ్ల కింద ఎండకాలంలో గాలి దుమారులకు పూరిగుడిసె గాలికి కొట్టుకు పోయింది. గట్టి వాసాలు తెచ్చి బందబస్తుగా గుడిసె వేసుకోవాలని వెయ్యి రూపాయల పెట్టి వెదురుబొంగు వాసాలు కొని గుడిసెవేసుకున్నరు. అదే ఏడు ముసలమ్మ పానం బాగాలేక పోతే ఐదొందులు ఓషావుకారు తాన అప్పుజేసిండ్రు. ఈ అప్పులు తీర్చనికే దేశం (వలస) బోయిండ్రు. మొదట మధ్యప్రదేశ్‌కు బోయిండ్రు. అక్కడ నీళ్లు పడక వీరయ్యకు టైఫాయిడ్, మశమ్మకు మలేరియా జెరాలొచ్చినయి. మేస్త్రీ తాన వెయ్యిరూపాయల అప్పు జేసి పానాలు బాగాజేయించుకున్నరు. పనిచేసిన కాడికి పోను రెండువేల ఐదొందలు అప్పులు తేలినట్లు మేస్త్రీలు లెక్కలు జెప్పిండు. ఈ అప్పు తీర్చనికే నాలుగేండ్లు బంగారు బాలయ్య గుంపులో వలస వెళ్లారు. మరుసటేడు రంగడు బీమారైతే దవాఖానాకు నాలుగొందల రూపాయల ఖర్చయింది. బాలయ్య మేస్త్రీ ఇయ్యలేదు. చంద్రారెడ్డి మేస్త్రీతాన అప్పు తీసుకున్నరు. ఇంకో నాలుగొందలు ఇంటి ఖర్చులకని తీసుకున్నరు. అప్పుతీర్చనికే ఈయేడు ఈయన గుంపులో వలస వచ్చారు. ఇవన్నీ తల్చుకుని మశమ్మ కళ్లవెంట పలపలా నీరు కారాయి. వెనక్కి మళ్లి చూసింది. వీరయ్యగొడ్డలి తీసి చెట్టుకు ఆనిచ్చి కొమ్మలను నరుకుతున్నాడు. పక్కనే ఉన్న వాగులోకి వెళ్లింది మశమ్మ. తన వెంట తెచ్చుకున్నరెండు పాతచీరలు, రెండు పాత పంచెలు నీటిలో పిండి ఆరేసింది. తాను ఇన్ని ఒట్టికట్టేలేరుకుని మోపుకట్టుకున్నది. వీరయ్య నీరసంతో చెట్టు మొదటనే పడిపోయాడు. భర్త తానికి ఉరుకొచ్చింది. ఏందయ్యో గిట్లవడ్తివి అని గయ్యిన ఏడ్చింది. వీరయ్య ఉలకలేదు. పలకలేదు. గట్టిగా పిలిచింది. బట్టలన్నీ తడిసిపోయాయి. ఏడ్చుకుంటే గుడిసెల వద్దకు వచ్చింది. ఓ దేవుడో... నానాయినో.... నేనేమిసేతుల్లో అంటూ వాలాలు కట్టి ఏడ్వవట్టింది.



కొందరు మగవారు వెళ్లి వీరయ్యను గుడిసెల వద్దకు తీసుకొచ్చారు. మనిషి పూర్తిగా సన్నబడిపోయాడు. నడుముకు కట్టుకున్న రుమాలు తీసి తల వద్దపెట్టారు. గుడిసెల్లోని వారు ఒక్కసారిగా గొల్లుమన్నారు. విషయం గమనించిన మేస్త్రీ గ్రూపు మేస్త్రీకి సమాచారం ఇచ్చాడు. గ్రూపు మేస్త్రీ కనకారావు గుడిసెల వద్దకు వచ్చాడు. "ఇయ్యాల ఇంట్ల రేపు మంట్ల" ఎందుకెడుస్తున్నరా?. ఎప్పుడో ఒకప్పుడు అందరమూ సచ్చేటోళ్లమేకదా?. అని సముదాయించబట్టిండు. ఆయన మాటలు పట్టించుకోకుండా కొందరాడాళ్లు బిగ్గరగా ఏడుస్తున్నారు. ఏడ్పులు విన్న చుట్టుపక్కల క్యాంపుల వాళ్లు కూడా అక్కడకొచ్చారు. మంది ఎక్కువ కావడంతో గ్రూపు మేస్త్రీ ఆలోచనలు కూడా వేగం అయ్యాయి. ఇక్కడే బొందపెట్టుండ్రా గుజరాత్ నుండి పాలమూరుకు పినిగెను తీస్కపోవాలంటే శానాతిప్పలైతది. అని నచ్చచెప్పవట్టిండు. శవాన్ని తీసుకెళ్తామని కొందరు కూలీలు గట్టిగా పట్టుపట్టారు. చేసేది లేక శవాన్ని తీసుకెళ్లి వాళ్ల బంధువులకిస్తామని, మీరు ఎవ్వరూ రావొద్దని చెప్పాడు గ్రూపు మేస్త్రీ.

. . .

ఊరి ముందల ఎవ్వరో జీపులొచ్చి మూటదించిపోయారని పొలాల నుండి వచ్చిన వారు ఊర్లో వాళ్లకు చెప్పారు. ఈ లా జీపొచ్చి మూటలేసి పోవడం మామూలైందాపల్లెకు. వాళ్లకు కొంత అందుతున్నా ఏమై ఉండొచ్చని కొందరు ఊరి ముందుకు వెళ్లారు. మూట పక్కన చిక్కిశల్యమైన ఓ మహిళా ఏడుస్తున్నది. ఎవ్వరూ ఆమెను గుర్తించలేదు. కొంత సేపటికి ఆమెను మశమ్మగా గుర్తించి ఏమిటని అడిగారు. ఆమె చెప్పడానికి శక్తిలేక ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి పడిపోయింది. కొందరు గ్రామస్తులు మూట విప్పిచూశారు. వీరన్న శవం. అయ్యో కొడుకా వీరన్న అంటూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తోంది ఓ వృద్ధురాలు....చెట్ల మధ్యలో నుండి వణుక్కుంటూ వస్తున్న రంగన్నకు ఏడ్పులు లీలగా విన్పిస్తున్నాయి. బర్లను తీసుకొచ్చి బందరదొడ్ల కొట్టాండ్రోఏమో అని రంగని. గుండె వేగం పెరిగింది. పటేల్‌తో చావు దెబ్బలు తప్పవనుకుంటూ వడివడిగా నడుస్తున్నాడు. కాలుకు తుమ్మల్లు బలంగా దిగింది. సర్రు రక్తం చిమ్మింది. అమ్మా అంటూ కింద పడిపోయాడు. ముల్లును బలంగా బయటకు గుంజాడు. రక్తం కారకుండా కొంతసేపు గట్టిగా వత్తిపట్టుకున్నాడు. కొంతసేపైనాంక రాగాలు దీస్తూ ఏడుస్తున్న వైపు అడుగులేశాడు రంగన్న. వీరన్నా....వీరాన్న...అంటూ పదేపదే విన్పిస్తుంథటంతో వేగంగా ముందుకెళ్లాడు. తమ వాళ్లు కాదుకాదా అని మనస్సులో అనుకున్నాడు. పసిగుండె వేగంగా కొట్టుకుంటోంది. మందిలో నుండి సందు చేసుకుని వెళ్లి చూశాడు. ఎముకల గూడుతో ఉన్న తన తల్లిని వెంటనే పోల్చుకోలేక పోయాడు. అంతే ఒక్కసారిగా వెళ్లి "అమ్మా" అంటూ తన తల్లిని హత్తుకున్నాడు. తల్లికొడుకుల రోదనకు చెరువుగట్టు, చుట్టు పొలాలు ప్రతిధ్వనించాయి. వీరన్న శవాన్ని తీసుకుని ఆయన ఇంటి వైపు అడుగులు వేస్తున్నారు. పాలమూరు పల్లెనిండా నల్లటి తెప్పలు కమ్ముకున్నాయి.

# అంపశయ్య నవీన్ 'దృక్కోణాలు' ఆవిష్కరణ

కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీత డాక్టర్ అంపశయ్య నవీన్ రచించిన "దృక్కోణాలు" నవల డిసెంబర్ 24న వరంగల్‌లో సృజనలోకం ఆధ్వర్యంలో ఆర్ట్స్ & సైన్స్ కాలేజి సెమినార్ హాల్లో ఆవిష్కరించారు. ముఖ్య అతిథిగా విచ్చేసి 'దృక్కోణాలు'ను ఆవిష్కరించిన ప్రముఖ కవి, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉప కులపతి ఆచార్య ఎన్. గోపి మాట్లాడుతూ వాస్తవాన్ని తమకిష్టమైన రంగుటద్దాల్లో చూడాలనుకునే మనస్తత్వాలను చిత్రించాలన్న ప్రయత్నంతో రచించబడిన "దృక్కోణాలు" నవలా రంగంలో ఒక వినూత్న ప్రయోగమనీ, నవీన్ ప్రయోగశీలత్వానికి ఈ నవల మరొక ఉదాహరణ అన్నారు. సాహిత్యకారునిగా నవీన్ నిత్య కృషీవలుడని, 'దృక్కోణాలు' ఆయన 26వ నవల అనీ, ఆయన రాసిన ప్రతి రచనకూ ఒక ప్రయోజనం ఉంటుందని ఆచార్య గోపి అభిప్రాయపడ్డారు.

సభాధ్యక్షత వహించిన ప్రముఖ కవి, నవలాకారుడు రామచంద్రమౌళి మాట్లాడుతూ తెలంగాణా నుంచి గొప్ప సాహిత్యం వెలువడుతుందంటూ 'దృక్కోణాలు'ను తెలంగాణా విజయంగా పేర్కొన్నారు. నవీన్ తెలంగాణాకే కాకుండా 'ఆంధ్రప్రదేశ్'కే గర్వకారణమైన రచయిత అన్నారు. 'దృక్కోణాలు' నవలను సభకు పరిచయం చేసిన ప్రముఖ కవి, కథకుడు జింబో (రాజేందర్) మాట్లాడుతూ 'దృక్కోణాలు' నవలలో ఒకే సంఘటనకు సంబంధించిన ఎనిమిది వెర్షన్స్ ఉన్నాయని, ఒక్కొక్కరూ ఒక్కో విధంగా తమ తమ దృక్కోణాల్లోంచి ఈ సంఘటనను చూస్తారే తప్ప వాస్తవమేమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించరని, ఈ తరహా నవల తెలుగులో ఇంతవరకు రాలేదనీ, 'అకిరాకురసోవ' నిర్మించిన "రోషమన్" చిత్రంతో ప్రభావితుడైన నవీన్ ఈ నవలను రచించాడనీ, ఈ నవలలో పఠనీయతాగుణం పుష్కలంగా ఉందనీ, మొదలెట్టగానే చకచకా చదివించేట్టు చేస్తుందని చెబుతూ, ఈ నవలలోని ఎనిమిది పాత్రల మనస్తత్వాలను విశ్లేషించారు. చలం తర్వాత మళ్ళీ ఇంత వేగవంతంగా చదివించే వచనాన్ని రాసింది నవీనేనని జింబో ప్రశంసించారు.

ప్రముఖ కవి, విమర్శకుడు బన్న అయిలయ్య, డాక్టర్ కె.ఎల్.వి. ప్రసాద్‌లు కూడా "దృక్కోణాలు" గూర్చిన తమ అభిప్రాయాలను శ్రోతలతో పంచుకున్నారు.

ప్రముఖ కవి, నవలాకారుడు, సృజనలోకం నిర్వాహకుడు డాక్టర్ ఎల్.ఎస్.ఆర్. ప్రసాద్ అతిథుల్ని సభకు పరిచయం చేస్తూ స్వాగతించారు.

రచయిత నవీన్ తన స్పందనను తెలియజేస్తూ "ఈ నవలలో ఏది వాస్తవం అన్న దానికంటే ఎనిమిది విభిన్న కథనాల ద్వారా మనకు వ్యక్తమయ్యే మనస్తత్వాలను అర్థంచేసుకోవడం ముఖ్యం అన్నారు. ఒక సంఘటనను ఒక్కొక్కరూ ఒక్కొక్క రకంగా దర్శిస్తారు. ఆ దర్శనంలో వాళ్ళ ఇష్టాయిష్టాలుంటాయి. వాళ్ళ స్వార్థం ఉంటుంది. వాళ్ళ వ్యక్తిత్వం ఉంటుంది. వాళ్ళ జీవిత దృక్పథాలుంటాయి. వాళ్ళ రాగద్వేషాలుంటాయి. వాళ్ళ నైతిక విలువలుంటాయి. వీటిని బహిర్గతం చేయడమే ఈ నవలలో జరిగింది. 'అంపశయ్య'లాగే ఈ నవల కూడా ఒక ప్రయోగమే. ఏది రాసినా ఒక కొత్త విషయం చెప్పడానికే రాస్తాను" అంటూ నవీన్ తన స్పందనను ముగించారు. వరంగల్‌లోని కవులూ, రచయితలూ, సాహిత్యాభిమానులూ ఈ సభకు హాజరై నవీన్‌ను అభినందించారు.

**- డాక్టర్ ఎల్.ఎస్.ఆర్. ప్రసాద్**

# 'ప్రాణం - ప్రణవం' ఆవిష్కరణ



'నానీలు' కవితా ప్రపంచంలో డాక్టర్ ఎం. విజయశ్రీ ంచిన "ప్రాణం - ప్రణవం" నానీల సంపుటి ప్రవేశించింది. ఫిబ్రవరి న త్యాగరాయ గాన సభలో కిన్నెర ఆర్ట్స్ థియేటర్స్ ఆధ్వర్యంలో హించిన కార్యక్రమంలో పద్మభూషణ్ డాక్టర్ సి. నారాయణరెడ్డి నానీల సంపుటిని ఆవిష్కరించారు. ఆనాటి పురాణాల్లోని అంశాల్ని ాటి సమాజానికి అనువర్తింపచేస్తూ డాక్టర్ ఎం. విజయశ్రీ తన ల్లో వ్యక్తీకరించారనీ, తాత్వికంగా చూసినపుడు ప్రాణమనేది మిక స్థాయిలోకి చేరుతుందనీ, ప్రణవం అనేది దానికి చరమస్థాయి వంటిదని ఈ సందర్భంగా సినారెగారు విశ్లేషించారు. డాక్టర్ గోపి నానీలను సృష్టిస్తే, నానీలు కొత్త కవులను సృష్టిస్తున్నాయన్నారు. సంస్కృత సాహిత్యంలో కవయిత్రికి ఉన్న పాండిత్యంతో కవిత్వానికి ప్రాణమైన ధ్వనితత్వాన్ని నానీల్లో అద్భుతంగా వినిపించారని ప్రశంసించారు. నానీల సృష్టికర్త డాక్టర్ ఎన్. గోపి మాట్లాడుతూ ఈ నానీల్లో సృజనాత్మకత, భావుకతతో పాటు స్త్రీ దృక్కోణం కూడా సమపాళ్ళలో మిళితమైందన్నారు. సామాజిక స్పృహతో పాటు మానవీయతతో పాఠకుల గుండెలు కదిలించేవిగా ఉన్నాయన్నారు. పులిచింతల ప్రాజెక్టు డిప్యూటీ కలెక్టర్, కవి సోమేపల్లి వెంకట సుబ్బయ్య విశిష్ట అతిథిగా పాల్గొన్నారు. ఉస్మానియా సంస్కృత శాఖ అధ్యక్షులు డాక్టర్ కేశవ నారాయణ శుభాకాంక్షలందజేశారు. ప్రముఖ రచయిత్రి డాక్టర్ సి. మృణాళిని కావ్య సమీక్ష చేస్తూ ఇప్పటి వరకూ వచ్చిన నానీల్లో ఈ రకమైన నానీలు ఒక కొత్త వికాసానికి తోడ్పడుతున్నాయన్నారు. ఆచార్య సి. శశిరేఖ కూడా కావ్య సమీక్ష చేశారు. కవయిత్రి డాక్టర్ ఎం. విజయశ్రీ కావ్యం తొలి ప్రతిని తన మాతృమూర్తి మహాకాళి ప్రభావతిగారికి అంకితం చేశారు.

# 'అక్షరాల్లో దగ్ధమై' గ్రంథావిష్కరణ

తెలుగు సాహిత్యంలో డాక్టర్ ఎన్. గోపిది శిఖరాయమానమైన స్థానమని జ్ఞానపీఠ గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి అభివర్ణించారు. గోపి రచించిన 'అక్షరాల్లో దగ్ధమై...' కవితా సంపుటి ఆవిష్కరణ సభ ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన సందర్భంగా గ్రంథాన్ని ఆవిష్కరించి సినారె ప్రసంగించారు. తెలుగు సాహిత్యంలో తనదైన శైలితో శిఖర స్థాయికి ఎదిగిన కవి గోపి అంటూ తొలుత పద్యం, గేయం రాసిన ఈ కవి ఆధునిక కవిత్వం వైపు వెళ్ళి నానీల రచనతో ట్రెండ్ సెట్టర్‌గా మారారని, 'జలగీతం' రచనతో మహాకవి అయ్యారని అభినందించారు. ఆయన తన కవితా సంపుటికి వినూత్నమైన నామకరణం చేశారని, అక్షరాల్లో దగ్ధం అవడం అంటే నిత్య నూతన చైతన్యంతో జీవించడమే అన్నారు. గోపి కవిత్వంలో మాధుర్యంతో పాటు వాస్తవిక జీవితాలకు దర్పణం పడుతుందని, శిల్పంతో పాటు భావుకత ఆయన సొత్తు అని అన్నారు. రాష్ట్ర హిందీ అకాడమీ అధ్యక్షులు డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ విశిష్ట అతిథిగా పాల్గొని గోపి కవిత్వాన్ని విశ్లేషించారు. డాక్టర్ పొత్తూరి వేంకటేశ్వరరావు అధ్యక్షత వహించారు. డాక్టర్ ఎండ్లూరి సుధాకర్ గ్రంథాన్ని సమీక్షించారు. ఇంగ్లండ్‌లోని ఈటా అధ్యక్షులు డాక్టర్ చాపరాల బాబూరావు ప్రత్యేక అతిథిగా పాల్గొన్నారు. ఉర్దూ సాహితీవేత్త శ్రీ సయ్యద్ ఖాలిద్ ఖాద్రీకి ఈ గ్రంథం అంకితమివ్వబడింది.

# 'జలగీతం' పై సమీక్షా సదస్సు

ఇటీవల హైదరాబాద్ అకాడమీ మరియు పంజాగుట్టలోని ఉర్దూ సాహిత్య సంస్థ సంయుక్తాధ్వర్యంలో ఎన్. గోపి రచించిన 'జలగీతం' ఉర్దూ అనువాద గ్రంథం (నగ్మ-ఎ-ఆబ్) సమీక్షా సదస్సు జరిగింది. సెంట్రల్ యూనివర్శిటీ ప్రొఫెసర్ రహమత్ యూసుఫ్ జహీ దీనిని అనువదించారు.

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఉర్దూ సాహిత్య సంస్థ ప్రధాన కార్యదర్శి ప్రొ. మొగినీ తబస్సుమ్, ప్రముఖ కవి, హైదరాబాద్ అకాడమీ అధ్యక్షులు జనాబ్ - ముషఫ్ ఇక్బాల్ తౌషీఫీ, సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉర్దూ శాఖ అధ్యక్షులు డాక్టర్ ఖాసిం ఆలీఖాన్, నేషనల్ ఉర్దూ అకాడమీ అసిస్టెంట్ డైరెక్టర్ డాక్టర్ అబ్దుల్ కలామ్ తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. మూల కవి, అనువాదకుడిని వక్తలు ప్రశంసించారు.



'జల గీతం' ఉర్దూ అనువాద గ్రంథంపై సమీక్షా సదస్సు

సినారె జలగీతం ప్రపంచ భాషలన్నింటిలోకి వెళ్ళాల్సి వుందని భావించారు. ఖాసిం ఆలీఖాన్ తెలుగు, ఉర్దూ భాషల్లో లింగ వ్యవస్థలో (జెండర్) తేడా వుందని అనువాదకుడు దానిని నిపుణంగా అధిగమించాడని పేర్కొన్నారు. అల్లమ్ ఐజాజ్ ఫర్రూఖ్ దీనిని మహాకావ్యంగా భావించారు. గోపి ఉర్దూ అనువాదం పట్ల సంతోషాన్ని ప్రకటించారు. అనువాదకుడి కావ్య పఠనంతో సమావేశం ముగిసింది. ఉర్దూలోని ప్రముఖ సాహితీవేత్తలందరూ దీనికి హాజరయ్యారు.



యలమంచిలిలోని శ్రీ గురజాడ అప్పారావు ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగు శాఖ నిర్వహించిన వచన కవిత్వ రచన శిక్షణా శిబిరంలో భాగంగా డాక్టర్ కె.ఎస్. రామచంద్ర మూర్తి రచించిన 'సమీక్షా కౌముది' పుస్తకావిష్కరణ జరిగింది. చిత్రంలో కళావేదిక గౌరవాధ్యక్షులు శ్రీ చంద్రమౌళి సోమేశ్వరరావు, సాహితీ సురేఖ అధ్యక్షులు మల్లారెడ్డి శంకర ప్రసాద్, ప్రసిద్ధ కవులు, విమర్శకులు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు, రచయిత డాక్టర్ కె.ఎస్. రామచంద్రమూర్తి, అంకితం పుచ్చుకున్న శ్రీమతి కె.వి. లక్ష్మీకుమారి ఉన్నారు.



చలపాక ప్రకాష్ 'హాస్యభిషేకం' కార్టూన్ల సంపుటిని ఇటీవల హైదరాబాద్‌లో ఆవిష్కరించిన కార్టూనిస్ట్ శేఖర్. చిత్రంలో ప్రముఖ రచయిత, పబ్లిషర్ ఎస్.వి. కృష్ణ, చలపాక ప్రకాష్, టేకి రాజా శ్రీనివాస్ కూడా ఉన్నారు

59

# కథానిలయం వార్షికోత్సవం




కథానిలయం 9వ వార్షికోత్సవం ఫిబ్రవరి 12న శ్రీకాకుళంలో జరిగింది. కథా నిలయం ట్రస్ట్ సభ్యుడు దాసరి రామచంద్రరావు ఆహ్వానం పలుకగా కాళీపట్నం రామారావు అధ్యక్షోపన్యాసం చేశారు. 'కథా నిలయం మనందరిది దాని సమగ్రతకు సహకరించండి' అని విజ్ఞప్తి చేశారు. కథా నిలయం కార్యదర్శి వార్షిక నివేదిక చదివి వినిపించి – సభా నిర్వహణ బాధ్యతలు కూడా చేపట్టారు.

ముఖ్య అతిథి, ప్రముఖ కథా రచయిత మునిపల్లె రాజు మాట్లాడుతూ – జీవితానుభవాల నుండి కథలు రావాలని, మానవీయ కోణంలో రచనలుండాలని చెప్తూ – తన అనుభవాలను కొన్నిటిని ప్రసంగంలో పేర్కొన్నారు.

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత అంపశయ్య నవీన్ ప్రత్యేక సాహితీ ప్రసంగం చేస్తూ – నేడు కథల్లో వైవిధ్యం పెరిగిందని, అన్ని వర్గాల వారు కథలు రాస్తున్నారని చెప్పారు. అయితే వర్ధమాన రచయితలు మాండలికాన్ని సంభాషణల వరకే పరిమితం చేయాలని సూచించేరు.

ప్రత్యేకాహ్వానితుల అభిభాషణలో పెద్దిబొట్ల సుబ్బరామయ్య, ఢిల్లీ నుంచి వచ్చిన ప్రొఫెసర్ ఎస్.వి. చలం, గంటేడ గౌరునాయుడు మాట్లాడారు.




ఈ సభలో తుమ్మేటి రఘోత్తమరెడ్డి రూపొందించిన "కారా మాస్టారు" మీద డాక్యుమెంటరీ సిడిల ఆవిష్కరణ జరిగింది.

అనంతరం "రాచకొండ రచనా పురస్కారం" శ్రీ అర్నాద్ గారికి – కారా మాస్టారి చేతుల మీదుగా – నిర్వాహకులు శ్రీ 'రచన' శాయి, ప్రొ॥ కవన శర్మ అందజేశారు. అర్నాద్ రచనలను శ్రీ రామతీర్థ విశ్లేషించేరు. శ్రీ కాళీపట్నం ప్రసాద్ వందన సమర్పణ చేశారు.

కథానిలయం తొమ్మిదో వార్షికోత్సవం సందర్భంగా రెండు రోజులు వేడుకలు జరిగాయి. మొదటిరోజు తేదీ : 11-2-2006న రచయితల స్వీయ పరిచయం, పుస్తకావిష్కరణలు, ఇష్టాగోష్ఠి కార్యక్రమాలు జరిగాయి. ఇష్టాగోష్ఠి కార్యక్రమాన్ని శ్రీకాకుళ సాహితి అధ్యక్షులు, కథా నిలయం కార్యదర్శి డాక్టర్ బి.వి.ఎ. రామారావు నాయుడు ప్రారంభించగా కథా రచయిత శ్రీ ఎ.వి. రెడ్డి శాస్త్రిగారు నిర్వహించేరు. ఇందులో కథ, మంచి కథ, గొప్ప కథల గురించి చర్చ జరిగింది. ఇందులో యగళ్ల రామకృష్ణ, మునిపల్లెరాజు, అంపశయ్య నవీన్, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, చలసాని ప్రసాద్, డాక్టర్ మానేపల్లి, కృష్ణా బాయి మొదలైన ప్రముఖులతో పాటు వివిధ రచయితలు సాహితీ అభిమానులు పాల్గొన్నారు.

తర్వాత పుస్తకావిష్కరణలు జరిగేయి

| పుస్తకం పేరు | రచయిత | ఆవిష్కర్త | పరిచయం |
|---|---|---|---|
| బెహరా వెంకట సుబ్బారావు కథలు | బెహరా వెంకట సుబ్బారావు | శ్రీ కాళీపట్నం రామారావు | డాక్టర్ మానేపల్లి |
| బంధం (సంపుటం) | అర్నాద్ | శ్రీ కాళీపట్నం రామారావు | వివినమూర్తి |
| కథా ప్రహేళిక (సంపుటి) | వివినమూర్తి | శ్రీ కాళీపట్నం రామారావు | ప్రొ॥ కవనశర్మ |
| తప్పెట గుళ్లు (జానపద కళ) | పల్లి తిరుపతిరావు | శ్రీ కాళీపట్నం రామారావు | బొడ్డ కూర్మారావు |
| తుమ్మేటి రఘోత్తమ రెడ్డి కథలు (సంపుటి) | తుమ్మేటి | శ్రీ కాళీపట్నం రామారావు | కృష్ణాబాయి |
| తొలి తెలుగు కథ – ఏడు అభిప్రాయాలు (సంకలనం) | కథానిలయం ట్రస్ట్ | మునిపల్లెరాజు | |

# తెలుగు వెలుగును కాపాడాలి

"ప్రాచీన కాలం నుంచి రాజ భాషే ప్రజలపై ప్రభావం చూపిందనీ, ప్రభుత్వాధినేతల్లో చిత్తశుద్ధి వుంటే తెలుగును అశ్రద్ధ చేయకుండా అభివృద్ధి చేయవచ్చునని గురుదక్షిణ ఫౌండేషన్ ఛైర్మన్ చేకూరి కాశయ్య అన్నారు.

తెలుగును ప్రాచీన భాషగా, ద్వితీయ అధికార భాషగా జాతీయ స్థాయి గుర్తింపునివ్వాలని తెలుగు విశ్వవిద్యాలయం, సాహితీ స్రవంతి సంయుక్త ఆధ్వర్యంలో ఫిబ్రవరి 10న ఖమ్మంలోని జిల్లా కేంద్ర గ్రంథాలయంలో సభ జరిగింది.

సభకు అధ్యక్షత వహించిన కవి, సాహితీ స్రవంతి జిల్లా ఉపాధ్యక్షులు సాదనాల వేంకటస్వామినాయుడు మాట్లాడుతూ "విద్యావంతులు తెలుగు భాషను నిరాదరిస్తున్నారని, నిరక్షరాస్యులు తెలుగును ఆదరిస్తున్నారని అన్నారు.

"స్పష్టమైన భావ ప్రకటన చేయగలిగే శక్తి ఒక్క మాతృభాషకే ఉంటుందనీ, తమిళులకున్న భాషాభిమానం తెలుగు వారికి లేకపోవడం శోచనీయమని భాషా పండితులు డాక్టర్ కె. కోదండ రామాచార్యులు అభిప్రాయపడ్డారు.

ఈ కార్యక్రమంలో ఖమ్మంజిల్లా గ్రంథాలయ కార్యదర్శి శ్రీ శంకరరెడ్డి, డాక్టర్ కె. హరీష్, డాక్టర్ పొత్తూరి సుబ్బారావు, సాహితీ స్రవంతి కార్యదర్శి శ్రీ కె. ఆనందాచారి, శ్రీ ఎస్.వి. నారాయణ, సాహితీ స్రవంతి రాష్ట్ర బాధ్యులు శ్రీ జీవన్ తదితరులు ప్రసంగించారు. భద్రాచలం పార్లమెంట్ సభ్యులు డాక్టర్ ఎం. బాబూరావు, డాక్టర్ రాయణం, డాక్టర్ సోమేశ్వర శర్మ సందేశాలను పంపారు. గాయకుడు శ్రీ శేషగిరి తీర్మానాలను ప్రవేశపెట్టగా, సభ కరతాళ ధ్వనులతో ఆమోదం తెలిపింది. శ్రీ రౌతు రవి స్వాగతం పలుకగా, శ్రీ లెనిన్ శ్రీనివాస్ వందన సమర్పణ చేశారు.

### కర్నూలులో

తెలుగుకు ప్రాచీనతా ప్రతిపత్తి కల్పించాలని కర్నూలులోని జిల్లా పరిషత్ ఆవరణలోని మండల పరిషత్ సమావేశ భవనంలో జనవరి-29 ఆదివారం 'తెలుగు-వెలుగు' అనే అంశంపై సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో చర్చాగోష్ఠి నిర్వహించడమైనది. చర్చలో ఆయా సాహితీ సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తున్నవారు, కళాశాలల ఉపన్యాసకులు, పాత్రికేయ ప్రతినిధులు భాషాభిమానులు పాల్గొన్నారు. చర్చకు సమన్వయకర్తగా సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి వ్యవహరించారు. చర్చనుద్దేశించి రవి మాట్లాడుతూ యునెస్కో విడుదల చేసి నివేదిక ఆధారంగా తెలుగు 2015 నాటికి శిష్ట జనం వాడుకనుండి అదృశ్యమయ్యే ప్రపంచీకరణలో భాష నాశనమవుతుందని అన్నారు. రచయిత హీరాలాల్ మాట్లాడుతూ తెలుగు భాషాభివృద్ధికి, ఉద్యమ స్ఫూర్తికి కృషి చేయాల్సిన అవసరం ఉందన్నారు. డాక్టర్ రవీంద్రబాబు మాట్లాడుతూ పాత్రికేయులు భాషను ప్రజల వద్దకు తీసుకెళతారని, వారికి శిక్షణ ఇవ్వాలని అన్నారు. తెలుగు భాషా వికాసం నాయకులు శర్మ మాట్లాడుతూ తెలుగువారినే రాష్ట్రానికి ఐ.ఎ.ఎస్.లను నియమించాలని, పాఠ్య పుస్తకాల తీరు మారాలని కెంగార మోహన్ చర్చకు తీసుకువచ్చారు. చర్చలో తెలుగుకు ప్రాచీనతా ప్రతిపత్తి సవరించాలని, అధికార భాషగా తెలుగును సక్రమంగా అమలు చేయాలని, పరభాషా వ్యామోహం నుండి తెలుగు ప్రజలను బయటపడేందుకు ప్రతి ఒక్కరు కృషి చేయాలని తీర్మానించారు. చర్చను మోహన్ ప్రారంభించగా, చర్చలో సాహితీ స్రవంతి జిల్లా నాయకులు సుబ్బన్న చక్కటి తెలుగు పాటను పాడి వినిపించగా, వందన సమర్పణ జంధ్యాల రఘుబాబు చేశారు. చర్చలో తెలుగు పండితులు




తెలుగు విశ్వ విద్యాలయం, సాహితీ స్రవంతి సంయుక్తంగా ఖమ్మంలో నిర్వహించిన సదస్సులో సభాధ్యక్షుడు సాదనాల వేంకట స్వామినాయుడు ప్రసంగిస్తున్న దృశ్యం.

జయశంకరశర్మ, ఐ. వెంకటేశ్వర్లు, ఎలమర్తి రమణయ్య, రచయితలు అజీజ్, చంద్రశేఖర్, అధ్యాపకులు డా॥ సంజన్న, భాస్కర్‌లు సూచనలిచ్చారు.

### మహబూబ్‌నగర్‌లో

మహబూబ్‌నగర్‌లో ఫిబ్రవరి 24న తెలుగు భాషపై సదస్సు జరిగింది. వల్లభాపురం జనార్ధన అధ్యక్షత వహించగా ప్రాజెక్టు స్పెషల్ కలెక్టర్ షంషీర్ అహ్మద్ ప్రారంభోపన్యాసం చేశారు. జనసాహితి నాయకులు దివి కుమార్, నిర్మలానంద, సాహితీ స్రవంతి కన్వీనర్ తెలకపల్లి రవి ప్రసంగించారు.

### హైదరాబాద్‌లో

అధికార భాషా దినోత్సవం సందర్భంగా ప్రజానాట్యమండలి హైదరాబాద్ నగర శాఖ ఆధ్వర్యంలో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో చర్చాగోష్ఠి జరిగింది. ప్రజానాట్యమండలి నగర అధ్యక్షులు అధ్యక్షత వహించగా జ్వాలాముఖి సమన్వయకర్తగా వ్యవహరించారు. చేకూరి రామారావు, అద్దేపల్లి రామమోహనరావు, చంద్రశేఖర ఆజాద్, డి. చంద్ర శేఖరరెడ్డి, చుక్కారామయ్య, వావిలాల సుబ్బారావు, తెలకపల్లి రవి తదితరులు ప్రసంగించారు.

### రాజమండ్రిలో

జనవరి 19వ తేదీన అధికార భాషా సంఘం 'తెలుగు వికాసం' పేరిట రాజమండ్రి ఆనం కళాకేంద్రంలో భాషోత్సవం జరిగింది. అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ ఎబికె ప్రసాద్, అధికార భాషా సంఘం సభ్యులు శ్రీ కాలువ మల్లయ్య, జిల్లా అధికార భాషా సంఘం అధ్యక్షులు, జిల్లా కలెక్టర్ సింఘాల్, మంత్రివర్యులు శ్రీ జక్కంపూడి రామమోహనరావు, శాసనసభ్యులు రౌతు సూర్య ప్రకాశరావు, ద్వా.నా. శాస్త్రి ప్రభృతులు పాల్గొని మొదటి సదస్సులో జిల్లా అధికార యంత్రాంగానికి తెలుగు అమలుపై చర్చలు, ఉపన్యాసాలు జరిగాయి. జిల్లా కలెక్టర్ శ్రీ సింఘాల్ పంజాబ్ రాష్ట్రానికి చెందినవారైనా పదిహేను నిమిషాల సేపు ఒక్క ఇంగ్లీషు పదం లేకుండా తెలుగులో మాట్లాడటం ప్రత్యేకమైన విశేషం. ముగింపు సభలో సాహిత్య రంగానికి చెందిన డాక్టర్ ద్వా.నా. శాస్త్రి, కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, డాక్టర్ ఎండ్లూరి సుధాకర్‌లను ప్రత్యేకంగా సత్కరించారు.



రాజమండ్రిలో డాక్టర్ ద్వా.నా. శాస్త్రిని సత్కరిస్తున్న అధికార భాషా సంఘం అధ్యక్షులు డాక్టర్ ఎ.బి.కె. ప్రసాద్

# 'పుస్తక పరిచయ' సభ




పుస్తక పరిచయ సభలో మాట్లాడుతున్న గౌరునాయుడు, వేదిక మీద అప్పలనాయుడు, జి.ఎస్. చలం, డా॥ రామసూరి, అల

జనవరి 28 శనివారం విజయనగరం స్థానిక గురజాడ గ్రంథాలయంలో పుస్తక పరిచయ కార్యక్రమం జరిగింది. సాహితీ స్రవంతి నిర్వహించిన ఈ సభలో అట్టాడ అప్పలనాయుడు "అనగనగా ఒక రాజద్రోహం" నవల, గంటేడ గౌరునాయుడు "నదిని దానం చేశాక" కవితా సంపుటి పుస్తకాలను, శ్రీ అల, శ్రీరామసూరి పరిచయం చేశారు. ఈ సందర్భంగా రామసూరి మాట్లాడుతూ ప్రజల పక్షాన నిలచిన కవి పదికాలాల పాటు జీవిస్తాడని అన్నారు. కవిత్వం ద్వారా ప్రజలను చైతన్యవంతం చేయడంతో పాటు జ్ఞానాన్ని కూడా అందించిన ఘనత మహాకవి గురజాడకు దక్కుతుందన్నారు. ప్రపంచ ఆర్థిక విధానాలు భారతీయ సంస్కృతికి గొడ్డలి పెట్టులా మారాయన్నారు. ప్రపంచీకరణవిధానాల ప్రభావం చిన్నారులు కోల్పోతున్న అమూల్యమైన బాల్యాన్ని గౌరునాయుడు చక్కగా వివరించారని సమీక్షించారు. 'బతుకు చీర నుంచి బాల్యం అంచులను వేరు చేస్తున్నదెవరో' అంటూ చిన్నారుల గురించి ఆవేదన చెందిన తీరు పాఠకులను ఆలోచింప చేస్తుందన్నారు.

అనగనగా ఒక రాజద్రోహం నవలను సమీక్షించిన అల ఉత్తరాంధ్ర భూపోరాటాలు, రైతు కూలీల కష్టాల గురించి ఇనాం భూములు గురించి, రాజకీయాల అనైతిక రాజకీయాలను గురించి అత్యంత వ్యంగ్య వైభవంతో రచయిత చిత్రించారని అన్నారు. అనంతరం అప్పలనాయుడు, గౌరునాయుడు తమ రచనల నేపథ్యాన్ని గురించి వివరించారు. సభకు జి.ఎస్. చలం అధ్యక్షత వహించారు. సాహితీ స్రవంతి జిల్లా కన్వీనర్ సిహెచ్. దివాకర్ వందన సమర్పణ చేశారు.

# 'ప్రభు'కు ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు

ఆధునిక కవిత్వానికి 'ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు-2005' కోసం 'ప్రభు' కవితా సంపుటి పారిపోలేం... ఎంపికైందని అవార్డు వ్యవస్థాపకులు కవి 'రాధేయ' ఒక ప్రకటనలో తెలియజేశారు.

ఈ అవార్డు న్యాయ నిర్ణేతలుగా డా॥ బి. సూర్యసాగర్ (అనంతపురం), డా॥అమ్మంగి వేణుగోపాల్ (హైదరాబాద్), డా॥ నందిని సిధారెడ్డి (సిద్ధిపేట) గార్లు వ్యవహరించారు. ఈ అవార్డు పొందిన వారిలో 'ప్రభు' 18వ వారు. ప్రభు కాకినాడకు చెందినవారు. ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్నారు. అవార్డు పొందిన 'పారిపోలేం' కవితా సంపుటి జీవచైతన్యాన్ని ఉన్నతీకరించే కవిత్వంగా న్యాయ నిర్ణేతలు ప్రశంసించారని రాధేయ వివరించారు. ఈ అవార్డు ప్రదానోత్సవం జూన్ / జూలై నెలలో జరుగుతుందని తెలియజేశారు.

# 'చిటికెలు' ఆవిష్కరణ

కవి, రచయిత దాస్యం సేనాధిపతి రచించిన 'చిటికెలు' నానీల సంకలనం మార్చి 12వ తేదీన కరీంనగర్ సాహితీ గౌతమి ఆధ్వర్యంలో ఆవిష్కరించబడింది. ఈ సందర్భంగా ముఖ్య అతిథిగా హాజరైన తెలుగు విశ్వవిద్యాలయం మాజీ ఉపకులపతి ఆచార్య ఎన్. గోపి మాట్లాడుతూ అనుభవం ద్వారా వ్యక్తమయ్యేదే నిజమైన కవిత్వం అని అన్నారు. సేనాధిపతి నానీలు వైవిధ్యభరితంగాఉన్నాయని అభినందించారు. నేడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా నానీల ప్రక్రియ విస్తరించడం శుభ పరిణామమని అన్నారు. విశిష్ట అతిథిగా పాల్గొన్న కాకతీయ విశ్వవిద్యాలయం పాలక మండలి సభ్యులు చీటి అయోధ్య రామారావు మాట్లాడుతూ సేనాధిపతి నానీల్లో శిల్పం బాగుందని తెలిపారు. గౌరవ అతిథిగా పాల్గొన్న కవయిత్రి శ్రీమతి ఎన్. అరుణ మాట్లాడుతూ సేనాధిపతి నానీల్లో ఆర్తి, ఆర్ద్రత వున్నాయని వివరించారు. యువ కవి డాక్టర్ పత్తిపాక మోహన్ పుస్తకాన్ని సమీక్షిస్తూ 'చిటికెలు'లోని నానీలు ఆలోచింపజేసేవిగా ఉన్నాయని తెలిపారు. ఈ సందర్భంగా కవి సేనాధిపతిని ఘనంగా సన్మానించారు. ఈ కార్యక్రమంలో సాహితీ గౌతమి అధ్యక్షులు మాడిశెట్టి గోపాల్, ప్రము ఖ కవులు జూకంటి జగన్నాథం, డాక్టర్ సంగనభట్ల, డా॥ గండ్ర, డా॥ బోయినపల్లి, పంజాల జగన్నాథం, అన్నవరం దేవేందర్, పోలేపల్లి వెంకటరెడ్డి, వేణుశ్రీ తదితరులు ప్రసంగించారు. సాహితీ గౌతమి ప్రధాన కార్యదర్శి బి.వి.ఎన్. స్వామి వందన సమర్పణ చేశారు.



మార్చి 12వ తేదీన కరీంనగర్‌లో కవి దాస్యం సేనాధిపతి రచించిన 'చిటికెలు' నానీల సంకలనాన్ని ఆవిష్కరిస్తున్న ఎన్. గోపి తదితరులు

## కదిలించిన కడప జనకవనం

వేదెక్కించే రాజకీయకేంద్రమైన కడప జిల్లా పరిషత్ సభాభవనం జనవరి 2న ప్రజా కవిత్వంతో ప్రతిధ్వనించింది. పదునైన, పసందైన కవితావస్త్రాలు, ఔత్సాహికుల ఉత్సాహాలు, అనుభవజ్ఞులైన వారి సందేశాలు రసహృదయులను అలరించాయి. సిఐటియు రాష్ట్ర 10వ మహాసభల సందర్భంగా సాహితీస్రవంతి అధ్వర్యంలో జరిగిన 'జనకవనం' కొత్త ఒరవడి పెట్టింది. ఈ రాష్ట్రస్థాయి కవిసమ్మేళనంలో కడపజిల్లా వివిధ ప్రాంతాల నుండి వచ్చిన కవులేకాకుండా వివిధ జిల్లాల సాహితీ ప్రియులు పాల్గొని గళం వినిపించారు. 60 మంది కవులు తమ కవితలను వినిపించారు. ప్రముఖ విమర్శకుడు, అధికార భాషాసంఘం సభ్యుడు డా॥ రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి 'జనకవనం' కార్యక్రమ ప్రారంభోపన్యాసం చేశారు. తెలుగు కవిత్వంలోని ప్రగతిశీల సాంప్రదాయాలను ముందుకు తీసుకుపోవడంలో సాహితీ స్రవంతి కృషి అభినందనీయమన్నారు. ప్రపంచీకరణ మానవ విలువలన్నింటినీ మటుమాయం చేస్తున్నప్పుడు చైతన్యవంతుడైన కవి మౌనంగా ఉండజాలడని అన్నారు. ఈ విధమైన మెలకువ ఇప్పుడు తెలుగు సాహిత్యాన్ని కదిలిస్తున్న ప్రధాన ప్రేరణ అని వివరించారు. ప్రక్రియ ఏదైనా, ప్రజాశ్రేయస్సు పరమావధిగా పురోగమించడం 'జనకవనం' లక్ష్యమని చెప్పారు. తెలుగు భాష అంతరించి పోయేంత ప్రమాదాన్ని ఎదుర్కొంటోందని, దానిని రక్షించుకోవాలని పిలుపునిచ్చారు.

సీనియర్ కథారచయిత, రాయలసీమ సామాజిక విశ్లేషకుడు సింగమనేని నారాయణ ముఖ్య అతిథిగా హాజరై ప్రసంగించారు. కవులు, రచయితలు తాము ఎవరి పక్షమో నిర్ణయించుకుంటే తప్ప రచనా స్పష్టత రాదన్నారు. సామ్రాజ్యవాదాన్ని, మార్కెట్ శక్తుల దురాక్రమణను నిరోధించడం నేడు సాహిత్యకారుల ప్రధాన బాధ్యతగా వుందని గుర్తు చేశారు. కాలానుగుణమైన మార్పులతో ముందుకు సాగేదే సృజనాత్మక సాహిత్యమని వివరించారు. సాహిత్యంలో అనేక వాదాలు అంతిమంగా ఒకే సైద్ధాంతిక మార్గంలో ఇమిడి పోవాల్సివుంటుందని విశ్లేషించారు.

సాహితీస్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి 'జనకవనం' కార్యక్రమాన్ని సమన్వయం చేస్తూ ప్రసంగించారు. కడప ప్రాంతానికి కొన్ని వందల యేళ్ళనుండీ తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానం వుందన్నారు. అన్నమయ్య, వేమన, వీరబ్రహ్మం వంటి వారు ఆనాడే సామాజిక సత్యాలను చాటిచెప్పి ప్రజా వాగ్గేయకారులయ్యారని పెద్దన, పోతన వంటివారి పేర్లు కూడా ఇక్కడ స్మరణకు వస్తాయన్నారు. ఆధునిక, అభ్యుదయ సాహిత్యం కూడా వికసించిందని గుర్తుచేశారు. ఆ వారసత్వంతో జిల్లాలోనూ, మొత్తం రాష్ట్రంలోనూ ప్రగతిశీల సాహిత్య సృజనను, చర్చను ముందుకు తీసుకుపోయే విశాలవేదికగా సాహితీస్రవంతి తన కృషి కొనసాగిస్తుందన్నారు. జనవరి-2 మహాకవి శ్రీశ్రీ జయంతి కావడంతో సభ ఆయనకు ప్రత్యేకంగా జేజేలు అర్పించింది.

ఈ కవిసమ్మేళన కార్యక్రమంలో లక్ష్మీకాంతం శ్రేష్టి, జానమద్ది హనుమచ్ఛాస్త్రి, తక్కోలు మాచిరెడ్డి, తవ్వా ఓబుల్‌రెడ్డి, యస్వీ రామసుబ్బారెడ్డి, నూకా రాంప్రసాద్ రెడ్డి, శశిశ్రీ, సత్యాగ్ని, వి. సుబ్బారాయుడు, యదాటి వెంకటేశ్వర్లు, ఆత్మీయ సందేశాలిచ్చారు.

ఈ కార్యక్రమం రెండు భాగాలుగా జరిగింది. ఉదయం జరిగిన సెషన్‌కు సాహితీస్రవంతి కన్వీనర్ శ్రీ. శ్యామ్, మధ్యాహ్నం జరిగిన సెషన్‌కు ప్రజాశక్తి సాహితీ సంస్థ జిల్లా కన్వీనర్ ఎస్. మస్తాన్ వలీ అధ్యక్షత వహించారు. ఆహుతులకు ఎ. రఘునాథ్ రెడ్డి, గంగుల రామచంద్ర రావు స్వాగతం పలికారు ○



## పత్తెం-మల్లొక పైత్తెం

-వేముల ఎల్లయ్య

కపట కాయిని జూలు గుర్రం రంగు తిర్గిన నుడిగీతలు
లచ్చల తూట్లు కండ్లు ఎగబాకిన అచ్చరాలు
జాజు గోడ మీద పోంటిను పొంగిన సిరా
జావు మడత దేవర ఎలుక కొరుకుడు

ఏమీ! నీ రాక రాకాని రావండెం
కవి రచయిత కాల రాత్రి
తుర్కల సేద్దెం బుర్కలెట్ల మేసినయ్
మనమై కిటికి దర్వాజ నవ్వింది దేసం దేవుని పటం

నయీ-ఇత్యం వానంలో ఇప్పపూల సప్పరింత
జయజయ జయజయ జయ'ఓం'
దుచ్చుర్య సచ్చుర్యై దూలాడుతుంది.....
'పైన పటారం లోన లొటారం'
వగ పటాలం పరివార్ పత్రికంతా!

పుట్ల కొద్ది వోనపాములు పొదినిండె
ముస్లిం ముషాయిరాలో గలత్తై గుడిమెట్ల బోర్లై
బెత్తెడు గుడ్డ పేలికై నీ పాట్లెన్నిరా భాయీ

కైతై వాగుల తేలి వొండు ముద్దల్ల
రంగ రిచ్చిన పసరు తీట కోయిలాకై నిండు తానమాడతండె

సంకల వొయి జారి గజ్జల్ల పడ్డది
గజల్ నినాదం ఇనిపిస్తవా!
నిప్పుకు ఉప్పుకున్నంత వైరం
సవాల్ కా జవాబ్ కవిత్వం




సభలో ప్రసంగిస్తున్న ఆంధ్ర విశ్వవిద్యాలయం జర్నలిజం డిపార్ట్‌మెంట్ అధిపతి పి.బాబీవర్ధన్, సాహితీ స్రవంతి సభ్యులు ఎన్‌వీఎన్ స్వామి, ఎన్.రమణాచలం

# సామ్రాజ్యవాదంపై సాహిత్య భేరి

సామ్రాజ్యవాదాన్ని ప్రతిఘటిస్తూ ప్రపంచవ్యాప్తంగా పెల్లుబుకుతోన్న నిరసన ఉద్యమంలో కవులు, రచయితలు భాగస్వాములై తమ గళాలను, కలాలను ఝుళిపించాలని ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆంధ్రవిశ్వవిద్యాలయం జర్నలిజం డిపార్ట్‌మెంట్ అధిపతి డాక్టర్ పి.బాబీవర్ధన్ పిలుపునిచ్చారు. సామ్రాజ్యవాదానికి ప్రతీక జూనియర్ బుష్ పర్యటనను వ్యతిరేకిస్తున్న నిరసన గళాల్లో తమ గొంతులను కూడా కలపాలని కోరారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యాన ఫిబ్రవరి 25 సాయంత్రం ఎల్ఐసి భవన ప్రాంగణంలో కవి సమ్మేళనం జరిగింది. అంతకుముందు జరిగిన ప్రారంభ సభలో బాబీవర్ధన్ మాట్లాడుతూ, సమాజంలో వస్తున్న మార్పుల పట్ల స్పందిస్తూ దానిని పదిమందికీ పంచగలిగే అవకాశం ఒక్క కవులకు మాత్రమే ఉందని, ఒక్క అక్షరంతో వారు లక్షల మెదళ్లను కదిలించగలుగుతారని అన్నారు. మూడో ప్రపంచదేశాల వనరులపై గుత్తాధిపత్యం సాధించటానికి బల ప్రయోగానికి పాల్పడుతున్న బుష్ ఆగడాలపై ప్రపంచవ్యాప్తంగా నిరసనలు వెల్లువెత్తుతున్నాయని, స్వాతంత్రోద్యమ కాలం నాటినుంచి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడటంలో ఘనమైన చరిత్ర కలిగిన తెలుగు కవులు తమ వారసత్వాన్ని మరోమారు చాటిచెప్పాలని అన్నారు. యుద్ధోన్మాది బుష్ ప్రపంచ పోలీసు పాత్ర పోషిస్తూ దొంగ తనే దొంగ దొంగ అని గోలచేసినట్టు ఉగ్రవాదం అణిచివేత పేరుతో ఉగ్రవాద చర్యలకు పాల్పడుతున్నాడని అన్నారు. తన అభిజాత్యానికి అడ్డం వచ్చిన దేశాల్లో అంతర్యుద్ధం రగిలిస్తూ సామ్రాజ్యవాదాన్ని ముందుకు తీసుకుపోతున్నాడని విమర్శించారు. అమెరికాకు వంతపాడుతున్న యుపిఎ ప్రభుత్వం కూడా జార్జిబుష్‌కు ఎర్ర తివాచీ స్వాగతం పలకడానికి సిద్ధపడుతోందని, సామ్రాజ్యవాదానికి పాలకులు దాసోహమైన ప్రజలు దాసోహం కారన్న సత్యాన్ని చాటి చెప్పాలని బాబీవర్ధన్ అన్నారు. సభకు అధ్యక్షత వహించిన సాహితీస్రవంతి కార్యవర్గసభ్యులు ఎన్‌వీఎన్ స్వామి మాట్లాడుతూ, జాతీయ అంతర్జాతీయ రాజకీయాలు సామాన్యప్రజానీకం జీవితాలను ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ప్రభావితం చేస్తున్నాయని అన్నారు. అందుకు ఎవరూ మినహాయింపు కాదని, రాజకీయాలు మాకెందుకంటూ నిమ్మకు నీరెత్తినట్టు వ్యవహరించటం బుద్ధిజీవులైన కవులు, రచయితలకు తగదని అన్నారు. ప్రజాసమస్యలపై గళమెత్తే కవులు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా తమ గళాలను బలంగా వినిపించాల్సిన సమయం ఆసన్నమైందని స్వామి అన్నారు. బుష్ భారత పర్యటనను అందుకు వేదిక చేసుకోవాలని, ఇరాక్‌లో జరుగుతున్న నరమేధానికి, ఇప్పుడు ఇరాన్‌పై పాల్పడుతున్న దుందుడుకు చర్యలకు నిరసనగా తమ కలాలను కదిలించాలని స్వామి పేర్కొన్నారు. అంతకు ముందు సాహితీ స్రవంతి కన్వీనర్ ఎన్.రమణాచలం అతిథులకు, కవి సమ్మేళనంలో పాల్గొన్న కవులకు స్వాగతం పలికారు. సాహితీ స్రవంతి సభ్యులు మురళీధర్ వందన సమర్పణ చేశారు. జివిఎన్ చలపతి, అరుణ్‌జీ, ఎవి రమణరావు తదితరులు సభా కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కలాలు- గళాలు ఆవిష్కరణ

హైదరాబాద్ నగర సాహితీ స్రవంతి ప్రచురించిన కలాలు- గళాలు కవితా సంకలనాన్ని ప్రముఖ కవి అద్దేపల్లి రామమోహనరావు ఇటీవల ఆవిష్కరించారు. హిమజ్వాల సంకలనాన్ని పరిచయం చేయగా శిఖామణి, తెలకపల్లి రవి ప్రసంగించారు. సాహితీ స్రవంతి నగర కన్వీనర్ జి.యాదగిరి రావు స్వాగతం పలకగా సంకలన కర్త ఎ.సత్య భాస్కర్ తమ అనుభవాలు వివరించారు. తంగిరాల చక్రవర్తి వందన సమర్పణ చేశారు. సంకలనానికి కవితలు అందించిన వారితో సహా పెద్ద సంఖ్యలో సభికులు పాల్గొన్నారు. ...ందకు పైగా కవితలతో వెలువడిన ఈ సంకలనం సాహిత్య మిత్రులను విశేషంగా ఆకర్షించింది.



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, ...

# రాలిన పత్రాలే వాలిన పక్షులు !



కూర్పు : ముక్తవరపు వసంతకుమారి

# Fuel conservation for healthier environs.



## Share the Care

Do you know, we have a fearsome number of patients having respiratory problems ? Millions among them being children, the worst affected section of population. Blame it all on indiscriminate emission from vehicle exhaust, factory chimneys and fuel burning devices, which has led to rapid environmental degradation & loss of precious fuel.

Save fuel and make this world live longer.

Contact PCRA for free information on oil conservation tips in Transport, Industry, Agriculture and Domestic Sector

66

Together we can DO it




PETROLEUM CONSERVATION RESEARCH ASSOCIATION
(Ministry of Petroleum & Natural Gas)
10, Bhikaiji Cama Place, New Delhi-110066
Phone : 26198809, 26198856 Fax : 26109668
E-mail : pcra@pcra.org

WHERE CONSERVATION FAILS, POLLUTION STARTS ● OIL CONSERVATION FOR A CLEAN ENVIRONMENT



| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A119 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |